మహాకవి భోజరాజ ప్రణీతమగు

# చంపూ రామాయణము

ఆంధ్ర టీకా తాత్పర్య విశేషాంశసహితము



వ్యాఖ్యాత

శ్రీమాన్ తట్టా నరసింహాచార్యులు, ఎమ్.ఏ.,

కల్పవల్లీ పబ్లికేషన్సు

గూడూరు (కృష్ణాజిల్లా)

# చంపూ రామాయణము

## అరణ్య, కిష్కింధకాండములు

(టీకా తాత్పర్య విశేషాంశములతో)

ప్రతులు : 1000

వెల : రూ. 25/-




ప్రకాశకులు :

కల్పవల్లి పబ్లికేషన్సు
గూడూరు, కృష్ణాజిల్లా.

ముద్రణ :

శ్రీసత్యసాయి ప్రింటర్స్
6-2-151సి, సాయిరాంవీధి, టి నగర్
తిరుపతి - 517 501

# కృతజ్ఞతలు

శ్రీభోజరాజ విరచితమగు చంపూరామాయణమునకు ఆంధ్ర టీకా తాత్పర్య విశేషాంశములను వ్రాసి బాల-అయోధ్యకాండలను మొదటి భాగముగ తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థికసాహాయ్యముతో ఇదివఱకే ప్రచురించితిని. ఇపుడు అరణ్య, కిష్కింధకాండలకు పైమాదిరి గనే టీకా తాత్పర్యాదులను సంతరించి ప్రచురించుచుంటిని. లోగడ వలెనే ఇపుడు కూడా తి. తి. దేవస్థానము వారు ఆర్థికసాహాయ్యము నందించి నా మార్గమును సుగమమొనర్చిరి. అందులకు వేంకటాద్రీశు డగు, శ్రీ శ్రీనివాసప్రభువుకు, తి. తి. కార్యనిర్వహణాధికారులకు, విశేషించి సంపాదకులు శ్రీ కె. సుబ్బారావు గారికి నా కృతజ్ఞతల నందించుచున్నాను.

ఈ పుస్తకమును తగినంత జాగ్రత్తగా ముద్రించి యిచ్చిన శ్రీసత్యసాయి ప్రింటర్స్, తిరుపతి వారికి నా కృతజ్ఞతలు.

గూడూరు,
1—4—90

తట్టా నరసింహాచార్యులు

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీ భోజరాజ సార్వభౌమ విరచిత

# చంపూ రామాయణము

ఆంధ్రటీకాతాత్పర్య సహితము

# అరణ్యకాండము

ప్రవిశ్య విపినం మహత్తదను మైథిలీ వల్లభో
మహాబల సమన్వితశ్ఛలిత నీలశైలచ్ఛవిః
నిశాచర దవానల ప్రశమనం విధాతుం శరైః
చచార సశరాసనస్సురపథే తటిత్వానివ.

అర్థము— తదను-దండకావనములో ప్రవేశించిన తరువాత, మహాబలసమన్వితః - అప్రమేయబలశాలియు, ఛలిత నీలశైల చ్ఛవిః-నధఃకృతమున్న నల్లకొండయొక్క కాంతివంటి కాంతిగలవాడును, ను, మైథిలీవల్లభః-సీతామహాలక్ష్మి యొక్క భర్తయగు శ్రీరాముడు, మహత్-పెద్దదియగు, విపినం-దండకారణ్యమును, ప్రవిశ్య-ప్రవేశించి, శరైః-బాణములతో, నిశాచర - రాక్షసులనే దవానల - కార్చిచ్చును, ప్రశమనం - చల్లార్చుటను, విధాతుం - చేయుటకు, సశరాసనః-ధను సిద్ధుడై, సురపథే - ఆకాశమునందలి, తటిత్వానివ - మేఘమువలె, చచార - తిరిగెను.

మేఘపక్షములో శరైః - నీళ్లతో సశరాసనః - ఇంద్రచాపముతో కూడినది, అని తెలిసికొనవలెను.

తాత్పర్యము— నడయాడు నల్గొండవలె నల్లని రూపుగలవాడును, బాహుబలశాలియు సీతాపతియునగు శ్రీరాముడు అరణ్యానిలో ప్రవేశించి ఇంద్రధనుస్సుతోను విద్యుల్లతలతోను ఒప్పుచున్న కాఱుమబ్బు కార్చిచ్చు నార్పుటకు వినువీధిలో విహరించినట్లు ప్రముక్కడి అక్కసులను చంపుటకు కోదండపాణియై విహరించెను.

విశేషములు— శ్రీమద్రామాయణములోని అరణ్యకాండములోనున్న - 'ప్రవిశ్య' యను మొదటి పదమిచ్చట ప్రయోగించుట గమనింప దగిన విశేషము 'ప్రవిశ్యతు మహారణ్యం' ఈ శ్లోకములో పృథ్వీవృత్తము. జగణసగణ జగణసగణ, యగణములు లఘువు, గురువు, వరుసగానుండి ఎనిమిదింటికి తొమ్మిదింటికి యతి యున్నచో పృథివీవృత్తము.

తదుక్తం— జసౌజసయలా వసుగ్రహ యతిశ్చ పృథ్వీగురుః

గద్యము—తదను కండూల వనశుండాల కపోలకషణ వినమిత తామిత విటప సాలషండ నిర్యాత నిర్యాసగంధానప్యాత్త గంధాన్ విదధానైరాహుతి గంధైరనుమీయమానాన్ అవినాభూతజలాశయానాశ్రమ ఖాగానఖితశ్చరతోరాతిథ్య ప్రశమిత మార్గశ్రమయో రామలక్ష్మణయో రధ్వానం తరసా రురోధ విరాధాభిధానో యాతుధానః. 2.

అ — తదను - అరణ్యములో తిరిగిన తరువాత, కండూల - దురదతో కూడిన, వనశుండాల - అడవి యేనుగులయొక్క కపోల - గండస్థలములయొక్క కషణ - రాపిడిచేత వినమిత - శిథిలమైన

అసంఖ్యాక - లెక్కకు మించిన విటప - కొమ్మలుగల సాలషండ - దేవ దారు వృక్షముల నుండి, నిర్యాత - బయల్వెడలిన నిర్యాస - జిగురుయొక్క గంధానపి - వాసనలు గలవియైనను, ఆత్తగంధాన్ స్వీకరింపబడిన గంధము గలవిగాను, తిరస్కరింపబడినవిగాను; విదధానైః - చేయుచున్న, ఆహుతి గంధైః - హోమ ద్రవ్యముల సువాసనలతో, అనుమీయమాన - ఊహింపబడుచున్నవియు, అవినాభూత - అంతటను ఉన్న, జలాశయాన్ - చెరువులుగల ఆశ్రమభాగాన్- ఆశ్రమ ప్రదేశములను, అభితః-అంతటా, చరతోః-తిరుగుచున్నవారును, ఆతిథ్య - మునులచే చేయబడిన అతిథిసత్కారములతో, ప్రశమిత - పోగొట్టు కొనబడిన మార్గశ్రమయోః - మార్గాయాసము గలవారగు రామలక్ష్మణయోః - రామలక్ష్మణుల యొక్క - అధ్వానం - మార్గమును విరాధాభిధానః - విరాధుడను పేరుగల యాతుధానః - రాక్షసుడు తరసా - వేగముతో రురోధ - అడ్డగించెను.

తా — అయ్యడవిలో లెక్కకు మిక్కుటములగు వృక్షములు విరాజిల్లు చుండెను. వానిలో విశాలాయతములగు దేవదారు వృక్షములు చాల కన్పట్టుచుండెను. మత్తమాతంగములు గండకండూ వినోదమునకై అవృక్షస్కంధముల నుపయోగించుకొని, తొండములతో కొమ్మలను విఱుచుచుండెను. ఆ వృక్షములనుండి పాలు స్రవించుచుండెను. అపాలయొక్క పరిమళములను ఆశ్రమములలోని ఆహుతి పరిమళము లభిభవించుచుండెను. అపరిమళములచే అవి ఆశ్రమములై యుండ నోపునని బాటసారులూహించు చుందురు. వాని దరి దాపులలో మునీశ్వరుల నిత్యకృత్యములకుపయోగించు - నిర్మలోదకములతో నిండిన చెరువులు కానుపించుచుండెను. అట్టి ఆశ్రమములలో సేద తీర్చుకొని, ముచ్చట గొలుపు మునులిచ్చు ఆతిథ్యమును సేకరించి అటునిటు తిరుగుచున్న అన్నదమ్ముల త్రోవను - విరాధుడను రాక్షసు డడ్డగించెను.

వి — శుండా అనగా తొండము. తొండము గల జంతువులు గనుక శుండాలములు - ఏనుగులు.

గ — స ఏష రోషభీషణవేషః త్రిశిఖ - శిఖావతంసిత వివిధ మృగ శవశత హృదయః శతహ్రదాతనయ స్సీతామపజహార వ్యాజ హార దాశరథీచ.

అ — రోషభీషణవేషః - రోష - కోపముతో, భీషణ - భయంకరమైన వేషః - వేషముగల వాడును, త్రిశిఖశిఖా - త్రిశూలము చివరకు అవతంసిత - గ్రుచ్చబడిన వివిధ - నానావిధములైన మృగ శవశత - జంతువులయొక్క మృత కళేబరములయొక్క, హృదయః - వక్షః ప్రదేశములు గల వాడును, శతహ్రదాతనయః - శతహ్రదయొక్క కుమారుడగు స ఏషః - ఆ యీ విరాధుడు, సీతాం-సీతను, అపజహార - అపహరించెను. దాశరథీ - దశరథునియొక్క తనయులగు రామలక్ష్మణులను - గూర్చి, వ్యాజహార చ - మఱియు పలికెను.

తా — రోషభీషణ వేషముతో కన్పట్టుచున్న వాడును, శతహ్రదా తనయుడునగు నాపొలసుతిండి, తన భుజముననున్న, త్రిశూలము యొక్క చివరకు, చంపిన మృగకళేబరములను తగిలించుకొని సుందరాంగియగు సీతనపహరించి దశరథతనయులతో నిట్లనెను.

వి — త్రిశూలమను ఆయుధమునకు చంపిన జంతువులను తగిలించుకొనెను, మూడు సింహములు నాలుగు పెద్దపులులు రెండు తోడేళ్లు పది లేళ్లు దంతములతో కూడిన ఒక ఏనుగుతలకాయ. తదుక్తం శ్రీమద్రామాయణే —

త్రీన్ సింహాన్ చతురో వ్యాఘ్రాన్
ద్వౌ మృగౌ పృషతాన్ దశ.
సవిషాణం వసాదిగ్ధం
గజస్య చ శిరో మహత్.
అపసవ్యాయసీ శూలే
వినదంతం మహాస్వనమ్.

గ — కౌయువాం యువానౌ కుతస్త్యౌ? వామాచారవత్ప్రతిభాతి మే వామాచారః, చీరం వపుషి, జటాశ్శిరసి, కరే చ చండకోదండ దండః. క్వాయమాకల్పః, క్వచన కల్పలతాకల్పేయమనల్పభూషణా తరుణీతి.4

అ — యువానౌ - చిన్న వయస్సులోనున్న యువాం - మీరిద్దఱు కౌ - ఎవరు? కుతస్త్యౌ - ఎక్కడనుండి వచ్చినారు? వాం - మీయిద్దఱి యొక్క ఆచారః - ప్రవర్తనము మే - నాకు వామాచారవత్ - చెడునడవడివలె ప్రతిభాతి - తోచుచున్నది. వపుషి - శరీరమునందు చీరః - వల్కలము, శిరసి - తలయందు జటాః - జడలు కరే - చేతియందు చండః - తీవ్రమైన కోదండదండశ్చ - ధనుర్దండమున్న అనే, అయం ఆకల్పః - ఈ వేషము క్వ — ఎక్కడ అనల్పాభరణా - సకలాభరణభూషితయగు కల్పలతాకల్పా - కోరిన కోరికలిచ్చు కల్పవల్లితో సమానురాలైన, ఇయం తరుణీ - ఈయువతి క్వచన - ఎక్కడ? ఇతి - అని.

తాత్పర్యము— ఓయీ ? యువకులగు మీరెక్కడనుండి వచ్చినారు? మీ ఆచారము దురాచారమువలె నాకు తోచుచున్నది. శరీరమునందు - మునులు ధరించు వల్కలములు, తలయందు పింగళ వర్ణము గల జడలు, హస్తమునందు చండకోదండ దండము.ఎక్కడిదీ వేషము? కల్పలతవలె నుండి బహు భూషణభూషితాంగియగు నీయువతి ఎక్కడ? మునివేషములో నున్న మీకీ యువతి ఎట్లు దొరికినది?

వి — ఓయీ మీనడవడి చెడునడవడివలె కనబ్బట్టుచు న్నది, అని పైకి తోచిననూ, మీ యాచారము సుందరాచారమువలె కనబ్బట్టుచున్నది యని తాత్పర్యార్థము. ఇచ్చట వామ శబ్దమునకు చెడ్డ అనియు సుందరమనియు అర్థములు కలవు.

"యువాం యువానౌ;" వామాచారవత్ప్రతిభాతి వామాచారః అను చోట్ల ఛేకానుప్రాసరూపమగు శబ్దవైచిత్ర్యము కనబ్బట్టుచున్నది.

మునులకు జడలు నారచీరలు ఉండునుగానీ, క్షత్రియ లక్షణ మగు ధనుస్సులుండవుగదా? మునులకు స్త్రీ సాహచర్యము తగదు గదా? నగలను ధరించిన యీయువతీమణి మీకెట్లుతటస్థపడినది?

గ — దాశరథిరపి కథితనిజాన్వయో విరాధాఙ్కే వేపమానాం విదేహదుహితరం విలోక్య సకోప స్సౌమిత్రిణా సాకం రక్షోవక్షసి శిలీముఖాన్నిచఖాన.

అ — దాశరథిరపి - దశరథుని యొక్క కుమారుడగు శ్రీరాముడున్ను, కథిత - చెప్పబడిన, నిజాన్వయః - తనవంశచరిత్ర కలవాడై, విరాధాఙ్కే - విరాధుని యొక్క తొడయందు వేపమానాం - వణికి పోవుచున్నదియు అగు విదేహ దుహితరం - విదేహరాజు కూతు రగు సీతను విలోక్య - చూచి సకోపః - కోపగించినవాడై, సౌమిత్రిణా సాకం - సుమిత్రానందనుడగు లక్ష్మణునితో కూడ రక్షోవక్షసి - రాక్షసుని యొక్క రొమ్మునందు శిలీముఖాన్ - బాణములను నిచఖాన - గ్రుచ్చెను.

తా—దశరథ తనయుడు, ఇక్ష్వాకు వంశములో జన్మించితిననియు పితృవాక్య పరిపాలనమునకై అడవికి వచ్చితిననియు తన వృత్తాం తము నెఱింగించెను. విరాధుని తొడమీద విలవిలతన్నుకొనుచున్న విదేహదుహితను జూచి కుపితుడై శ్రీరాముడు తన తమ్మునితో కూడ విరాధుని వక్షఃసలమును వాడిములుకులతో చీల్చివేసెను.

వి. — రాముడు విరాధుని యురఃస్థలము నందు, ఏడుబాణము లను నాటెను. నారితో గూడిన ధనుస్సుతో ఏడుబాణములను నాటెనని రామాయణములో కలదు. తదుక్తం - శ్రీమద్రామాయణే –

'ధనుషా జ్యాగుణవతా సప్తబాణాన్ ముమోచ హ.

ప — విశిఖే విశిఖే తస్మిన్విధాతృవరవర్మణి
సీతాం నిక్షిప్య చిక్షేప శూలం రక్షో రఘూద్వహే 8

అ — విధాతృ - బ్రహ్మయొక్క వర - వరమనే వర్మణి - కవచముగల తస్మిన్ - ఆవిరాధుని యందు విశిఖే - రామబాణములు (జాత్యేక వచనము) విశిఖే సతి - పోయిన చివరభాగములు గలవి కాగా రక్షః - విరాధుడు సీతాం - సీతను (నేలమీద) నిక్షిప్య ఉంచి రఘూద్వహే - రాముని మీదికి శూలం - త్రిశూలమును నిచిక్షేప విసరెను.

తా — బ్రహ్మదేవుడా విరాధునకనేక వరము లిచ్చెను. వరములను కవచమును ధరించిన యా క్రూరుడగు రక్కసిని రామబాణములు ఏమియును చేయలేక పోయెను. అప్పుడతడు సీతను నేల మీద దింపి రఘునాయకుని మీదికి శూలమును విసరెను.

వి — ఈశ్లోకమునందు శ్లోకవృత్తమున్నది.దీనిని అనుష్టుప్ఛ్ఛంద స్సని కూడ నందురు. అన్ని పాదములలో ఐదవ అక్షరము లఘువై యుండవలెను. రెండు నాల్గుపాదములలో ఏడవ అక్షరము లఘువై యుండవలెను. అన్ని పాదములలో ఆరవ అక్షరము గురువై యుండ వలెను. దీనిని శ్లోకమని గానీ పద్యమని గానీ పెద్దలు చెప్పెదరు. శ్రీమద్రామాయణములో వాల్మీకి మహర్షి మహాభారతములో వ్యాస మహర్షి ఈ వృత్తమునే ఉపయోగించి యున్నారు. తదుక్తమ్ –

"పంచమం లఘు సర్వత్ర, సప్తమం ద్విచతుర్థయోః
షష్ఠం గురుం విజానీయాత్, ఏతత్పద్యస్య లక్షణమ్"

వ — తదను శూలమఖండయ దంజసా
శితశిఖం రఘునాయక సాయకః,
నియతమేవ విరాధవిరోధినాం
హృదయశూలమపి త్రిదివౌకసామ్. 7

అ — తదను - తరువాత, రఘునాయక - శ్రీరాముని యొక్క సాయకః - బాణము, శితశిఖం వాడియైన చివరగల శూలం - విరాధునిచే ప్రయోగింపబడిన త్రిశూలమును, అంజసా - తొందరగా, అఖండయత్ - విరగగొట్టెను. తథా అదే విధముగ విరాధ విరోధినాం - విరాధునకు శత్రువులైన - త్రిదివౌకసాం - స్వర్గ లోక వాస్తవ్యులైన దేవతల యొక్క హృదయశూలమపి - గుండెలలోని బాధను కూడ అఖండయత్-విరగగొట్టెను, నియతమేవ-నిశ్చయము.

తా — అంతట రఘునాయకసాయకము తీక్ష్ణాగ్రముగల విరాధుని త్రిశూలమును రెండు ముక్కలు జేసెను విరాధునిచే బాధింపబడు చున్న విబుధుల యొక్క హృదయ శూలమును కూడ రెండు ముక్కలు చేసెను.

వి- ఈ శ్లోకములో ద్రుత విలంబితవృత్తము. క్రమముగా, నాల్గు పాదములలో నభభరగణములున్నచో ద్రుతవిలంబిత వృత్తమగును.

తదుక్తం —"ద్రుతవిలంబిత మాహనభౌ భరౌ" ఇతి, అంజసా- శ్రీఘ్రం - తొందరగా, విరాధుని త్రిశూలమును రఘునాయకుడు తన సాయకముతో విరగగొట్టగా వాని శూలము మాత్రమే విరగలేదు. దానితో పాటు దేవతల యొక్క హృదయశూలమును కూడ (మనస్సులోని బాధకూడ) విరిగెను. విరాధుని వధవలన దేవతలందరకు మనస్సు లోని బాధలు మాయమయ్యెనని తాత్పర్యము. రెండు శూలపదముల నొక చోటికి చేర్చి, కవి శబ్దవైచిత్రిని సృష్టించినాడు.

గ — విరాధోపి క్రుధా సరభసమభిపత్య స్కంధే నిధాయ రామలక్ష్మణౌ, గతినిరోధ్రాపరాధ పరిహారాయేవ మిహిర హిమకరౌ ప్రష్ఠే వహన్వింధ్య ఇవ ప్రతస్థే.

అ — విరాధోపి - విరాధుడున్ను, క్రుధా - కోపముతో, సరభసం - తొందరగాగా, అభిపత్య - వెళ్ళి రామలక్ష్మణౌ — రామ లక్ష్మణులను, స్కంధే - భుజములయందు, నిధాయ - ఉంచుకొని గతినిరోధ - నిజగమననిరోధము వల్లనైన, అపరాధ — దోషమును, పరిహారాయేవ - పోగొట్టుకొనుటకువలె, మిహిర-హిమకరౌ - సూర్య చంద్రులను, ప్రష్ఠే - చరియలయందు (ద్వివచనము), వహన్ - మోయుచున్న, వింధ్య ఇవ - వింధ్యపర్వతము వలె, ప్రతస్థే - బయలుదేరెను.

తా — గమననిరోధకులగు సూర్యచంద్రులను, వింధ్యాచలము తన చరియలయందెక్కించుకొన్నట్లు నిజగమననిరోధకులగు రామలక్ష్మ ణులను రెండు భుజములమీద నెక్కించుకొని కుపితుడగు విరాధుడు బయలుదేరెను.

గ - రామస్తత్ర సౌమిత్రిం విరాధవధోద్యుక్తమభిదధే.

అ — తత్ర - ఆ సమయము నందు, రామః - శ్రీరాముడు విరాధ-వధే - విరాధుని యొక్క హింసయందు, ఉద్యుక్తం - సన్నద్ధు డైన, సౌమిత్రిం - లక్ష్మణుని గూర్చి, అభిదధే - పలికెను.

తా — లక్ష్మణుడు విరాధుని చంప ప్రయత్నింపగా వానితో రాముడిట్లనెను.

ప — యా తు నః పదవీ సైషా యాతు నశ్చాప్యస్య లక్ష్మణ
యా తు కామం తయైవేదం యాతు కామం సహన్యతామ్.

అ — యాతు - ఏదైతే, నః - మనయొక్క, పదవీ మార్గమో సైషా - అదియే, యాతునశ్చ - రాక్షసునియొక్కయు, పదవీ -

మార్గము, ఇదం - ఈ రాక్షసుడు, తయైవ - అమార్గముతోనే, యాతు కామం - వెళ్ళగోరుచున్నాడు, అతః - ఇందువలన, కామం - ఇచ్ఛ వచ్చినట్లు, యాతు - వెళ్లుగాక, నహన్యతాం - చంపబడకుండుగాక.

తా — లక్ష్మణా! మనమేత్రోవలో ప్రయాణం చేయదలచితిమో, ఈ విరాధుడును, ఆ త్రోవలోనే ప్రయాణము చేయుచున్నాడు. ఇచ్ఛ వచ్చినట్లు వానిని పోనిమ్ము. ఈ దుర్గమారణ్యములో నిన్ను, నన్ను మోయుచు, మనకుపకారము చేయుచున్నాడు.

వి — ఈశ్లోకములో యాతు అనుపదము అనేకార్థకమై పాదాల యందు పలుమారులు నియమపూర్వకముగా వచ్చుటవలన ఆదియమ కమను శబ్దాలంకారము. ఈ యమకమత్యద్భుతమైనది ఈ యమక ప్రపంచము దండిగారికావ్యాదర్శములో చూడవచ్చును.

నడచుటకు వీలులేనియడవిత్రోవలో మనలను మోయుటద్వారా ఉపకారము చేయుచున్న వీనిని చంపవద్దు. ఈ క్షుద్రరక్షః కీటకము వలన మనకు భయములేదు. చాలా దూరము మోసికొని వెళ్ళిన తరువాత సుఖముగా ప్రయాణము చేసి, వీనిని చివరకు చంపవచ్చును. కాన వీనిని ఇచ్ఛవచ్చినట్లు పోనిమ్ము, అని చెప్పుటవలన శ్రీరాముని ధైర్యసంపత్తి తెలియుచున్నది.

వికారకారణములెన్నియున్నను, మనస్సుకు వికారము లేకుం డుటయే ధైర్యమని రసికులయభిప్రాయము. మనసో నిర్వికారత్వం ధైర్యం సత్స్వపి హేతుషు, ఇతిరసికాః. ఈ శ్లోకములో పద్యవృత్తము. లక్షణమునకై రివ శ్లోకమును చూడుడు.

వ — అయికబళయ మామమూ విముంచే
త్యతికరుణం రుదతీమవేక్ష్యసీతామ్
అరమరచయతా ముఖావసిభ్యాం
పిశితభుజం భుజభార హీనమేనమ్॥

అ — అయి - ఓయీ, మాం - నన్ను, కబళయ - భక్షింపుము అమూ - వీరిద్దఱినీ. విముంచ - విడిచిపెట్టుము, ఇత్యుక్త్వా - అనిపలికి అతికరుణం - మిక్కిలిదీనముగా, రుదతీం - దుఃఖించుచున్న, సీతాం - సీతను అవేక్ష్య-చూచి, ఉభౌ-రామలక్ష్మణులిద్దఱు, అరం - శీఘ్రముగా అసిభ్యాం - ఖడ్గములతో, ఏనం - ఈ పిశితభుజం - మాంసభక్షకుడగు రాక్షసుని, భుజభారహీనం-బుజములనే బరువులేని వానినిగా, అరచయ తాం - చేసిరి.

తా — "ఓయీ? నా మాటలు విను. నాకత్యంతాప్తులు ప్రీతి పాత్రులునైన ఈ అన్నదమ్ములను విడచిపెట్టుము. నన్ను మ్రింగి వేయుము. నీ ఆకలి తీర్చుకొనుము" అని బిగ్గఱగా ఆక్రోశించుచున్న సీతనుజూచి దయార్ద్రహృదయులై, విరాధుని కుడిచేతిని రాముడు, ఎడమచేతిని లక్ష్మణుడు నరికివేసిరి.

వి — నాకు మిక్కిలి ఇష్టులైన రామలక్ష్మణులను విడిచిపెట్టి నన్నుతినమని సీత కోరగా, ఆయన్నదమ్ములలో రాముడు, కుడిచేతిని లక్ష్మణుడు ఎడమచేతిని తెగగొట్టిరి. ఈ విషయములో శ్రీరామాయణ శ్లోకమిట్లున్నది.

తస్య రౌద్రస్య సౌమిత్రిః
సవ్యం బాహుం బభం జ హ
రామోపి దక్షిణం బాహుం
తరసా తస్య రక్షసః

ఈ శ్లోకములో పుష్పితాగ్రావృత్తము. ఇది అర్ధసమఛందస్సులో గలదు. దీనియొక్క విషమపాదములలో రెండు నగణములు ఒక రగ ణము ఒక యగణమున్ను ఉండవలెను. సమపాదములలో అనగా రెండు, నాలుగుపాదములలో, నగణజగణములు జగణరగణములు గురువునున్నచో పుష్పితాగ్రావృత్తమగును. ఇందు ప్రథమ-తృతీయ

పాదములు ఒకరకపు గణములు, ద్వితీయ–చతుర్థపాదములు ఒకరకపు గణములు కలవియైయుండుటవలన దీనిని అర్ధసమవృత్తమందురు. తదుక్తమ్.

అయుజి నయుగరేఫతో యకారో
యుజిచ నజౌజరగాశ్చపుష్పితాగ్రా.

అరసుర, భుజంభుజమును రెండుచోట్ల ఛేకానుప్రాసమను శబ్దపై చిత్ర్యము కాననగును.

గ — తతస్తేన తీక్ష్ణతరప్రహరణ గవాక్షిత వక్షసాపి రక్షసాన పరిత్యక్తేషు ప్రాణేషు పరాక్రమా విషయపరాక్రమాయాం ప్రాక్రమే జామేతౌ తదం గళితరుధిరధారాసేకేన ఖనన క్షమాయాం కానన క్షమాయాం రాక్షస శవోచిత మతివిశంకట మవట ముత్పాదయితుమ్.

అ — తతః-రెక్కలుతెగగొట్టిన తరువాత, తీక్ష్ణతర-మిక్కిలితీక్ష్ణమైన ప్రహరణ దెబ్బలచే, గక్షివాత - కన్నములుగలవిగాచేయబడిన, వక్షసా-రొమ్ముగలిగిన, తేన రక్షసా - ఆరాక్షసునిచేత, ప్రాణేషు - ప్రాణములు న పరిత్యక్తేషు సత్సు - విడిచిపెట్టబడకుండగనే, పరాక్రమ-భుజబలము నకు, అవిషయ - గోచరముగానట్టి, పరాక్రమాయాం - కాఠిన్యము గలదియు, ఖననక్షమాయాం - త్రవ్వుటకు వీలైనట్టిదియు అగు. కాననక్షమాయాం – అడవియందు, తదజ – ఆ రాక్షసునియొక్క అవయములనుండి, గళిత - జారిన, రుధిరధారాసేకేన - నెత్తురు ప్రవాహము యొక్క తడుపుటతో, రాక్షసశవోచితం - రాక్షసునియొక్క మృతకళేబరమునకు తగినదియు, అతివిశంకటం – మిక్కిలి విశాల మైనదియునగు, అవటం – గోతిని, ఉత్పాదయితుం – తయారు జేయుటకు, ప్రాక్రిమేతాం - ప్రారంభించిరి.

తా — బుజములను నరికిన పిదప గాఢతర శరప్రహారములచే గుండె చిల్లులు పడినను, ఆరక్కసి తన ప్రాణములను వీడదయ్యె. వాని యవయవముల నుండి రక్తపుధారలు ప్రవహించెను.

రక్తసిక్తమై, ఆ నేల తన కాఠిన్యమును వీడి మెత్తపడగా, రామ లక్ష్మణులు ఆకోణపావశమని కుణపమును (శవమును) పూడ్చిపెట్టుటకై మిక్కిలి పొడవు, వెడల్పు, లోతుగల గోతినొకదానిని తీయుటకు మొదలిడిరి. ఇంతలో పూర్వస్మృతిని పొందినయావిరాధుడు రామునకు తన వృత్తాంతము నిట్లు విన్నవించెను.

వి — పరాక్రమా విషయ పరాక్రమాయాం" అనుపదము భోజరాజుగారి విచిత్రసృష్టి, బాహుబలమునకు గోచరము గాని కాఠి న్యముగలది అనియర్థము, అనగా త్రవ్వుటకు వీలులేనిదని తాత్పర్యం 'ఖననక్షమాయాం' – "కాననక్షమాయాం" అను రెండు పదములు ప్రభువుల విచిత్రసృష్టియే. మొదటి క్షమాశబ్దమునకు శక్యమైనది అని అర్థము. రెండవ క్షమాశబ్దమునకు నేల అని అర్థము, క్షమాశబ్దమునకు ఓర్పు అని అర్థము కూడ కలదు.

రాక్షసులకు ఖనన సంస్కారమే గానీ దహనసంస్కారమ్ములేదను ధర్మమును "తాదృశీ తాదృశాం గతిః" అను వచనము తెలియజేయు చున్నది. కనుక రాముడు, విరాధుడు బ్రతికియుండగనే చేతులు నరికి గోతిలో పాతిపెట్టుటకు గొయ్యి తీసెను.

విరాధుడు శ్రీరామాయణములో శ్రీరామునితో నిట్లు చెప్పెను – చనిపోయిన రాక్షసులను గోతిలో పూడ్చిపెట్టుటయే – సనాతనధర్మము గోతిలో పూడ్చిపెట్టబడిన రాక్షసులు సనాతనలోకములకు వెళ్ళగలరు రక్షసాం గతసత్త్వానామేష ధర్మస్సనాతనః. అవటే యే నిధీయంతే తేషాం లోకాస్సనాతనాః."

గ — తత్క్షణమేవ క్షణదాచరోపి సంజాత ప్రత్యభిజ్ఞో రామాయ
వ్యజిజ్ఞపత్, 13.

అ — తత్క్షణమేవ – వెంటనే, క్షణదాచరోపి – రాక్షసుడును,

సంజాత ప్రత్యభిజ్ఞః - కలిగిన పూర్వస్మృతి గలవాడై, రామాయ శ్రీరాముని కొఱకు, వ్యజిజ్ఞపత్ - మనవి చేసికొనెను.

గ — ఆత్మనో గంధర్వకులసంభవం రంభా - పరిరంభణారంభ సంరంభం, తచ్ఛ్రవణకుపిత వైశ్రవణదత్తాం రక్షోరూపిణీం శాపవ్యాపదం తస్యాస్తథావిధమవసానం చ. 14.

అ — ఆత్మనః - తనయొక్క, గంధర్వకులసంభవం - గంధర్వ కులములో పుట్టుకను, రంభా పరిరంభణారంభ - రంభయనునప్సర - యొక్క ఆలింగనప్రయత్నము యొక్క, సంరంభ - తొందరపాటును తచ్ఛ్రవణ - ఆవిషయమును వినుటచే, కుపిత - కోపగించిన, వైశ్రవణ - కుబేరునిచే, దత్తాం - ఇవ్వబడిన, రక్షోరూపిణీం - రాక్షసరూపమును కలిగించిన, శాపవ్యాపదం - శాపరూపమైన మహావిపత్తిని, తస్యాః - ఆ విపత్తు యొక్క, అవసానంచ - చివరనున్న, రామాయ - రాముని కొఱకు, వ్యజిజ్ఞపత్ - మనవి చేసికొనెను.

తా — ఇంతలో పూర్వస్మృతిని పొందిన విరాధుడు, రామునకు తన వృత్తాంతము నిట్లు విన్నవించెను. ప్రభూ! నేను తుంబురుడను గంధర్వుడను. అప్సరఃకులలలామయగు రంభ, నలకూబరుని కామించి మించిన తమకముతో కుబేరుని భవనమునకు జనుచుండ, దాని యంద చందములను పరికించి, మదుని యంప కోలలకు జిక్కి, రంభా పరి రంభణమునకుపక్రమింపగా, ఆమె "రక్షింపుడని" కేకలు వేసినది. కేకలు విని సమీపించిన కుబేరుడు కుపితుడై రాక్షసునివలె ఈమెను, బలాత్కరించితివిగాన రాక్షసుడవగుమని శాపంబిచ్చెను. తెలియక జేసిన నా యీమొదటి తప్పిదమును క్షమింపుడని కుబేరుని చరణ సరోజముల మీదపడి ప్రణిపాతమాడగా, రామలక్ష్మణులెప్పుడు నీభుజములను తెగగొట్టి గోతిలోపూడ్చిపెట్టగలరో అప్పుడు నీశాపావసానంబగునని చెప్పి ప్రసన్నుడై కుబేరుడు వెడలిపోయెను.

వి — ఓ రామా! నేను తుంబురుడను గంధర్వుడను. ఒకానొక ప్పుడు ఒంటరిగానున్న రంభను కౌగలించుకొనగోరితిని. ఆమె కేకలు వేయగా కుపితుడైన కుబేరుడు రాక్షసుడవగుమని నన్ను శపించెను. పాదములమీదపడి శాపమును క్షమ్మరింపుమని కోరగా, కీర్తిసంపన్ను డగు కుబేరుడు, రణరంగములో రాముడు నిన్ను చంపినప్పుడు నీవు నీ నిజస్వరూపమును పొంది స్వర్గలోకమునకేగగలవని పలికెను. ఈ అంశములో శ్రీరామాయణ శ్లోకములు.

"అభిశాపాదహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుమ్
తుంబురుర్నామ గంధర్వః, శప్తో వైశ్రవణేన హ
ప్రసాద్యమానశ్చ మయా, సోఽబ్రవీన్మాం మహాయశాః
యదా దాశరథీ రామస్త్వాం వధిష్యతి సంయుగే.
తదా ప్రకృతి మాపన్నో భవాన్ స్వర్గం గమిష్యతి.
ఇతి వైశ్రవణో రాజా రంభాసక్తమువాచహ."

ప — రక్షోవధః ప్రకృత ఇత్యయమేవ శంసేత్
స్వర్గాయ గాయకపదం గమితో విరాధః
నాగాలయాయ వపురస్య వదేదితీవ
శ్వభ్రే తదక్షిపదిషుప్రహతం స రామః. 15

అ — రక్షోవధః - రాక్షస సంహారము, ప్రకృతః - ప్రారంభింప బడినది, ఇతి - అని, గాయకపదం - గంధర్వస్థానమును, గమితః - పొందింపబడిన, అయమేవ - ఈ విరాధుడే, స్వర్గాయ - స్వర్గలోకము నకు, శంసేత్ - చెప్పగలడు, ఇతి - అని. తథా - అదే విధముగా, తస్య - ఆ విరాధుని యొక్క, వపుః - శరీరము, నాగాలయాయ - పాతాళలోకమునకు, వదేత్ - చెప్పగలడు, ఇతీవమత్వా - అన్నట్లు తలచి, సః రామః - ఆ శ్రీరాముడు, ఇషుప్రహతం - బాణముఁలచే

కొట్టబడిన, తత్ - ఆ విరాధుని శరీరమును, శ్వభ్రే - గోతిలో, అక్షిపత్ - ఉంచిన వాడాయెను.

తా — గంధర్వ లోకమునకు పంపబడిన విరాధుడు "స్వర్లోక వాస్తవ్యులందఱుకు, శ్రీరాముడు రాక్షససంహారమును ప్రారంభించి నాడు" అను విషయమును చెప్పగలడు. వాడి బాణములతో శిథిలమై గోతిలో పూడ్చిపెట్టబడిన విరాధుని శరీరము పై విషయమును పాతాళ లోక వాస్తవ్యులకు తెలియజేయగలదను నభిప్రాయముతో విరాధుని శరీరమును రాముడు గోతిలో పెట్టి పూడ్చెను.

వి — ఇచ్చట వసంతతిలకా వృత్తము. వసంతతిలకలో క్రమముగ తభజజలు, రెండు గురువులు నుండును. తదుక్తమ్.

"ఉక్తా వసంతతిలకా తభజాజగౌగః"

గ — తదను నాకలోక భజనాయ పురుహూతేన సమాహూతస్య భగవతశ్శరభంగస్యాశ్రమపదం రఘుపతి రభజత. 16.

అ — తదను - గోతిలో విరాధుని పూడ్చిపెట్టిన తరువాత, నాకలోక భజనాయ - స్వర్గలోక నివాసము కొఱకు, పురుహూతేన — ఇంద్రునిచే సమాహూతస్య — పిలువబడిన, భగవతః — పూజ్యుడైన శరభంగస్య — శరభంగముని యొక్క. ఆశ్రమపదం — తపోవన స్థానమును, రఘుపతిః — శ్రీరాముడు, అభజత — పొందెను. తత్ర — ఆ ఆశ్రమములో,

తా — స్వర్గమునకు దయ చేయుడని, ఇంద్రునిచే పిలువ బడినను, శ్రీరాముని దివ్యముఖారవింద సందర్శనమునకై శరభంగ ముని వేచియుండెను. అట్టి మహామునియాశ్రమమునకు, శ్రీరాముడు; సీతాలక్ష్మణులతో చేరెను.

వి — శరభంగముని యొక్క గొప్పతనము ఇంతయని చెప్ప నలవికాదు. రంభాద్యప్సరసలను పంపి తపోధనుల తపోభంగము

నొనరించు, ఇంద్రుడు, శరభంగమునిని, ఓయీ, నీ తపస్సుఫలించి నది, వెంటనే స్వర్గమునకు రమ్మని పిలిచెను.

శ్లో — దశశతనయనేపి వీక్ష్యమాణే
దశరథ పుత్ర నిసేవిషైవజాతా
మనసిజ శరభంగకారి వృత్తేః
మనసిమునేశ్శరభంగనామభాజః 17

అ — దశశతనయనే = వెయ్యికన్నులు గల ఇంద్రుడు, వీక్ష్యమాణేపి = చూడబడినవాడైనను, మనసిజశర = మన్మథుని బాణముల యొక్క, భంగకారివృత్తేః = భంగమును కలిగించునట్టి వ్యాపారము గలవాడును, శరభంగనామభాజః = శరభంగుడను పేరును కలిగి యున్న, మునేః = మునియొక్క, మనసి = మనస్సునందు, దశరథ పుత్ర = దశరథుని కుమారుడైన శ్రీరాముని, నిసేవిషైవ = సేవింప వలెనను కోరికయే జాతా = కలిగినది.

తా — జితేంద్రియుడగు శరభంగమహామునికి అలభ్యదర్శను డగు మహేంద్రుని దర్శనభాగ్యము లభించినను, సాక్షాత్తు శ్రీమన్నా రాయణుడగు శ్రీరామచంద్రుని సేవింపవలెనను కోరికయే మెండుగా నుండెను.

వి — అలభ్యదర్శనుడును, వెయ్యికన్నులుగలవాడును, అయిన ఇంద్రుడు పిలిచినను వెళ్ళక, జితేంద్రియుడగు శరభంగముని తన మనస్సులో పరమాత్మయగు శ్రీరామచంద్రుణ్ణే సేవింపగోరెను.

మునియనగానెవరు ? మనుతే ఇతిమునిః అని విగ్రహవాక్యము అరిషడ్వర్గముల నుండి మరలిన మనస్సుగలవాడు, యథార్థస్థితిని ఎఱిగిన వాడున్ను, కామము, క్రోధము, లోభము మోహము మదము, మాత్సర్యము అను ఇందు మూడింటిని గెల్చినవాడును, క్రియాశీలుడు కాని

వాడును, బహింద్రియ నిగ్రహము గలవాడును, (త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణములు బహింద్రియములు) మట్టిని బంగారమును సమ దృష్టితో చూచువాడును, మునియని ప్రాచీనులు మునిలక్షణమును చెప్పి యున్నారు.

నిరతిశయ, నిర్మల, నిత్యానందస్వరూపుడును, భక్తులపాలిటి కల్పవృక్షమున్ను భగవంతుడునగు శ్రీరామచంద్రుని సేవాభాగ్యమును మాత్రమే శరభంగముని కోరెను. స్వర్గలోకములోనైనను భవింపదగినది యేదియునులేదు. శ్రీరామచంద్ర సందర్శనానందభాగ్యము ననుభవించియే స్వర్గమునకేగగలనని మనము లోనెంచెను కనుకనే ఇంద్రాజ్ఞనుకూడ నుల్లంఘించి, శరభంగముని శ్రీరామచంద్రుని సేవించుట శ్లాఘ్యమైన విషయము.

దశరత = దశరథ పదములు, శరభంగ = శరభంగ పదము లూ కవీశ్వరుని శబ్దచమత్కారమును పెంపొందించుటలో బాగుగాముపయోగ పడినవి. ఇచ్చట పుష్పితాగ్రా వృత్తము. దీని వివరణమును 1వ శ్లోకములో చూడుడు.

గ — సమునిరాశ్రమస్థం కాకుత్స్థమాతిథ్యేన సమారాధ్య తత్సా న్నిధ్యశుద్ధాం మంత్రపూతామాహుతిమివాత్మనస్తను మతనూష్మణి తనూ నపాతి పాతయిత్వాశాశ్వతం పదమాశ్రితవాన్.

అ — సమునిః = ఆ శరభంగమహాముని, కాకుత్స్థం = కకుత్ స్థవంశములో పుట్టిన శ్రీరాముని, ఆతిథ్యేన = అతిథి సత్కారముతో సమారాధ్య = పూజించి, తత్సాన్నిధ్యశుద్ధాం = శ్రీరాముని యొక్క సన్నిధానముచే పరిశుద్ధమైన ఆత్మనః=తనయొక్క మంత్రపూతాం = ఋగ్యజుస్సామాది మంత్రములచే పవిత్రమైన ఆహుతిమివ = ఆజ్యాది హోమద్రవ్యమునువలె, అతనూష్మణి = ఉష్ణోగ్రత కలిగిన తనూన

పాతి = నిప్పునందు పాతయిత్వా = పడవేసికొని శాశ్వతంపదం = బ్రహ్మస్థానమును, ఆశ్రితవాన్ = ఆశ్రయించెను (మోక్షముమందెను)

తా — అమ్మహాముని తపోయాత్రయంబున కరుగుదెంచిన శ్రీరామచంద్రునకు సకలోపచారములతో ఆతిథ్యమునిచ్చి పరమానంద భరితుడాయెను. తత్సానిధ్యముతో పవిత్రమైన తన తనువును (శరీరమును) ఋగ్యజుస్సామాది మంత్రములలో పవిత్రమైన ఆహుతినివలె భగభగమండుచున్న నిప్పులో ఉంచి మోక్షమును పొందెను.

వి — " ఆత్మనస్తనుమతనూష్మణి తనూనపాతి పాతయిత్వా॥ అన్నూనిచ్చటి శబ్దచమత్కృతి భోజుని శబ్దచమత్కృతి పాటవమును పదిలపరచుచున్నది.

శరభంగముని తన శరీరమును మంత్రములతో అజ్యమును అగ్నిహోత్రములో నుంచినట్లు మంత్రములతో తన శరీరమునగ్ని నుంచి ముక్తుడాయెను. " ఆత్మావారే ద్రష్టవ్యశ్శ్రోతవ్యోమంతవ్యోనిదిధ్యాపితవ్యః " అను శ్రుతి ననుసరించి పరమాత్మయగు శ్రీరాముని దర్శనము మోక్షహేతువుగాన శరభంగమునికి ముక్తిప్రాప్తి యుక్తమే

స్నానసంధ్యలను విడనాడినవాడును, శౌచవిధానమును మానినవాడును, అగు వృద్ధుడు, 1. కొండమీది నుండి క్రిందికిపడుట 2) భగభగమండుచున్న నిప్పులో దూకుట 3) ఏవిధమైన ఆహారమును స్వీకరింపక, నిరశనవ్రతము చేయుట 4) నదులలో దూకుట, అను నీ నాలుగు విదములలో ఏదో ఒకవిధముతో శరీరమును విడనాడినచో మోక్షముకలుగునని స్మృతి చెప్పుచున్నది కాన శరభంగముని శ్రీరామ సందర్శనము చేసిన పిదప మరణోపాయములలో ఒకటియైన అగ్ని ప్రవేశమునుజేసి దేహత్యాగము నొనరించుట న్యాయసమ్మతమే.

గ — తతస్తీక్ష్ణతపసస్సుతీక్ష్ణస్యనిదేశన దేశాత్తస్మాదుచ్చలితః

సలిలనిధిపాన సంభావిత జీవనాభావశంకయా శరణాశ్రయుణాయ లంబమాన నీలాంబుద సందోహ సందేహావహేన నానానోకహనివహేన పిహితాభోగమగస్త్యాశ్రమం (రామస్స సంభ్రమ) మాససాద, అకథ యచ్చ మైథిలీమ్.

అ — తతః = ఆ శరభంగమహాముని మోక్షమును పొందిన తరువాత, తీక్ష్ణతపసః = తీక్ష్ణమైన వ్రతోపవాసాదులు అను తపస్సుగల సుతీక్ష్ణస్య = సుతీక్ష్ణుడను మునియొక్క నిదేశేన = ఆజ్ఞచేత, తస్మాద్దేశాత్ ఆ ప్రదేశమునుండి అనగా సుతీక్ష్ణమహాముని యాశ్రమమునుండి (ప్రచ్చలితః = బయలుదేరినవాడై) సలిలనిధి = సముద్రముయొక్క పాన = త్రాగుటచే, సంభావిత = ఊహింపబడిన జీవనాభావ = నీటి కొఱతయొక్క (జీవనము గడుపకపోవుటయొక్కయు) శంకయా = శంకతో శరణాశ్రయణాయ = శరణు వేడుటకొఱకు లంబమాన = వ్రేలాడుచున్న నీలాంబుదసందోహ = కాఱుమబ్బుల సముదాయము యొక్క, సందేహావహేన = శంకను కలిగించుచున్న, నానానోకహ నివహేన = పలుతకములైన చెట్లయొక్క సముదాయములతో, పిహిత = కప్పబడిన ఆభోగం దేశవిస్తారముగల, అగస్త్యాశ్రమం = అగస్త్యమహాముని ఆశ్రమమును (రామః శ్రీరాముడు ససంభ్రమం = తొందఱగా) ఆససాద = చేరెను. మైథిలీం సీతనుగూర్చి మఱియు అకథయచ్చ = చెప్పెను.

తా — శ్రీరాముడు సుతీక్ష్ణుడను మునీశ్వరుని యాజ్ఞతో అగస్త్యాశ్రమమునకు చేరెను. అచ్చట లావుపాడవుగల చెట్లెన్నియో కనబడుచుండెను. సముద్రజలములను త్రాగిన అగస్త్యునిగూర్చి నీరులేక బాధపడుచున్నాము. మాకు నీటిని ఇప్పింపుడని కోరుటకు వచ్చిన నీలమేఘములవలె ఆ చెట్లు కానవచ్చుచుండెను. అప్పుడు రాముడు సీతతో నిట్లనెను.



వి — శరభంగ మహామునికి మోక్షము నొసగిన శ్రీరాముడు వ్రతోపవాసాదులతో తీక్ష్ణ తపస్సు నొనరించుచున్న సుతీక్ష్ణమహాముని యాశ్రమమును జేరి, అచ్చట కొంత తడవుండి వానిచే పూజింపబడి వాని యానతితో అగస్త్యాశ్రమమునకు చేరి మనోవినోదము కొఱకై సీతకు కొన్ని కథలు చెప్పెను.

చ — తస్యేదమాశ్రమపదం సరసీరుహాక్షి
సంఖ్యావిహీన మహిమైకనికేతనస్య
భర్తా సమస్తసరితాంకుపితస్య యస్య
హస్తారవింద మకరంద దశామవాప.

అ — హే సరసీరుహాక్షి ! తామర పువ్వులవంటి కన్నులు గల ఓ సీత, ఇదం = ఇది, తస్య = ఆ అగస్త్యుని యొక్క, ఆశ్రమపదం = ఆశ్రమ ప్రదేశము.

సమస్త సరితాం = సమస్త మయిన నదులకు భర్తా = పెనిమిటి యగు సముద్రుడు, సంఖ్యా విహీన = లెక్కకు మిక్కుటమైన, మహిమ = మాహాత్మ్యములకు నికేతనస్య = నెలవైన వాడును, కుపితస్య = కోపగించిన వాడును, అగు, యస్య = ఏ అగస్త్యుని యొక్క హస్తారవింద = తామరపువ్వుతో సమానమైన చేతియందలి, మకరందదశాం = మధువు యొక్క అవస్థను అవాప = పొందెనో,

తా — ఓ పద్మనేత్రీ ! ఇది అగస్త్య మహామునియాశ్రమము, ఈతడు లెక్కకు మిక్కుటము గుమహిమలతో నిండినవాడు, ఒకప్పుడు నదీనాయకునిమీద ఆగ్రహించిన నిగ్రహశాలి:తనహస్త పద్మమునందలి మకరందమునువలె సముద్రములోని నీటిని త్రాగివేసెను.

నిర్గన్తుమక్షమతయా జలధేరలుఠద్భిః,

వి — మహామహిమాన్వితుడైన అగస్త్యమహాముని యాశ్రమ మిది. ఈమ్మహాముని అపాంపతియగు సముద్రునిమీద అలిగి హస్తారవిందములోని మకరందమువలె సముద్రములోని నీటినిపుక్కిట పట్టెను.

ఇచ్చట వసంతతిలకా వృత్తము, దీనిలక్షణమును 18వ శ్లోకములో చూడనగును.

వ — ఇహ సమద గజేంద్రవ్యస్తహస్తాతి భారా
త్పథినియమితశాఖ స్సల్లకీవృక్షషణ్డః
అభినయతి నికామం సంగతోచ్ఛ్రాయహానిః
మునివరకరపాతాద్భగ్నవింధ్యాద్రిముద్రామ్ 21

అ — ఇహపథి = ఈయాశ్రమమార్గమునందు, సమద = మదించిన, గజేంద్ర = ఏనుగుచే, న్యస్త = ఉంచబడిన, హస్త = తొండము యొక్క, అతిభారాత్ = మిక్కిలి బరువువలన, నియమిత = ఉంచబడిన, శాఖః = కొమ్మలుగల, విషల్లకీవృక్షః = కనబడుచున్న ఋఆ అందుగా చెట్టు, నికామం = మిక్కిలి, సంగత = కూడియున్న, ఉచ్ఛ్రాయహానిః = ఔన్నత్యభంగముగలదియై, మునివర = మునిశ్రేష్ఠుడైన అగస్త్యుని యొక్క, కర = హస్తముచేత, పాతాత్ = నియమింపబడుటవలన, భగ్న = బంగిన వింధ్యాద్రిముద్రాం = వింధ్యపర్వతము యొక్క పరిపాటిని (విధానమును) అభినయతి = అనుకరించుచున్నది. (ప్రకటించుచున్నది)

తా — ఇదిగో, ఈ ఆశ్రమ మార్గమునందు సల్లకీ వృక్షమొండు కానవచ్చెడిని. దీని కొమ్మలను మదపుటేనుగొకటి తన తొండముతో విరిచివేయగా, ఔన్నత్యమును కోల్పోయిన వింధ్యాద్రివలె కానవచ్చెడిని.

వి — పూర్వమొకప్పుడు వింధ్య పర్వతము మేరుపర్వతము

(బంగారుకొండ) మీది స్పర్థతో దానికంటె ఎత్తుగా నెదుగుట కారంభించెను. ఎదుగుటవలన సూర్యుని గమనమునకు అంతరాయము కలుగగలదని యెంచిన దేవతలు వింధ్యము యొక్క యెదుగుటను ఆపివేయుడని ప్రార్థించిరి. అగస్త్యుడు వింధ్యాద్రి దగ్గఱకు వెళ్ళగా, వింధ్యాద్రి అగస్త్యునకు పాదాభివందనము జేసెను. ఓయీ నేను దక్షిణ దేశమునకు వెళ్ళుచున్నాను, నేను తిరిగి వచ్చువఱకు నీవిట్లే యుండుమని ఆనతిచ్చి అగస్త్యుడు దక్షిణదేశమునకేగెను. వింధ్యాద్రి ఎదుగుబొదుగులేక అటులనే యుండి పోయెను. అగస్త్యమహాముని తిరిగి యుత్తరదేశమునకు రాలేదు. కనుకనే వింధ్యపర్వతము చాల పొట్టిగా నుండును.

ఈ శ్లోకములో మాలినీ వృత్తము, ఈ వృత్తములో క్రమముగా నన మ యయ గణములుండును. ఎనిమిది అక్షరములకు, ఏడక్షరములకు యతియుండును. సంస్కృతములో అక్షరమైత్రి యుండనవసరము లేదు కానీ, అక్షరమైత్రితో వ్రాయబడిన శ్లోకములు శ్రవణానందమును కలిగించును, శేషాచలవర్ణనలో వేంకటాధ్వరిగారి పద్యమందులకు హృద్యమైన యుదాహరణము.

సురభితమితమాల స్తోమపుష్యద్దరిసాల
ప్రకరతిలకసాల ప్రష్ఠసుష్ఠుద్రుజాలః
శ్రిత సమవనశీల శ్రీశలీలామకూలః
శిథిలిత భవమూల స్సేవ్యతాం శేషశైలః.

ప్రతి పాదములో ఒకటి తొమ్మిది అక్షరముల మైత్రి యుండుట యేకాక అన్ని పాదములలో ఎనిమిది పదిహేను అక్షరములు లకారములై యుండుట కవీశ్వరుని శక్తి యుక్తులను తెలియ జేయుచున్నది

ప — అస్మిన్ మహాపథధియావదనం విగాహ్య

తన్నైర్గజై రజగరాః పిశితాశనేభ్యః
వాతాపిదానవదశా ముపదేశయన్తి.

అ — అస్మిన్ = ఈ ఆశ్రమమునందు, మహాపథధియా = రాజ మార్గమను బుద్ధితో, వదనం = నోటిని (తో) విగాహ్య = ప్రవేశించి, నిర్గన్తుం = బయల్వెడలుటకు, అక్షమతయా = అసమర్థములగుటచే, జఠరే = కడుపులో, ఉఠద్భిః = దొర్లుచున్నటువంటి, వన్యైర్గజైః = అడవి ఏనుగులచేత, అజగరాః = కొండచిలువలు, పిశితాశనేభ్యః = మాంసభక్షకులగు రాక్షసులకొఱకు, వాతాపి దానవదశాం = వాతాపియను రాక్షసుని యొక్క అవస్థను, ఉపదేశయన్తి = ఉపదేశించుచున్నవి (తెలియజేయు చున్నవి)

తా — ఈయాశ్రమము దరిదాపులలో పెద్ద పెద్ద కొండ చిలువలు కనబడుచున్నవి. తెఱుచుకొన్న వీని నోళ్లలో ఉత్తుంగ మత్త మాతంగములు రహదారులను భ్రాంతితో ప్రవేశించుచున్నవి, మత్తమాతంగములను మ్రింగిన యీ కొండచిలువలు వాతాపియను రాక్షసుని అగస్త్యముని మ్రింగిన వైనమును రాక్షసులకు తెలియజెప్పుచున్నవి.

వి — ఈ శ్లోకములో వసంత తిలకావృత్తము దీని లక్షణమును 15వ శ్లోకములో చూడవచ్చును.

వాతాపి ఇల్వలుడు అనురాక్షసులు మిత్రులై యుండి, భూసురులను బాధించుచుండిరి బ్రాహ్మణ రూపములోనున్న వీరిరువురు, బాటసారులను భోజనముజేసి వెళ్లుడని కోరుచుండిరి. వాతాపి గొఱ్ఱె రూపమును ధరింపగా, ఇల్వలుడు వానినికోసి వాని మాంసమును బ్రాహ్మణులకు పెట్టుచుండెను. బ్రాహ్మణుడు హాయిగా భోజనము చేసి నిదురింపగా, వాతాపీ ! బయటకు రమ్మని ఇల్వలుడు కేక పెట్టుచుండెను.

బ్రాహ్మణుని పొట్టను చీల్చుకొని వాతాపి బయటకు రాగా, అనేర మాంసభక్షకులిద్దఱు బ్రాహ్మణుని మాంసమునుతిని సంతసించుచుండిరి ఇది వీరిహింసామార్గము ఈ విషయము నెఱింగిన దేవతలు, వీరిద్ద ఱిని అంతమొందింప వలసినదిగా, అగస్త్యమహామునిని కోరిరి. దేవతల కోరికపై బ్రాహ్మణుని వేషములో వీరివద్దకు అగస్త్యమహా ముని వెళ్లెను. యథాపూర్వముగ నిల్వలుడు గొఱ్ఱెమాంసముతో మహా మునికిని భోజనమునిడెను, కడుపునిండునట్లు భుజించిన యాయ గస్త్యుడు "జీర్ణం జీర్ణంవాతాపిజీర్ణం" అని వాతాపిని తనకడుపులోనే జీర్ణముగునట్లు చేసెను. ఇల్వలుడెంత పిలిచినను, జీర్ణమగుట వలన వాతాపికడుపు నుండి బయటకురావయ్యెను ఈమోసమును గ్రహించిన యిల్వలుడట నుండి పారిపోయెను, వాతాపిని నేర్పుతో చంపిన ఘనత అగస్త్య మహామునికి చెందినది.

వ — చులుకగతసముద్రాస్వాదనే కుంభయోనేః
ఇతరకరనిరస్తామక్షికోత్సారరీత్యా,
గగనగతివిహీనా యే ఘనాః పల్వలాన్తే
విపినమహిషవేషైః కేవలంతే వలంతే 23

అ — యేఘనాః = ఏమేఘములు చుళక = అరచేతిగుంటను, గత = పొందిన సముద్ర = సముద్రమును, ఆస్వాదనే = త్రాగు సమయమునందు, మక్షికోత్సారరీత్యా = ఈగలనుతీసివేసినట్లుగా, కుంభయోనేః = అగస్త్యుని యొక్క ఇతరకర = ఎడమచేతితో, నిరస్తాః = త్రోసివేయబడినవై, గగనగతి విహీనాః = ఆకసమునందలి నడక లేనివై, తేఘనాః = ఆమేఘములు, విపినమహిషవేషైః = అడవి దున్నలను వేషముతో, పల్వలాంతే = దొరువులలో (నీటిగుంటలలో) కేవలం = అధికముగా, (మిక్కిలి) వలంతే = తిరుగుచున్నవి.

తా — అరచేతిలో సముద్ర జలమునుంచుకొని అగస్త్యముని

త్రాగుటకు ప్రారంభించెను. సముద్రములోని నీటిని త్రాగుటకు వచ్చిన మేఘములడ్డురాగా, అగస్త్యుడు రెండవచేతితో వానిని ఈగలను తీసివేసినట్లు విసరివేసెను, అవి క్రిందపడి ఎగురుటకు శక్తి లేనివై, అడవియెనుబోతులవలె సెపముతో నటు నిటు తిరుగుచున్నవి.

వి — ఈ శ్లోకములో మాలినీ వృత్తము. దీని లక్షణము 21వ శ్లోకములో చూడుడు.

గ — ఏవం విపినవిలోకన విస్మితమతిస్తదుటజనికట మాసాద్య రామశ్శిష్యైః ప్రవేశితస్సకలలోక వంద్యమాన చరణారవిందం, అరవిందసంభవమివ బృందారకైర్మునిబృందారకైశ్చ పరివృతం, రోషహుంకారనిరహంకారాయ నహుషాయ భుజంగభావ ముపదిశతే దత్తభుజంగభావం, ఖగగతి నిరోధకల్య వైపుల్యయోర్దురవగాహ మహావనయోర్వింధ్యశైల సింధురాజయోర్గాధతాగాధతాతత్పర కరోదరం, ఉదరజాత జాతవేదో విరచిత వాతాపిదానవావ లేపలోపం లోపాముద్రావల్లభం, సకల సరిద్వల్లభ నిశ్శేషీకరణ బాడబం, బాడబ ప్రశస్తం, అపాస్త సమస్తాశ్రమ ప్రత్యవగత దక్షిణాశం, వృషైకతాన జన్మానమపి కుంభజన్మానం భగవంత మగస్త్యమపశ్యత్. 24

అ — ఏవం = ఈ ప్రకారముగా, విపిన = తపోవనము యొక్క విలోకన = చూచుటచే, విస్మితమతిః = ఆశ్చర్యము నొందిన మనస్సుగల రామః = రాముడు, తదుటజనికటం = అగస్త్యుని యొక్క పర్ణశాల యొక్క సమీపమును, ఆసాద్య = పొంది, శిష్యైః = శిష్యులచే ప్రవేశితః = ప్రవేశపెట్టబడినవాడై, సకలలోక = అన్ని లోకములలోనున్న జనులచే వంద్యమాన = నమస్కరింపబడిన, చరణారవిందం = పాదపద్మములు గలవాడును, అరవింద సంభవమివ = బ్రహ్మదేవునివలె బృందారకైః = దేవతలచేతను, ముని బృందారకైశ్చ = ముని

శిష్యులచేతను, పరివృతం = కూడియున్నవాడును, కోపహుంకార = తన కోపమువల్లనైన హుంకారధ్వనితో నిరహంకారాయ = అహంకార రహితుడైనవాడును, భుజంగభావ దూషితాయ = విటభావముతో దూషింపబడిన వాడును, అగ్ని నహుషాయ = నహుషమహారాజు కొఱకు, దత్త = ఇవ్వబడిన, భుజంగభావం = కొండచిలువ యొక్క రూపము గలవాడును, ఖగ = పక్షుల యొక్క, గతి = గమనమును, నిరోధ = అడగించునట్టియుండును కల్య = సమర్థమైన వైపుల్యయోః వైశాల్యముగలదియును, దురవగాహ = ప్రవేశింప శక్యముగాని, మహావనయోః = గొప్ప అడవి, గొప్ప నీరు కలదియును, అగవింధ్యశైల సింధురాజయోః = వింధ్యాద్రి యొక్కయు, సముద్రము యొక్కయు, గాధతా అగాధతా = ఔన్నత్యగాంభీర్యములను, తస్కర = అపహరించునట్టి (పోగొట్టునట్టి) కరోదరం = హస్తమధ్య భాగముగలవాడును, ఉదరజాత = కడుపులో పుట్టిన జాతవేదసః = నిప్పుచే (జఠరాగ్నిచే) విరచిత = చేయబడిన వాతాపి-దానవ = వాతాపియను రాక్షసుని యొక్క, అవలేపలోపం = గర్వమును పోగొట్టినవాడును, లోపాముద్రావల్లభం = లోపాముద్రయనునామె పెనిమిటియును సకల సరిద్వల్లభ = నదులన్నిటికిని భర్తయగు సముద్రుని, నిశ్శేషీకరణ = మిగులకుండగచేయుటలో బాడబం = బడబాగ్ని అయినవాడును, బాడబప్రశస్తం = బ్రాహ్మణులలో శ్రేష్ఠుడును, అపాస్త సమస్తాశమపి = పోయిన అన్ని ఆశలు (తృష్ణ) గలవాడైనను - ఉపగతదక్షిణాశం = పొందిన దక్షిణదిక్కు గలవాడును, వృష్ణికలాన జన్మానమపి = ఎద్దు వలన పుట్టుకకల్గినవాడైనను కుంభజన్మానం = కుండనుండి పుట్టుక కల్గవాడును, భగవంతం = షడ్గుణైశ్వర్య సంపన్నుడును అగు అగస్త్యం = అగస్త్య మహామునిని, అపశ్యత్ = చూచెను.

తా — ఈ ప్రకారముగ తపోవనమును జూచి ఆశ్చర్యపడిన

శ్రీరాముడు, అగస్త్యాశ్రమమును జేరెను. అమ్మహాముని శిష్యులువచ్చి శ్రీరాముని, ఆశ్రమములో ప్రవేశపెట్టిరి, అగస్త్యునిచరణ కమలములకు జనులందఱును నమస్కరించుచుండిరి. బ్రహ్మదేవునిచుట్టు దేవతలు మునీశ్వరులు కూర్చొనియున్నట్లు అగస్త్యునిచుట్టు దేవతలు మునీశ్వరులు కూర్చొనియుండిరి. తనయహంకారముతో నిరహంకారుడైన నహుష నరవరునకు సర్పముగ మారుమని శాపము నిచ్చినదీ మహానుభావుడే పక్షులు ఎగురుటకు వీలులేనంత యెత్తుగా పెరిగిన వింధ్యపర్వతమును అణచివేసినదీయనయే పక్షులుదాటుటకు వీలులేనంత వెడల్పుగల నీటితోనిండిన లోతైన సముద్రమును అరచేతిలో నుంచుకొని గుటుకున మ్రింగిన వాడీతడే వాతాపియను దానవుని తన జాఠరాగ్నితో భస్మముచేసిన వాడీతడే వీని సహధర్మచారిణిలోపాముద్ర బడబాగ్నివలె సముద్రమును ఒక్క గుక్కలో మ్రింగిన వాడెవరోకాదీతడే బ్రాహ్మణులలో అగ్రగణ్యుడును, ఈతడే ఆశలనన్నిటిని చంపుకున్నను దక్షిణాశను (దక్షిణ దిక్కును) వీడకుండనున్న వాడీతడే ఇతడు సకలధర్మములకు నెలవైన వాడు కుంభములోనుండి పుట్టుకొని వచ్చినవాడు అట్టి పూజ్యుడగు నగస్త్య మహర్షిని శ్రీరాముడు సీతా సౌమిత్రులతో కూడి సందర్శించెను.

వి — పూర్వము నహుషుడను రాజు పూర్వపుణ్య వశంబున శరీరముతో స్వర్గమున కేగెను. అచ్చట ఇంద్రపదవిని పొందెను) శచీదేవిని పొందగోరి మిన్నుమిన్నుకానని వాడై సప్తర్షులచే మోయబడుచున్న శిబికలో ప్రయాణము సాగించెను. దురహంకార పరుడగు నారాజు "సర్ప సర్ప" తొందరగా నడు తొందరగ నడు అని అగస్త్యుని దూషించెను. కోపించిన అగస్త్యుడు "సర్పోభవ"(పాముగా మారుము, అనిశపించెను. నహుషుడు కొండచిలువగా మారి శిబికనుండి నేల మీద పడెను.

"అగస్త్యుడు దక్షిణ దిక్కునందు ఆకసముమీద నక్షత్రరూప ములో నుండెను, అతడు వరుణుని కుమారుడు యోగీశ్వరుడు. వింధ్య పర్వతమును అణగ ద్రొక్కినవాడు. వాతాపిని జీర్ణము చేసికొన్నవాడు" అని బ్రహ్మాండపురాణములో నున్నది. తదుక్తం బ్రహ్మాండపురాణే.

"అగస్త్యో దక్షిణాశాయామాకాశే నక్షత్రరూపతః స్థితః
వరుణస్యాత్మజో యోగీ వింధ్యవాతాపిమర్దనః"

ఊర్వశిని ఏకాంతమున కలుసుకొన్న మిత్రావరుణులకు, రేతస్ఖ లమును జరుగగా, ఆరేతస్సును, ఒక కుంభములో నుంచగా, ఆకుంభ మునుండి పుట్టినవాడగుట వలన అగస్త్యునకు కుంభసంభవుడని పేరు వచ్చినది.

శౌర్యనిధియగు శ్రీరాముడు తపోనిధి యగు నగస్త్యుని సమీ పించి "శ్రీరామవర్మా అహంభో అభివాదయే" అని తన పేరు చెప్పి నమస్కరించెను.

పెద్దలకు నమస్కారము చేయునప్పుడు తన పేరును చెప్పవలెనని శాస్త్రము చెప్పుచున్నది. ఈవిషయములో మనుస్మృతి ఇట్లు నుడువు చున్నది.

"అభివాదపరం విప్రం జ్యాయాంసమభివాదయేత్"
అసౌనామాహమస్మీతి స్వనామ పరికీర్తయేత్"
ప్రభామివార్కీం తమసాంనిహన్త్రీం
బ్రహ్మంతథానందనియమేన లక్ష్మీమ్,
తపోనిధింశౌర్యనిధిః ప్రసన్నః
స్వనామసంకీర్త్య ననామ రామః - 25

అ — ఆర్కీం = సూర్యునకు సంబంధించిన, ప్రభామివ =

కాంతివలె, తమసాంనిహన్త్రీం = చీకట్లను (అజ్ఞానమును) నిహన్త్రీం = పోగొట్టునటువంటి, బ్రాహ్మీం లక్ష్మీం = బ్రహ్మతేజస్సును, నియమేన = నియమముతో దధానం = ధరించుచున్న వాడును, తపోనిధిం = తపస్సునకు నిధియగు అగస్త్యుని, శౌర్యనిధిః = పరాక్రమశాలియు 'ప్రసన్నః = నిర్మలాంతః కరుణుడునైన, రామః = రాముడు స్వనామ = తనపేరును, సంకీర్త్య=చెప్పి, ననామ = నమస్కరించెను

తా — చీకటిని పోగొట్టు నీటి సూర్యకాంతివలె అజ్ఞానాన్ని అంతరింప జేసే, బ్రాహ్మతేజస్సును ధరించి, తపోనిధియైన అగస్త్యమహాముని మహాశౌర్య సంపన్నుడును, నిర్మలాంతః కరణుడునగు శ్రీరాముడు తన ప్రవరను జెప్పి నమస్కరించెను.

వి — శౌర్యనిధియగు శ్రీరాముడు తపోనిధియగు నగస్త్యుని సమీపించి "శ్రీరామవర్మా అహంభో అభివాదయే" అనితన పేరు చెప్పి నమస్కరించెను.

పెద్దలకు నమస్కారము చేయునప్పుడు, తన పేరును చెప్పుచు నమస్కారమును చేయుట శాస్త్రచోదితము, ఈ విషయములో మను స్మృతి ఇట్లనుచున్నది.

"అభివాదపరం విప్రంజ్యాయాంసమభివాదయేత్
అసౌనామాహమస్మీతి స్వనామపరికీర్తయేత్"

ఇచ్చట ఉపజాతివృత్తము ఉపజాతి చ్ఛందస్సనగా ఇంద్ర వజ్రావృత్తము యొక్క పాదములు, ఉపేంద్ర వజ్రావృత్తము యొక్క పాదములు కలసి యుండుట. ఒక పాదము ఇంద్రవజ్ర, మూడుపాదములు ఇంద్రవజ్ర, అయినను, రెండు ఇంద్రవజ్ర పాదములు రెండు ఉపేంద్ర వజ్ర పాదములు కలసినను, ఉపజాతి యగునని ఛంద శ్శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈ వృత్తమును కవులధికముగా వాడు

చుందురు, కాళిదాసుగారి కుమారసంభవపు మొదటి సర్గ ఇదే ఛంద స్సుతో వ్రాయబడినది,

త,త,జలు, రెండుగురువులునున్నచో ఇంద్రవజ్రయగును, జ,త,జలు, రెండుగురువులునున్నచో ఉపేంద్ర వజ్రయగును, ఈ రెండువృత్తముల పాదములను కలిపి వ్రాసినచో ఉజాపతివృత్తము లేక ఉపజాతి చ్ఛందస్సు సిద్ధించును. తదుక్తం వృత్తరత్నాకరే

"స్యాదింద్రవజ్రాయదితౌ జగౌగః"
"ఉపేంద్ర వజ్రా జతజాస్తతోగౌ"

గ — తతః పరమహర్షేణమహర్షిణా ప్రగీతాభిరాశీర్భిస్సహమురశాసన శరాసనం, సరసిజాసనాస్త్రం, సౌత్రామణం తూణీరయుగ్మం రుక్మమయకోశఖడ్గంచ ప్రతిగృహ్య, తదాజ్ఞయా గోదావర్యాస్తటనికట ప్రకటితాం పంచవటీమ సేవత. 28

అ— తతః= నమస్కారానంతరము, పరమహర్షేణ మిక్కిలి సంతోషముగల మహర్షిణా= అగస్త్యమహర్షిచే, ప్రణీతాభిః =ఇవ్వబడిన, ఆశీర్భిస్సహ = ఆశీస్సులతో కూడ, మురహరశరాసనం= వైష్ణవచాపమును, సరసిజాసనాస్త్రం= బ్రహ్మాస్త్రమును, సౌత్రామణం తూణీరయుగ్మం= ఇంద్రునకు సంబంధించిన అక్షయసాయకములు గల రెండమ్ములపొదులను, రుక్మమయకోశం= బంగారపు పిడిగల ఖడ్గంచ = ఖడ్గమునున్ను, ప్రతిగృహ్య = స్వీకరించి. తదాజ్ఞయా = మహాముని యొక్క అజ్ఞచే, గోదావరీ = గోదావరి నదియొక్క తట = ఒడునందు ప్రకటితాం = ప్రసిద్ధమైన పంచవటీం = పంచవటి యను నాశ్రమమును అసేవత = పొందెను.

తా— ఇట్లు నమస్కరించిన పిమ్మట, సాక్షాత్పర బ్రహ్మస్వరూపుడగు శ్రీరాముడు నన్ను చూడగోరి వచ్చిచూచుటయేకాక, నమస్కారమును కూడ చేసినాడను మిక్కిలి సంతోషముతో అగస్త్య మహాముని శ్రీరాముని

ఆశీర్వదించెను. మఱియు వైష్ణవ చాపమును, బ్రహ్మాస్త్రమును ఇంద్రునకు సంబంధించిన, అక్షయసాయక తూణీర యుగళమును బంగారపుపిడిగల ఖడ్గమును శ్రీరామునకు ఇచ్చెను. శ్రీరాముడువానిని స్వీకరించి వాని వద్ద సెలవు తీసికొని గోదావరీ నదీతీరమునను న్న పంచవటీ క్షేత్రమును జేరెను.

వి– ఇచ్చట ''పరమ హర్షేణ'', అనుపదము సాక్షాత్ పరబ్రహ్మస్వరూపు డగు శ్రీరాముడు నన్ను జూచుట యనునెపముతో నాయాశ్రమము నకు వచ్చినాడు తనదర్శన భాగ్యమును కలిగించి నాకు నమస్కరించి నాడు అనుపరమానందముతో నిండిన హృదయము గలవాడనునర్థము నిచ్చుచున్నది.

గ- తత్రవిస్తృత వక్షద్వంద్వ మప్రతిద్వంద్వమతి శౌర్యావస్థా ప్రత్యయం కృతాపరోక్ష్యమివ తార్క్ష్యం మహామహీధ్రకల్పం గృధ్ర రాజమద్రాక్షీత్.
అ- తత్ర = ఆపంచవటిలో, విస్తృతవక్షద్వంద్వం = పోటీ దారుడు లేని వాడును, శౌర్యవస్థా = మహా శౌర్యము ర్యాదకు, ప్రత్యయం = అధీనమై నవాడును, కృతాపరోక్ష్యం = ప్రత్యక్షమైన తార్క్ష్యమివ = గరుత్మంతు నివలెనున్నవాడును, మహామహీధ్రకల్పం = పెనుగొండవలెనున్న వాడును. అగు గృధ్రరాజం = గద్దలతేడగు జటాయువును, అద్రాక్షీత్ = చూచెను.

తా– శ్రీరాముడచ్చట విశాలమైన ఱెక్కలు గల వాడును జగదేక వీరుడును, శౌర్యానికి భూమియైనయును సాక్షాత్తుగరుత్మంతుని వలెనున్న వాడుని. అగు, జటాయువును గద్దల తేడును జూచెను.

వ– పానేవ హీన జలమద్రిమ పాస్య నూనం
మైనాక ఏష మునిపాశ్రయ మీతి జ్ఞాత్వా
శంకాభి మాంద్ర ఘుతేవ శకధితాత్మనం శ
స్వత్రాత మిత్ర మహమిత్య హరజ్జటాయుః

అ. పానేన = త్రాగివేయుటచే, హీనజలం = జలరహితమైన, అబ్ధిం = సముద్రమును, అపాస్య = విడిచిపెట్టి, ఏషమైనాకః = ఈమైనాకుడు మునిం = అగస్త్యమహామునిని ఆశ్రయితి = ఆశ్రయించుచున్నాడు, ఇతి = అని. రఘుపతి శ్రీరామునకు జాతాం = కలిగిన ఇమాం శంకాం = ఈ సందేహమును, కథితాత్మవంశః = చెప్పబడినతన వంశ వృత్తాంతము కలవాడగు జటాయుః = జటాయువు, అహం = నేను, త్వత్తాతమిత్రం = నీ తండ్రి యొక్క స్నేహితుడను, ఇతి = అని అహరత్ = పోగొట్టెను.

తా- అగస్త్యుడు సముద్రపానమును చేయుగా, సముద్రములో దాగియున్న హిమవంతుని కుమారుడగు మైనాకుడు బయటపడి మహామునిని ఆశ్రయింపుటకు వచ్చినాడేమో అను భ్రాంతిని గద్దలు జేడు రామునకు కలిగించెను. కాని, ఓయీ! వినతకు, అరుణుడు గరుడుడు బిడ్డలిద్దరు గలరు. అందు అరుణునకు నేను, మాయన్నయగు సంపాతి పుట్టితిమి. నా పేరు జటాయువు నేను మీతండ్రియగు దశరథునకు అప్తమిత్రుడనని తనవంశ వృత్తాంతమును తెలియజెప్పి ఆగద్దలజేడు శ్రీరాముని భ్రాంతిని తొలగించెను.

వి- గద్దలజేడగు జటాయువు, అగస్త్యుని ఆశ్రయింపగోరి వచ్చిన మైనాకుని పలెనున్నాడని కవి చెప్పినాడు ఇంద్రుడు రెక్కలు తెగగొట్టగలడని మైనాకుడు సముద్రుని ఆశ్రయించినాడు. ఆసముద్రుని, అగస్త్యుడు నిశ్శేషముగా త్రాగివేసినాడు. నిరాశ్రయుడైన మైనాకుడు అగస్త్యుని ఆశ్రయించినాడనుట సమంజసముగానున్నది. మైనాకుడు సముద్రుని ఆశ్రయించినాడనుటలో

"మైనాక మంభోనిధి బద్ధసఖ్యమ్"

అను కాళిదాసుని వచనము ప్రమాణము,

జటాయు శబ్దము షకారాంతముగాను ఉకారాంతముగాను,

ఉన్నది, "జటాయుషః పక్షపాతం విధాయ" అను జటాయోర్గంకొ పురస్థాం రఘువీరపత్నీమ్" అను శ్రీరామాయణ సంగ్రహములోని రెండు వాక్యములు, షకారాన్త-ఉకారాంతత్వసాధకములు.

ఇచ్చట వసంతతిలకా వృత్తము, దీని లక్షణమును 15 వ శ్లోకము లోచూడనగును,

గ - రామస్తు దశరథమివ పశ్యన్, కాశ్యపసమ్భూతం సంపా తేరనుజమనుజరచిత పర్ణశాలః పంచవట్యాం కంచిత్సమయం గమ యామాస29

అ-రామస్తు = రాముడయితే, కాశ్యపసమ్భూతం = కశ్యపుని పౌత్రుడును. సంపాతేః = సంపాతి యొక్క, అనుజం = తమ్ముడునగు తం= అజటాయువును దశరథమివ తన తండ్రియగు దశరథునివలె, పశ్యన్ = చూచుచు, అనుజ = తనతమ్ముడగు లక్ష్మణునిచే రచిత = తయారు చేయబడిన పర్ణశాలః = ఆకులయిల్లుగల వాడై, పంచవట్యాం = పంచవటిలో కంచిత్సమయం = కొంతకాలమును గమయామాస = గడపెను.

తా - శ్రీరాముడు కశ్యపుని మనుమడును, సంపాతి తమ్ముడు నైన జటాయువును తన తండ్రి యందలి యాదరాభిమానములతో చూచెను, పంచవటీక్షేత్రములో తనతమ్ముడగు లక్ష్మణునిచే నిర్మింపబడిన పర్ణశాలలో కొంతకాలము గడపెను.

గ - అథకదాచిదుపచీయమానమనో భవవైభవః పాకకపిశ కలమమంజరిపుంజ పింజరి భూత కేదార ప్రపంచః, పంచబాణరణ ప్రయాణోచితవీరపాణవత్పుత్రపుటపౌత్రదృశ్యావశ్యాయ బిందు సంహదోః, చంద్రాత పేనిరానన్దతాం, చందనాను లేపేనిర్లోలుపతాం చంద్రశాలాయాం ,నిరాశతాం, చంద్రోపలస్థలేనిరాస్థతాం, వాతాయన సేవనే నిరుత్సుకతాం, వాపీకూపోపకంఠే నిరుత్తరతాం వాపీకూపోపకంఠేనిరుత్కంఠతాం,

వాసరా వసానే నిరాదరతాం, హారివిహారే నిరాకాంక్షతాం, ఉత్పలమాలా యాముపేక్ష్యతాం ఉపవనభజ నేప్యుద్విగ్నతాంచజనానాం జనయన్, గమ్భీరాభోగ గర్భగృహస్య ఘనేష్టక చితభిత్తే రశ్లక్ష్ణ తిరస్కరిణీ పటలస్య శశోదరలోమ మృదు కంబళస్య కాలాగురు, ధూపస్య, కాశ్మీరా గరాగస్య నిర్ధూమాంగార్ధభరిత హసన్తికాయంత్ర స్యచసుభగంకరణః మదన కరేణు కరవికీర్ణ శీకర నికరాయమాణ తుషార ధూళీధూసర వాసరః, సరసీరుహదానపావకః, తుహినస్రవ శీతలాసికా ధరదళదూరీ భూతదంశకృత్యః, ప్రక్షీణ తారుణ్య పణ్యాఙ్గనాఙ్గవక్త్రప్రయాత సౌభాగ్య సన్నివేశః, తాలవృన్తవిశ్రాన్తికాలః, కామినీ స్తన భరగిరి దుర్గసీమ్ని, నిర్భయ నిలీన నిరాఘభావః, దివాభీతవ్రాతస్యాపి అతి భయంకరదివాకరః, చకోరనికరస్యాపి అనతిక్షేమంకర సుధాకరః కాదమ్బ కదమ్బస్యాపి అనతి ప్రియంకర కమలాకరః కృతకరముగ ళస్వస్తిక్ బంధనతయా, నీహారాతంక శంకయాహృదయ కమలమివ-గోపాయంతం అశ్రాన్తదన్తవీణావ్యాపారేణ వేపమానాధర పుటతయా శీతికాపిశాచికానివారణాయ నిపుణం మంత్ర జపమివ కుర్వన్తం, అవిరళ పులక పాళీ కబళిత కళేబరతయా సకరుణ విధివితీర్ణరోమ కంబళ కృతాంగరక్ష. మివభిక్షామటన్తం దుర్గతవర్గంనిర్ఘృణాకదాచిదపికమలా నాలోకితవతీతస్యైసా సూయాఇవ తదీయ వాసతామరసం పత్రకోశం వినాశయన్ అజ్గజకమతజ్గజకర పుష్కరోత్థిత శీకరనికరాకారైరతి పరుష స్మరశరనిపాత ప్రతప్త గగనాఙ్గనాఙ్గస్రవ త్స్వేద సదృక్షైః, అక్షీణ తుహిమ ప్రసరైః, అధ్వగాన్త కరణానిసీమన్తః యన్ మన్తసమయ స్సముద జృమ్భత

అ- అధ = పంచవటిలో కొంత కాలము గడిపిన పిదప, కదాచిత్ = ఒకానొకప్పుడు, ఉపచీయమాన = వృద్ధిని పొందుచున్న, మనో

వవైభవః = కామోత్సవము గలదియు, పాక = పక్వావస్థ చేకపిశ = పిశంగ వర్ణముగల (బూడిదరంగుగల) కలమ మంజరీపుంజ = ధాన్య పుకంకులగుత్తులతో పింజరీభూత = పచ్చగాను, ఎఱ్ఱగా నున్న కేదార ప్రపంచః = వ్రీహిక్షేత్రవిస్తారము గలదియు, పంచబాణ = మారమహ వీరుని యుక్క, రణప్రయాణ = జైత్రయాత్రాప్రారంభమునందు ఉచిత = యోగ్యమైన వీరపానత్ = వీరులు యుద్ధమునకు మున్ముందుగా చేయు మధు పానము తో తుల్యమైన పత్రపుట = చెట్ల ఆకుల యొక్క దొన్నెలనే పాత్ర = చషకమునయందు సందృశ్య = చూడబడిన అవశ్యాయ బిందు సందోహః = మంచు బిందువులసముదాయము గలదియు, చంద్రాతపే = వెన్నెలయందు. నిరానందతాం = ప్రీతిలేక పోవుటను, చందనానులేపే = చందనపుమైపూతయందు. నిర్లోలుపతాం = పేక్షలేకపోవుటను, చంద్రశాలాయాం = మేడయందు నిరాశతాం కోరిక లేక నిరాసంతాపోవుటను, చంద్రోపలస్థలే = చంద్రకాంత కుట్టిమము నందు = నిరాసక్తి లేక పోవుటను = వాతాయనసేవనే = కిటికీదగ్గఱ కూర్చునుటలో = నిరుత్సుకతాం సంతోషము లేక = పోవుటను పోపికూపోపకంఠే = దిగుడుబావులయొక్కయు నూతులయొక్కయు సమీపమునందు, నిరుత్కంఠతాం వేడుకలేక పోవుటయును, వాసరావసానే = సాయంకాలమునందు, నిరాదరతాం = ఆదరణము లేక పోవుటను హరి విహారకాలేజల క్రీడల యందు నిరాకాంక్షతాం = నిస్పృహత్వమును = ఉత్పలమాలాయాం = కలువపూల దండయందు. ఉపేక్ష్యతాం = ఔదాసీన్యమును, ఉపవనభజనే = పూలతోటలో విహరించుటలో ఉద్విగ్నతామపి ఝుడుపును, జనానాం = జనులకు. జనయన్ = కలిగించుచు గంభీరాభోగగర్భగృహస్య = గాంభీర్య యుక్తమైన, వైశాల్యము గల గర్భగృహమునకు ఘనేష్టక = మంచియిటుకలతో రచిత =

తయారు చేయబడిన భిత్తేః = గోడకు, అశ్లక్ష్ణ = సుఘటితమైన తిరస్క-
రిణీ పటలస్య = తెరలకు, కర్ణోదర = చెవులపిల్లి యొక్క కడుపు
నందలి రోమ = వెంట్రుకలవలె మృదుల = మెత్తనైన కంబళస్య =
కంబళమునకు కాలాగురు ధూమస్య = నల్లని అగరు వత్తులపొగకు,
కాశ్మీరాంగరాగస్య = కుంకుమపుపైపూతకు, నిర్ధూమాంగార = పొగలేని
ఎఱ్ఱని బొగ్గులతో భరిత = నిండిన హసంతికాయంత్రస్య = కుంపటికిని
సుభగంకరణః = సౌభాగ్యమును కలిగించునదియును, మదనకరేణు =
మన్మథుడను ఆడఏనుగు యొక్క కర = తొండముచే వికీర్ణ = వెద-
జల్లబడిన శీకరనికరాయమాణ = తుంపరలవలెనున్న తుషార ధూళీ =
మంచు అనే దుమ్ముతో ధూసర = బూడిదరంగుగల వాసః = పగలు
గలదియును, తరసీరుహ = తామరపువ్వులకు దావపావకః = కార్చిచ్చు
అయినదియు, తుహినప్రవణిత = మంచుచే గాయపరుపబడిన లాసికా =
పణ్యస్త్రీలయొక్క అధరతటస్య = చిగురుటాకువంటి పెదవులకు
దూరీభూత = చాలదూరమైన దంతక్షతస్య = దంతక్షతములు కలదియు,
ప్రక్షీణతారుణ్యపణ్యాఙ్గనావయోవత్ = ముసలిభోగముదాని అవయ-
వములవలె ప్రఘాతసౌభాగ్య = పోయిన అందముగల ప్రపాసన్నివేశః
= చలివేంద్రములు గలదియును, తాలవృంత విశ్రాంతికాలః = విసని-
కఱ్ఱలకు తీరికసమయమునున్న, కామినీస్తనకఠినదుర్గసీమ్ని = సుంద-
రీమణుల యొక్క స్తనమండలమనే కొండమీదికోటయందు నిర్భయః =
భయములేకుండగా, నిలీన = దాగియున్న, నిష్ఠురభావః = వెత్ప
దనము గలదియు, దివాంధవ్రాతస్యాపి = గుడ్లగూబ గుంపులకుకూడ,
అవహితభయంకరః = భయమును కలిగించని దివాకరః = సూర్యుడు
గలదియును చకోరనికరస్యాపి = చకోరపుగుంపులకుకూడ అనతిక్షీణక-
రసుధాకరః = మిక్కిలి క్షీణమున్ను కలిగియుండని చంద్రుడు గలదియును,
కాదంబకదంబస్యాపి = అంచలపిండునకు కూడ అనతిప్రియంకరః =

మిక్కిలి ప్రీతిని కలిగింపని కమలాకరః = తామరకొలనులుగలదియును కృతకరయుగళస్వస్తిక బంధతనయా = చేయబడినచేతులయొక్క స్వస్తిక బంధనముకలవారగుటచే నీహారాంతకశంకయా = మంచుకురియునను భయముతో హృదయకమలం = తమగుండెయను తామర పువ్వును గోపాయంతమివ = రక్షించుకొనుచున్న వాని వలెనున్నది యును, అశ్రాంత = ఎల్లప్పుడు దంతవీణావ్యాపారేణ = చలికి పళ్లుకొట్టుకొనుటచేత వేపమాన = కదులుచున్న అధరపుటతయా = క్రింది పెదవులుకలవారగుటచే, శీతికాపిశాచికా = చలియనుపిశాచమును నిర్వ రణాయ = పారద్రోలుటకు నిపుణం = సమర్థమయిన మంత్రజపం = మంత్రోచ్చారణమును కుర్వంతమివ = చేయుచున్న వారివలెను, అవి రళపులకపాళీ = దట్టమైనరోమాంచముతో, కబళిత = మ్రింగివేయబడిన కళేబరతయా = శరీరము గల వారగుటచే, సకరుణ = దయాపూర్వకముగ, విధి = దైవముచే వితీర్ణ = ఇవ్వబడిన రోమ = వెంట్రుకలనే, కంబళ = కంబళిచే కృతాంగరక్షమివ = చేయబడిన శరీరరక్షణము కల వారివలె భిక్షామటన్తం = బిచ్చమెత్తుకొనుచున్న దుర్గతవర్గం = దరిద్రులను, నిర్ఘృణా = దయావిహీనురాలై కదాచిదపి = ఎన్నడూ, కమలా = లక్ష్మి అనాలోకితవతీతి = చూడలేదని తస్యై = ఆలక్ష్మికొఱకు, సాసూయా ఇవ = అసూయనుపొందినవాని వలె తదీయవాస తామరసం = ఆమె యొక్కనివాసస్థానమును, సపత్రకోశం = ఆకులతోను మొగ్గలతోను, వాహనముతోను ధనముతోను కూడ వినాశయన్ = నశింపజేయుచు అంగజమతంగజ = మన్మథుడనే ఏనుగు యొక్క కరపుష్కర = హస్తాగ్రమునుండిఉత్థిత = బయలుదేరిన శీకర నికరాకారైః = తుంపరల రూపములోనున్న స్మరశర = మన్మథబాణముల యొక్క, నిపాత = పడుటచే, ప్రతప్త = వేడెక్కిన గగనాంగనా = ఆకాశాంగన యొక్క అంగ = శరీరమునుండి స్రవత్ = స్రవించుచున్న స్వేద = చెమటతో

సదృక్షైః = సమానమైనవియు అక్షీణమహిమ = గొప్పప్రభావముగల హిమప్రసరైః = మంచువానచే, అధ్వంగాతః కరణాని = బాటసారుల యొక్క హృదయములను సీమంతరయన్‌చీల్చుచు, హేమంతసమయః = హేమంతకాలము సముదజృంభత = విజృంభించెను.

తా - పంచవటిలో కొంత కాలము గడిపినపిదపహేమంతర్తువు ప్రవేశించెను. అప్పుడు మనోభవ వైభవము పెరుగజొచ్చెను. వ్రీహిక్షేత్రములు పండబారినధాన్యపుకంకులతో పచ్చగానుఎఱ్ఱగాను కన్పట్టుచుండెను.

ఆకసము నుండి మంచు బిందువులు హెచ్చుగా పడజొచ్చెను. ఆకుల దొన్నెలలో పడినమంచుచూపరులచూపుల నాకర్షించుచుండెను. ఆయాకులదొన్నెల మారమహావీరుని జైత్రయాత్రారంభములోచేయు వీరపానమునకు వలయుచషకములవలె (పానపాత్రలవలె) కనుపించు చుండెను.

వెన్నెల మీదిప్రీతిని విడనాడిరి. సురభితములగుమైపూతలను మానివేసిరి మేడల పైభాగములలో పడకలను కట్టిరి. చంద్రకాంత-శిలావేదికలమీదగోష్ఠులను నిలిపివేసిరి. చల్లనిగాలికొఱకై గవాక్షములక డకేగుట నచ్చనివనిఅయ్యెను. దిగుడు బావులకడకు నూతులకడకువెళ్లి విహారములు సలుపుటనాపివేసిరి. సాయంకాలసమయముల యందలి ప్రీతితక్కువాయెను, వలిలక్రీడాసక్తి సన్నగిల్లెను. కలువపూలమాలలను ధరింపవలెనను కోరికమనస్సులలోనినెలిచిపోయెను, పూలతోటలో చెలుల తోవిహరించుటకు భయమునొందుచుంటిరి. మందిరాంతర్గృహభిత్తులకుకూడ దట్టమైన తెరలను కట్టుచుండిరి, నేలమీద చెపుల పిల్లులకడుపుమీది మెత్తని వెంట్రుకలతో తయారు చేసిన తివాచీలను పరుచుచుండిరి, అగరువత్తులపొగ, కాశ్మీరాంగరాగము, పొగలేని, ఎఱ్ఱనిబొగ్గులతోనిండిన కుంపటి ఇంటింటకన్నుల పండుపుగా కన్పట్టుచుండెను,

మన్మథుఁడను నాడ వినుగుతొండముతో చల్లిననీటితుంపరలలో అనునట్లు తుషారశీకరాసారము ఖూడిదరంగుగలదియైపగలంతాకుతియు చుండెను తామరపువ్వులు కార్చిచ్చు సెగకుమాడినట్లు నల్లబడుచుండెను మంచు వలన పగిలిన భోగకాంతలచిగురుటాకులవలె నున్న పెదవులకు దంతక్షతములు కఱవాయెను. యౌవనాపగమమున భోగకాంతలయుపయ వములవలె చల్విచంద్రముల సౌభాగ్యము సన్నగిలుచుండెను. విసన్ని కఱ్ఱలమీఁది ప్రీతితగ్గు మొహము పట్టెను.

సుందరీమణులస్తన మండలములను కొండల మీదికోటలలో వెచ్చదనము హాయిగా తలదాచుకొనుచుండెను.

సహస్రకిరణుడయ్యును సూర్యుడు గుడ్లగూబగుంపులకు మిక్కిలి భయమును కలిగింపజాలడాయెను చల్లనికిరణములు గలవా డయ్యును చంద్రుడు చకోరనికరమునకు మిక్కిలి క్షేమమును కలిగింప జాలడాయెను. తామర కొలనులు అంచపిండులకు మిక్కిలి ప్రీతిని కలిగింపజాలకుండెను.

స్వస్తిక చిహ్నమువలెనున్న వక్షోజములయందలి హస్తద్వయితో గర్భిణీభామలు తమతమప్రదేశమున కనులఁలొట్టలకు మంచు సోకునను భీతితో దాచుకొనుచుండిరి. విధి విలాసము లేకుండగ, చలికి కళ్ళు కొట్టుకొనుట వలన వణుకుచున్న పెదవుల, గజజన్ములు చలిపిశాచమును పారద్రోలుటకు మంత్రోచ్చారణమును చేయుచున్నారేమో అనిపించెడిది.

దట్టమైన రోమాంచముతో నిండిన కొందఱుభిక్షుకులు జాలితో భగవంతుడిచ్చిన గొచ్చుకంబళులతో ఆపాదమస్తకము తమ దేహమును కప్పుకొనుచున్న వారివలె నుండిరి. అట్టిబిచ్చగాండ్రను దయావిహీను రాలైకములాల్లయయుగు లక్ష్మిసరిగా చూచుట లేదను నసూయతో ఆమె

నివాసస్థానమగు తామరపువ్వును. (కమలమును) అకులతోను మొగ్గల ధనముతోన్ను, వాహనములతోను కాలము నశింపజేయుచుండెను

మన్మథుడను నేనుగు యొక్క తొండము నుండిపుట్టిన నీటితుంప రలవలెను, అతికఠినమైనమారశరములతాకిడిచే వేడెక్కిన గగనాంగనా శరీరము నుండి పుట్టిన చెమటతో సమానమై గొప్పప్రభావముగల మంచువానతో భాటసారుల గుండెలు ఛీల్చబడుచుండెను. ఇట్టి హేమంత సమయము దేశమందంతటా విజృంభించెను.

వి- ఇంత హృద్యమైన గద్యము తక్కిన కాండలలోనెచ్చటను కన్పట్టదు. ముచ్చటను గొలుపు మాధుర్య గుణమిచ్చట కాననగును. "వెన్నెలమీదిప్రీతిని విడనాడిరి. మైపూతలను మానివేసిరి. మేడలపై భాగములలోపడకలనుకట్టిపెట్టిరి" అనువాక్యములలో వేర్వేఱు క్రియలను వాడి కవీశ్వరుడు, తన-ఉక్తి వైచిత్ర్యమును ప్రదర్శించి, మాధుర్య గుణమును పోషించి తన కవితావైభవమును ప్రదర్శించినాడు.

ప - యత్ర కాంతాన పశ్యన్తిక్లాన్తావి రహవహ్నినా, నిశావసాన
వేలాం చవేలాం చ వ్యసనాంబుధేః.

అ - యత్ర = ఏహేమంతర్తువు నందు, విరహవహ్నినా = ప్రియవియోగాగ్నిచే క్లాంతాః = బాధింపబడిన కాంతాః = యువతులు, నిశావసానవేలాం = రాత్రి యొక్క చివరను, వ్యసనామ్బుధేః = దుఃఖసాగరముయొక్క వేలాంచ = ఒడ్డునునున్న పశ్యంతి = చూ చుటలేదు.

తా - ప్రియవియోగాగ్నిచే పీడితలగుచున్న కాంతామణులు దుస్సహవిరవేదహనచే, నిరవధికముగ కన్పట్టుచున్న నిశావసానవేళను దుస్తరమైన దుఃఖసాగరముయొక్క సరిహద్దును కానరైరి.

వి - క్లాంతాః-కాంతాః, వేలాం-వేలాం, అనుద్వికములు శబ్ద

వైచిత్ర్యమును పోషించి-కవీశ్వరుని ప్రతిభను, ఉగ్గడించిన హృదయుల కానందమును కూర్చుచున్నవి.

గ – తత్ర పర్ణశాలామధ్యమధ్యాసీనం లక్ష్మణాగ్రజమ్ముపాసన్నసాద శూర్పణఖా. 32

అ – తత్ర = ఆహేమంతసమయమున, శూర్పణఖా = శూర్పణఖయను రాక్షసి (రావణుని చెల్లెలు) పర్ణశాలామధ్యం = తాటియాకుల యింటి మధ్యభాగములో, అధ్యాసీనం = కూర్చొనియున్న, లక్ష్మణాగ్రజం = లక్ష్మణుని అన్నయగు శ్రీరాముని ఉపసన్నసాద = పొందెను.

అప్పుడక్కడ శ్రీరాముడు-పర్ణశాలలో హాయిగా కూర్చొని యుండెను వానిచెంతకు రావణుని సోదరియగు శూర్పణఖయను రాక్షసి, ఒయ్యారపు నడకలతో చేరెను.

శూర్పం = శోధితధాన్యజనం, తేన యజ్ఞాదిక్రియాః, నఖయతి = ధ్వంసయతీతి శూర్పణఖా, శూర్పాకారాణి నఖాని (చేటలవంటిగోళ్లు) యస్యాస్సా ఇతి ఇతినావ్యుత్పత్తిం కథయన్తి. నెత్తురుకుండతో యజ్ఞములను పాడుచేయునదిఅనిగాని చేటలవంటి గోళ్లుకలది అనిగాని శూర్పణఖాశబ్దమునకు పెద్దలు వ్యుత్పత్తిని చెప్పుచున్నారు.

ప – తస్మిన్నుజ్జృంభితోష్ఠ స్తనతట దయితా హీనసంహారకాలే
జాతే ప్రాలేయధారా కవచితగగనాభోగదిక్చక్రవాలే
కాష్ఠాంతా రాక్షసీసా పతిమతిమకరోత్స్వైరఖేలీ। పాంచనాగే,
లక్ష్మీలీలారవిన్దస్తనపరిశీతదీయంచి శ్రితీశ్వేనికేత 33

అ – ఉజ్జృంభిత = విజృంభించిన, పుష్ట = పెద్దదైన, స్తనతట = కుచమండలములుగల, దయితా = ప్రియురాండ్రచే హీన = విడువబడినవారలను, సంహార = బాధించుటయందు కాలే = యమస్వరూపమును ధరించినట్టియు, ప్రాలేయధారా = గాఢమంచుతో కవచిత = కప్పబడిన గగనాభోగ = విశాలమైన ఆకాశము

దిక్చక్ర వాళే = దిఙ్మండలము కలిగిన తస్మిన్ కాలే = ఆ హేమంత సమయము = నందు కామాంధా = కామముతో అంధురాలై వివేకదృష్టి లేనట్టి సారాక్షసీ = శూర్పణఖయను నారాక్షసి, లక్ష్మీలీలారవిందే = లక్ష్మీవిహార = పద్మమునందు, నవపిశితధియం = నూతనమాంసబుద్ధిని తన్వతీ = కలిగియున్న శ్యేనికేవ = ఆడడేగవలె, మైథిలీ ప్రాణనాథే = సీతాదేవి భర్తయందు. పతిమేఽతిం = ఇతడు నాకు భర్తయగుగాక అను బుద్ధిని, అకరోత్ = చేసెను.

తా — ప్రియురాండ్ర వెచ్చని కుచ = మండలాలింగనము లేమింజేసి విరహార్తులకు బాధనుకలిగించు = నట్టిదియు, తుషార శీకరాసారముతో గగనమండల దిఙ్మండలములు సమాచ్ఛాది = తములై నసమయములో కామాంధురాలై, రావణుని సోదరియగు శూర్పణఖయను నొక పెను రక్కసి శ్యేనాంగన (ఆడడేగ) లక్ష్మీదేవి హస్తలీలాకమలమునందు నూతన మాంసబుద్ధిని కలిగియున్నట్లువలె సీతావల్లభుడగు శ్రీరాముని యందు భర్తృభ్రాంతిని కలిగి యుండెను.

వి - హేమంత సమయములో నిప్పులకుంపటిని, దుప్పటిని నవ్వుచున్న తరుణీమణిని పురుషపుంగవులు తప్పక సేవింపవలెను, సేవింపనివారు పురుషాధములుగా పరిగణింపబడుదురు. తదుక్తమురసికై

"హసన్తీం చ శ్వసన్తీం చ హసన్తీం వామలోచనామ్
హేమన్తే యేన సేవన్తే తే మతాః పురుషాధమాః"

ఈశ్లోకములో స్రగ్ధరా వృత్తము. స్రగ్ధరలో మ్రసమగణ, రగణ, భగణ, నగణము, మూడు యగణములు నుండవలెను. ఏడక్షరముల చొప్పున మూడుయతిస్థానములు.

గ - తతస్తేన జానకీ జానిరితి జానీహిజనమిమం మమానుజ మతిమనుజ భుజల ముబలావియుక్తం యుక్త — మాశ్రయితుంతవేతి

ప్రత్యాఖ్యాతా రామేణసా సౌమిత్రిముపేత్య యథామనీషితమభాషత 34

గ - తేనాపి భద్రేతస్యార్యస్య దాసోహం, దాస భార్యా పదమనార్యం నను నార్యాః కులజాతాయాః తస్మాత్త మేవ భజేథాః 35

గ - కించ క్రూరసత్త్వభయానక సంచారాచుతరాం విదేహరాజ పుత్రీం విహాయ తత్రభవతీంమేవాసౌ పరిగ్రహిష్యతీతిల క్ష్మణేనాభిహితా పీత మతిస్స్వహితమితి తదీయం వచనమమనుత 36

అ - తతః = భర్తనుగా కోరిన తరువాత, ఇమంజనం = నన్ను జానకీజానిం = జనకమహారాజు కూతురగు సీతయొక్క భర్తనుగా, జానీహి = తెలిసికొనుము, అతిమనుజభుజలం = అమానుషబాహుబలశాలియును, అబలావియుక్తం = భార్యావిరహితుడైయున్న మమానుజం = నాసోదరుని ఆశ్రయితుం = ఆశ్రయించుట, తవ = నీకు, యుక్తం = తగినపనిఅని, రామేణ = రామునిచేత, ప్రత్యాఖ్యాతా = తరస్కరింపబడిన, సా = ఆశూర్పణఖ, సౌమిత్రి = సుమిత్రానందనుడగు లక్ష్మణుని, ఉపేత్య = సమీపించియథామనీషితం = తనకోరికననుసరించి అభాషత = పలికెను.

భద్రే = ఓకల్యాణీ, అహం = నేను, ఆర్యస్య = శ్రేష్ఠుడైనతస్య = ఆరామునియొక్క దాసః = భృత్యుడను కులజాతాయాః = గొప్పవంశములో పుట్టిన నార్యాః = యువతికి, దాసభార్యాపదం = భృత్యునియొక్కభార్యయొక్కస్థానము అనార్యం = తగినదికాదు. తస్మాత్ = కాబట్టితమేత = పూజ్యుడగు రామచంద్రనే భజేథాః = భర్తనుగా పొందుము.

కించ = మరియు, క్రూరసత్త్వ = దుష్టజంతువులతో భయానక = భయంకరమైన, కొనన = అడవియందు సంచార = తిరుగుటలో

అపతురాం = నిర్ళరితనములేని, విదేహరాజపుత్రీం = కృశాంగియగు రాజకుమారిని, విహాయ = విడిచిపెట్టి, తత్రభవతీం = పూజ్యురాలవగు౦ భవతీమేవ = నిన్నే, అసౌ = రాముడు పరిగ్రహిష్యతి = స్వీకరింప గలడు, ఇతి = అని తేన లక్ష్మణేనాపి = ఆలక్ష్మణునిచేతకూడ, అభిహితా = చెప్పబడినదై, వీతమతిః = నష్టబుద్ధియై, సా = ఆశూర్పణఖ తదీయం వచనం = ఆలక్ష్మణునియొక్క మాటను, హితమితి = తనకను కూలమైనది అని, అమనుత = తలచెను.

తా — ఓయీ! నేను జనకమహారాజు యొక్క కూతురు పెనిమిటిని. నాకు భార్యయున్నది. అమానుష బాహు బలశాలియగు నాతమ్మునకు భార్య దగ్గఱలో లేదు. కాన నాతమ్ముడు లక్ష్మణుని, ఆశ్రయించుట నీకు తగిన పనియని యారక్కసితో పలికి శ్రీరాముడామె నటనుండి పెడలగొట్టెను. అంతటనారక్కసి శ్రీరాముని విడిచి లక్ష్మణుని సమీపించి వానితో తనకోరికనిట్లు వెల్లడించెను.

ఓకల్యాణీ! శ్రేష్ఠుడగు శ్రీరాముని భృత్యుడను. గొప్పకులములో పుట్టిన వారికి భృత్యుని వివాహమాడుట పాడికాదు. నీవుగొప్ప కులములోపుట్టినావు. అట్టి నీవు నాబోటి భృత్యుని వివాహమాడుట తగినపని కాదు. కాబట్టి పూజ్యుడగు శ్రీరాముని భర్తగా బడయుము.

ప — దశరథాత్మజయుగ్మ నిరీక్షణ
క్షణసమాకుల బుద్ధిరియం దధౌ,
ఉభయకూల సమస్థితశాద్వల
భ్రమగతాగత భిన్నగవీదశామ్. 37

టీ — దశరథాత్మజ యుగ్మ = దశరథుని యొక్క కుమారులగు రామలక్ష్మణు లిద్దఱియొక్క, నిరీక్షణక్షణ = చూచుటయను ఉత్సవ ముతో, సమాకుల = కలతనొందిన, బుద్ధిః = బుద్ధిగల, ఇయం = ఈ శూర్పణఖ, ఉభయకూల = రెండు ఒడ్డులయందు, సమ = సమాన

ముగా స్థిత = ఉన్న, శాద్వలభ్రమ = పచ్చికబయళ్ల యొక్క భ్రాంతిని గత = పొందిన, ఖిన్న = ఖేదమునుచెందిన, గవీ = అవు యొక్క, దశాం = అవస్థను దధౌ = పొందెను.

తా — ఒక అవు నదీతీరములో నిలబడి చూడగా, అవలియొడ్డున దట్టమైన పచ్చగడ్డి యున్నట్లు కనబడెను. అటువెళ్లియిటుచూడగా ఈవలియొడ్డున దట్టమైన పచ్చగడ్డియున్నట్లు కనబడెను. ఈస్థితియే అన్నదమ్ములగు రామలక్ష్మణులను జూచి కలతజెందిన శూర్పణఖకు ఏర్పడెను. ఈశ్లోకములో ద్రుతవిలంచిత వృత్తము. దీని లక్షణమును చూడుడు.

వ — వృషస్యన్తీ వృషస్కంధం రాఘవం రావణానుజా,
భూయశ్శూర్పణఖా భేజే శూర్పకారాతి బాధితా. ౬౮

అ — రావణానుజా =రావణాసురుని చెల్లెలగు; శూర్పణఖా = శూర్పణఖ, శూర్పకారాతి = మన్మథునిచే బాధితా = బాధింపబడినదియై భూయః = తిరిగి, వృషస్కంధం = ఎద్దుమూపురమువలె ఎత్తైన భుజములుగల రాఘవం = శ్రీరాముని, భేజే = పొందెను.

తా — రావణుని సహోదరియగు శూర్పణఖ జగన్మోహన దివ్య మంగళ విగ్రహుడగు శ్రీరాముని మనోజవేదనా దోదూయమాన మానసయై తిరిగి సమీపించెను.

ఈశ్లోకములో పద్యవృత్తము. దీని లక్షణమును వశ్లోకములో చూడుడు.

వషస్యన్తీ-వృషస్కంధం, శూర్పణఖా-శూర్పకారాతియను ద్వితములు-భోజదేవుని శబ్దచమత్కృతిని శోభింప జేయుచున్నవి. వృష

వృషస్త్రీ అనుపదమునకు కాముకి అని అర్థము. వృషస్కంధం అనుపదము ఎద్దుమూపురము వలె ఎత్తైన భుజములు గలవాడను నర్థమును బోధించుచు స్కంధౌన్నత్యము మహాపురుష లక్షణమని తెలియజేయుచున్నది. శూర్పణఖా బాధితా అని విశేషణము, శ్రీరాముని జగన్మోహన దివ్య మంగళవిగ్రహమును జూచి శూర్పణఖ మదనాతురయయ్యెనని బోధించు చున్నది. శూర్పకారాతి పదము-మాయావియగు శంబరాసురు నిశత్రువగు మన్మథుని బోధించుచున్నది.

గ - తదనుజనక = దుహితరనితర యువతి =యోగ్య = భాగ్యం రామస్య రూపరామణీయకం చనిరూప్య, పునరియమేవ =మచింతయత్.

అ - తదను = తరువాత, జనకదుహితుః = జనకమహారాజు యొక్క కూతురగు సీతయొక్క, అనితరయువతియోగ్య = ఇతరస్త్రీల కెవరికీ లేనట్టి, భాగ్యం = అదృష్టమును, రామస్య = శ్రీరాముని యొక్క, రూపరామణీయకం చ = ఆకారసౌందర్యమునున్ను, నిరూప్య = చూచి, పునః =తిరిగి, ఇయం = ఈ శూర్పణఖ, ఏవం = ఈచెప్ప బోవుప్రకారముగ, అచింతయత్ = తలంచెను.

తా - సమీపించిన పిమ్మట, అనన్యయువతీ సాధారణమగు సీతాభాగ్యమును, శ్రీరామచంద్రుని మనోహరాకారమును తిలకించి తనమనములో శూర్పణఖ యిట్లు తలపోయ దొడగెను.

వి - అనితరయువతి యోగ్యమైన జానకీ భాగ్యము, రామ చంద్రుని రూపరామణీయకము శూర్పణఖను పుంశ్చలిగా చేసినవి. శ్రీరామపత్నికావలెనన్న, గొప్ప యదృష్టము తప్పక ఉండవలెను.

రాముని యాకార సౌందర్యము వర్ణింపనలవి కానిది. కుండల, ముక్తాహార, నూపురాంగదాది చతుర్విధ భూషణములు లేకపోయినను,

అలంకరింప = బడినట్లు భాసించు ఆకారవిశేషమే రూపము. తదుక్తం = ంభావప్రకాశే.

ఆవేధ్యారోప్య నిక్షేప్య బంధనీయై రభూషితమ్
యద్భూషితమివాభాతి తద్రూపమితి కథ్యతే,

సుందరములైన నగలు లేకుండగనే ఎవరి యవయవములు అలంకరింప బనడిట్లు భాసించునో వారియాకారము రూపమని భూపాలుడు చెప్పుచున్నాడు.

అంగాన్య = భూషితాన్యేవ
ప్రేక్షణీయైర్విభూషణైః,
యేన భూషిత = వద్భాతి
తద్రూపమితి కథ్యతే భూపాలః.

వ - లావణ్యామ్బునిధే ర = ముష్యదయితా మేనామిషైనంజనం
కస్మాన్నా సృజదస్మదన్వయగురోరుత్పత్తిభూః పద్మభూః
అస్తామేతదరణ్యవాసరసికేహా కష్టమస్మిన్నిమాం
కాంతిం కాననచంద్రికా సమదశాం కిం నిర్మమే నిర్మమే. 40

అ - అస్మదన్వయగురోః = మావంశములో శ్రేష్ఠుడైన పులస్త్య బ్రహ్మకు, ఉత్పత్తిభూః = జన్మస్థానమైన, పద్మభూః = బ్రహ్మ, లావణ్యాంబునిధేః = సౌందర్యరాశియైన, అముష్య, = ఈశ్రీరామునియొక్క దయితామివ = భార్యయగు సీతనువలె, ఏనం జనం = ఈనన్నుకూడా కస్మాత్ = ఎందువలన, నాసృజత్ = సృష్టింపలేదు. ఏతత్ = యీవిషయము ఆస్తాం = ఉండుగాక, కింతు = మరేమిటంటే, అరణ్యవాసరసికే = వనవాసప్రియుడైన, అస్మిన్ = అడవిరామునియందు కాననచంద్రికా సమదశాం = అడవిలో కాచిన వెన్నెలతో సమానమైన

అవస్థలగ, ఛమాం కాంతిం = ఈ సౌందర్యమును, నిర్మమే = వైరాగ్య సంపన్నుడైన, అస్మిన్ = ఈ శ్రీరాముని యందు, నిర్మమే = సృష్టించెనో, హా = అయ్యో! కష్టం = క్లేశావహము.

తా — మా వంశములోని మూలపురుషుడు పులస్త్యుడు, అతని తండ్రి పద్మసంభవుడు. అతడు అపరిమిత లావణ్య సంపన్నుడైన యీ శ్రీరాముని యొక్క ప్రియురాలగు సీతనుపలె వన్నెల సృజించి యుండలేదో! ఇది య టుండనిండు, మమతాభిమానములు లేనివాడును అరణ్యసంచారమునం దాదరాభిమానములు గలవాడునగు రాముని యందు అడవికికాచిన వెన్నెలయగు నీ అందచందములనేల సృజించెనో

వి — ఈశ్లోకములో శార్దూల విక్రీడిత వృత్తము, మ, స, జ, స, త, త, గ లున్నచో శార్దూల విక్రీడితవృత్తమగును. దీనికి పాదము నకు పందొమ్మిది యక్షరములు. పన్నెండవ యక్షరము, ఏడవఅక్షరము యతిస్థానములు రాజశేఖర మహాకవికి ఈ వృత్తమునందు మక్కువ యెక్కువ అని చెప్పెదరు. కాళిదాస మహాకవికి మందాక్రాంత మీద ప్రీతి యెక్కువ. భవభూతి మహాకవికి శిఖరిణి ప్రియమైనట్లుతోచును. భారవి మాఘ, శ్రీహర్షులకు వంశస్థవృత్తము నచ్చినట్లుతోచును.

ఇచ్చట లావణ్య శబ్దము కాంతి విశేషమును బోధించుచున్నది. ముత్యములో ముత్యముకంటె భిన్నముగ విచ్ఛాయ కానవచ్చుచున్నదో అటివిధముగ, తరుణి యొక్క అవయవములకంటె భిన్నముగ, విఛ్ఛాయ కన్పట్టుచున్నదో, అదే లావణ్యము అని భూపాలుడు నుడువు చున్నాడు.

"ముక్తాఫలేషు ఛాయాయా తరళత్వమివాంతరా
ప్రతిభాతి యదంగేషు తల్లావణ్యమిహోచ్యతే" భూపాలః.

నిర్మమే-నిర్మమే, అను నీ జంట కవి యొక్క ఘనతను చాటుచు

న్నది. ఇందొక పదము మమతలేనివాడను నర్థమునివ్వగా-రెండవ పదము క్రియాపదమై నిర్మించెను అనునర్థము నిచ్చుచున్నది ఇట్టి రెండు పదములను దఒక్కచోట కూర్చుట భోజభూపాలుని శబ్దచమత్కృతి లోని కృతిమత్త్వమును చాటుచున్నది.

అనుభవయోగ్యము కాని వస్తువును జూచి మనము అడవికి కాచిన వెన్నెలయుందుము-రాముని అపురూప సౌందర్యమును జూచి భూపాలు టిట్లు పలుకుట వాని సమయస్ఫూర్తికి సరియైన యుదాహరణము.

ప - సీతామాహర్తుకామా మసులభవిషయ ప్రార్థనోద్దామకామా
సౌమిత్రి శ్శస్త్రపాణి ర్ధశము = ఖఖగినీం తామనార్యాం నివార్యం
కామక్రోధాత్మకానా మహమహమికయా=ప్రేంఖతామాయతానాం
తస్యాశ్శ్వాసానిలానా మ= కురుత తరసా మార్గవిస్తారకృత్యమ్ 41

అ - సీతాం = సీతను, ఆహర్తుకామాం = బాధింప గోరినదియు అసులభవిషయప్రార్థనా = దుర్లభవిషయమును ప్రార్థించుట యందు, ఉద్దామ కామాం = గట్టి అభిలాష కలిగినదియును, అనార్యాం= దుష్టురాలైన, తాం = ఆ శూర్పణఖను సౌమిత్రిః=లక్ష్మణుడు, శస్త్రపాణిః= ఖడ్గపాణియై, నివార్య = అడ్డగించి, అహమహమికయా = నేనుముందంటె నేను ముందను గర్వముతో, ప్రేంఖతాం = ఒప్పుచున్నట్టియు, ఆయ తానాం = పొడవైన, మక్రోకాధాత్మకానాం = కామస్వరూపములు, క్రోధస్వరూపములునైన, తస్యాః = ఆ శూర్పణఖ యొక్క శ్వాసాని, లానాం = శ్వాసమారుతములకు తరసా = బలముగా, మార్గవిస్తార కృత్యం = త్రోవ యొక్క విస్తృతి కార్యమును, అకురుత = చేసెను

తా - రామలక్ష్మణులు తనకవమానమును చేసిరి అను కినుకతో ఆ రాక్షసి సీతయొక్క కంఠమును నొక్కుటకు ముందుకేగెను, దుర్లభ మగు శ్రీరామ సంభోగమును ఆమె కోరియుండెను. దుష్టరకృసియగు



శూర్పణఖను నివారించి కామక్రోధాత్మకము లగు నామె నిశ్వాస వాయువులకు త్రోవను పెద్దదిగా జేసెను. ఆమె ముక్కు చెవులు కోసెను.

వి — ఈశ్లోకములో స్రగ్ధరావృత్తము. దీని లక్షణమును చూడుడు, అహమధికో అహమధిక ఇత్యన్యోన్యం ప్రతి యోభిమానో అసావహమహమికా. "అహమహమహమికా తు సా స్యాత్ పరస్పరం యో భవత్యహంకారః" ఇత్యమరః, అహమితి విభక్తిప్రతిరూపక మవ్యయం. తస్య వీప్సాయాం ద్విరుక్తిః. "సంజ్ఞాయాం కన్" ఇతి కన్ ప్రత్యయః, పృషోదరాదిత్వాత్సాధురితి సుభూతిచంద్రః.

అహమహమిక యను నీపదము చాల విచిత్రమైనది. దీని ప్రయోగము విరళముగా కన్పట్టును. నేను గొప్పవాడనంటే నేను గొప్పవాడనని ఒకరికి మఱియొకరిమీద నుండు నభిమానమే అహమహమిక.

ముక్కు చెవులు కోసెనను విషయములో రామాయణమిట్లు చెప్పుచున్నది. "అని పలికి క్రుద్ధుడైన లక్ష్మణుడు, రాముడు చూచుచుండగనే కత్తితో ముక్కు చెవులు తెగగోసెను" తథాచ శ్రీరామాయణమ్—ఇత్యుక్త్వా లక్ష్మణస్తస్యాః, క్రుద్ధో రామస్య పశ్యతః ఉద్ధృత్య ఖడ్గం చిచ్ఛేద, కర్ణనాసం మహాబలః.

గ — తతస్తస్యా నికృత్తకర్ణనాసికాయాః కనీయస్యాః పరిభవం వదనే వచనే చ దృష్ట్వా శ్రుత్వా చ జనస్థానవర్తీ సమరముఖరః ఖరః, చతుర్దశసహస్ర సంఖ్యాక శాఖం చతుర్దశాధ్యక్ష రక్షితం రక్షోబలం రామలక్ష్మణౌ జిఘృక్షుః ప్రేషయామాస

అ — తతః = తరువాత, నికృత్తకర్ణనాసికాయాః = కోయబడిన ముక్కు చెవులు గలదియు, కనీయస్యాః = చివరి చెల్లెలగు శూర్పణఖ యొక్క, పరిభవం = తిరస్కారమును, వదనే = ముఖము

నందున్న, వచనే చ = మాటయందున్న, దృష్ట్వా = చూచి, శ్రుత్వా చ = వినియున్న, జనస్థానవర్తి = జనస్థానమునందున్న వాడును, సమరముఖ = రణరంగమునందు, ముఖరః = ప్రీతిగల వాడువగు, ఖరః = ఖరుడను రాక్షసుడు, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులనిద్దరి జిఘృక్షుః = పట్టుగొన గోరిన వాడై, చతుర్ధశసహస్రసంఖ్యాక శాఖం = పదునాలుగువేల సంఖ్యగల శాఖలు గలదియు, చతుర్దశాధ్యక్ష రక్షితం = పదునలుగురు అధిపతులచే రక్షింపబడినదియు, అగు రక్షోబలం = రాక్షససైన్యమును, ప్రేషయామాస = పంపెను.

తా – అటుపిమ్మట, దండకారణ్య మధ్యప్రదేశమగు జనస్థానములో రణరంగ శూరుడగు ఖరుడను రాక్షసాధిపతిని వసించుచుండెను. అతడు ముక్కు చెవులు తెగియున్న తన చిన్నచెల్లెలి యొక్క శిరస్సాకరమును ముఖమునందు చూచి, మాటలలో విని, పదునాలుగు సేనానాయకులచే రక్షింప బడుచున్న–పదునాలుగు వేలమంది రాక్షసులను పట్టుకొనుటకు పంపెను.

గ – అథ దాశరథి ర్నిరీక్ష్య రక్షోగణముపసర్పన్త ముపసర్ప్భూతయా శూర్పణఖయా దర్శితసరణి మరణిరివ మంథనాత్పూర్వ్వ మనావిష్కృతతేజః ప్రసరః సీతారక్షణే లక్ష్మణమాదిశ్య యాతుధాన వధం తథావిధముకరోత్.

అ – అథ = తరువాత, దాశరథిః = దశరథునందనుడగు శ్రీరాముడు అవసర్పభూతయా = చారస్థానీయురాలైన, శూర్పణఖయా = శూర్పణఖచే, దర్శితసరణిం = చూపింపబడిన మార్గము గలదియును, ఉపసర్పన్తం = తన సమీపమునకు వచ్చుచున్నది, అగు రక్షోగణం = రాక్షస సముదాయమును, నిరీక్ష్య = చూచి, మంథనాత్పూర్వం = మథించుట కంటె పూర్వము, అరణిరివ = అగ్నినిర్మంథనదారు

వువలె, అనావిష్కృత తేజః ప్రసరః = బయట పెట్టబడని తేజః ప్రసారముగలవాడై, సీతారక్షణే = సీతను కాపాడుటకయి, లక్ష్మణ మాదిశ్య = లక్ష్మణుని నియోగించి, తథావిధం = అటువంటియాతుధా నవధం = రాక్షస సంహారమును, అకరోత్ = చేసెను.

తా — పిమ్మట శ్రీరాముడు గూఢచారిణియగు శూర్పణఖ మార్గమును చూడగా, తనపైపునకు వచ్చుచున్న రక్కసి మూకను జూచి, మథించుటకు పూర్వము జ్వాలలు లేని అరణివలె నున్నవాడై, సీతారక్షణమునకు లక్ష్మణుని నియోగించి తాను రక్షో వధమునొ నరించెను.

గ — (యథా) తపోధననిధనకరంకరనికు రుంబమిదం, పరుషభాషణ స్పృహయాళు తాలుజాతమిదం, పరదార నిరీక్షణ నిరప త్రపంనేత్ర బృందమిదం, (తాపసావసథ చారణ చతురం చరణయుగళ మిదం) ఇతి నిశితతర నిజశరశకలిత నిశిచర శరీరావయవా నా హృత్యాహృత్య ప్రత్యటజం ప్రదర్శయద్భిః తపోధనాధ్వశుద్ధిం విదధ్వ మితి గృధ్రరాజ నిదేశాదివ దేశాన్తరాదావతద్భిః కంక కాక ప్రాచీక ప్రాయైః పతద్భి రనవకాశ మభూదాకాశమ్.

అ — ఇదం = ఇది, తపోధన నిధన కరం = మునులవధనుగావించి నట్టి రనికరం = హస్త సముదాయము, ఇదం = ఇదిపరుష-భాషణ-స్పృహయాళు = పరుషపు పలుకులను పలుకు నట్టి,తాలుజాతం = దవడల సముదాయము, ఇదిం ఇద, పరధార-నిరీక్షణ-నిలపత్రపం = పరుల భార్యలను పరికించుటలో సిగ్గులేని నేత్ర బృందం = కన్నులసము దాయము. (ఇదం = ఇది, తాప సావసథచారణ చతురం = మునుల యొక్క ఇండ్లయందు తిరుగుటలో నేర్పుగల చరణ యుగళం = పాదద్వంద్వము) ఇతి = అని, నిశితతర-నిజశర = మిక్కిలివాడి యైన తన బాణములతో, శకలిత = ముక్కలు చేయబడిన నిశిచర = రాక్షసుల యొక్క శరీరావయవాన్ = శరీరములోని అంగ ములను అహృత్యాహృత్య = బాగుగా ప్రోగుచేసి, ప్రత్యటజం = అన్ని పర్ణశాలలలోను ప్రదర్శయద్భిః = చూపించుచున్నవియు, తపోధ

నాధ్వ శుద్ధిం = మునులయొక్క మార్గపరి శుద్ధిని విధధ్వం = చేయుడు ఇతి = అని, గృధ్రరాజనిదేశాదివ = జటాయువు యొక్క అజ్ఞవలన వలె, దేశాంతరాత్ = ఇతర ప్రదేశముల నుండి, ఆపతద్భిః = వచ్చి పడుచున్న కంక = గద్దలు కాక = కాకులు ప్రాచీక = మఱియొకరకపు పక్షులు ప్రాయైః = తఱుచుగాగల పతద్భిః = పక్షులతో ఆకాశం = అంతరిక్షము, అనవకాశం = అవకాశములేనిది అభూత్ = ఆయెను.

తా — మునీశ్వరులను నరికిన చేతులివి, పరుసపు పలుకులు పలికిన దవడలివి, సిగ్గువిడిచి పరవనితల జూచిన కన్నులివి. మునీశ్వరుల వర్ణశాలలో తిరిగిన పాదములివి అని మిక్కిలి వాడియైన బాణములతో ముక్కలు జేయబడిన ప్రముక్కడి రక్కసుల అవయవములను అందఱకు వరుమారులు చూపించుచు, తపోధనుల మార్గపరి శుద్ధినిగావింపుడని గద్దల తేనియాజ్ఞ వలన వలె వేర్వేరు దేశముల నుండి వచ్చి పడుచున్న కంక కాక ప్రాచీక ప్రాయములగు పక్షులతో అకసమంతయు నావరింప బడెను.

వి — కంకము = గద్ద, కాకము = కాకి, ప్రాచీకము = ఒక పక్షి విశేషము. ఇది నిఘంటువులలో దొరుకుటలేదు. "ప్రాచికా-ఉలాక్ష పిపీలికాః" అని స్త్రీవాచక శబ్దముగా ఒక శబ్దముగలదు, మధుమక్షికలు ప్రాచికలని కొందఱు వ్యాఖ్యాతలు చెప్పుచున్నారు.

గ — తతో నికృత్త శిరసి త్రిశిరసి విస్రగంధినా శరీరస్రుత వసాస్రోతసా ప్రేత్యాపి క్రియమాణా శ్మదూషణే దూషణేచ రోష భీషణ వీక్షణఖరః ఖరః, రాఘవ మాహవాయాహ్వయత. 45

అ — తతః = రాక్షస బలమును చంపిన పిదప, త్రిశిరసి = త్రిశిరస్కుడు, నకృత్త శిరసి = (రామబాణముచే) ఖండింప బడిన తలకలవాడుకాగా, దూషణే = దూషణుడను సైన్యాధిపతి ప్రేత్యాపి = మరణించి తరువాత కూడ, విస్రగంధినా = కంపుకొట్టుచున్నదియు

శరీరస్రుత = దేహము నుండి కారుచున్న వసాస్రోతసా = మేదః ప్రవాహముతో, క్రియమాణ = చేయబడుచున్న, ఆశ్రమ దూషణేచ = తపోవన బీభత్సము కలవాడు కాగా రోష భీషణ వీక్షణ ఖరః = క్రోధా వేశముతో భీతిని కొలుపుచున్న చూపులతో చూడవీలు లేని ఖరః = ఖరుడను రాక్షసుడు రాఘవం = శ్రీరాముని ఆహవాయ = యుద్ధమునకు, ఆహ్వయత = పిలిచెను.

తా — శ్రీరాముడు త్రిశిరస్కుని మూడు తలలను తుంచివైచెను, రామబాణముతో మరణించిన దూషణుడు, మరణించి కూడ, కంపుకొట్టు చున్నదియు; తన తనువునుండి ప్రవహించుచున్నదియు అగు వసా ప్రవాహముతో ఆశ్రమమును దూషించుచుండెను, (చెడగొట్టుచుండెను) రోషభీషణ వీక్షణ ఖరుడును (తీవ్రమైనవాడును) రాక్షసశేఖరుడు నగు నాఖరుడు యుద్ధమునకు శ్రీరాముని నాహ్వానించెను.

వి — ఆహ్వయత = యుద్ధమునకు పిలిచెను. అజఃస్పర్ధాయం ఖరుడు రాముని యుద్ధమునకు పిలుచుటలో కారణము నిట్లూహించు చున్నారు.

ఈ శ్రీరాముడు సాక్షాత్తు విష్ణ్వవతారము. ఇతనిచే చంపబడిన వారలందఱు మోక్షమును పొందుటలో సందియము లేదు. ఇంత మంది రాక్షసులను చంపినాను. ఈ ఒక్కఖరుని విడిచి పెట్టినచో, వీడుచేయ గలిగిన దేమియని, రాముడు నన్ను చంపక వదలి పెట్టినచో, నాకు సిద్ధింపవలసిన మోక్షము సిద్ధింపదు. జూదమునకుగాని యుద్ధమునకు గాని, రమ్మని పిలిచినచో వెళ్లకుండుట క్షత్రియ ధర్మము కాదు. "ఆహూతో నవర్తేత ద్యూతాదపి రణాదపి" కావున నేను పిలిచినచో రాముడు యుద్ధమునకు తప్పక రాగలడు, అప్పుడు నాకు మోక్షము తప్పక సిద్ధించునని ఖరుని యభిప్రాయము.

గ - తత్ర విపశ్చిద్భిరపి అనిశ్చీయమాన జయాపజయం, అనిమిషైరపి అననుమీయమాన శరసంధాన మోక్షం, అభూదభూత పూర్వం ద్వంద్వయుద్ధమ్.

అ - తత్ర = ఆసమయము నందు, విపశ్చిద్భిరపి = సందేహ నిర్ణాయకులగు పండితుల చేతకూడ, అనిశ్చీయమాన = నిశ్చయింప బడని, జయాపజయం = గెలుపు-ఓటమి కలదియును, అనిమిషైరపి = ఱెప్పపాట్లు లేని దేవతల చేతకూడ. అననుసంధీయమాన = గుర్తింప బడని, శరసంధానమోక్షం = బాణములను కూర్చుట విడిచి పెట్టుట కలదియు, అభూతపూర్వం = ఇంతకు మున్నెన్నడును జరుగనది యునగు ద్వంద్వయుద్ధం = అసహాయశూరులగు ఖర రాములిద్దఱకు యుద్ధము, అభూత్ = జరిగెను.

తా - అసహాయశూరులగు ఖరునకు శ్రీరామునకు మధ్య మున్నెన్నడు కనివిని యెఱుగని యుద్ధము జరిగెను. సందిగ్ధార్థనిర్ణాయ కులగు పండితులు కూడ వారిజయాపజయములను నిర్ణయింపజాలరైరి జయాపజయములు దైవాధీనములుగదా ఱెప్పపాట్లు లేని దేవదతలుకూడ శరసంధాన మోక్షములను గుర్తింపజాలరైరి. ఱెప్పపాట్లుగల మానవులు గుర్తింపజాలరైరని వేఱె చెప్పనేల.

వి - మహాత్ముడగు శ్రీరాముని ధనుస్సును చేతితో పట్టుకొ మచోట తనహస్తలాఘవమును చూపించి ఖరుడు ఛేదించెనని శ్రీరామా యణములోనున్నది. తథాచ శ్రీరామాయణే

"తతోస్య సశరం చాపం ముష్టిదేశే మహాత్మనః
ఖరశ్చిచ్ఛేద రామస్య దర్శయన్ హస్తలాఘవమ్."

గ — తతః ఖరో గృహీత కోదండః, సకృదనుభూయమాన సమనోన్మనాయాసః, సమరసమాపన చతురం చతురాననాస్త్ర

సంధాన దశార్హం దాశార్హశరాసనం గ్రాహయితు కామ ఇవ రామ
హస్తాత్ ప్రాక్తనం చాపం శరైరప జహార. 47

గ — సోఽపి కోపపావకేన యావకితాననః
కుంభసంభవదత్తం ధనురాదత్త.

అ — తతః = ఆద్వంద్వయుద్ధానంతరము, గృహీతకోదండః = ధనుర్ధారియైన ఖరః = ఖరుడు, సకృత్ = ఒక్కసారి అనుభూయమాన = అనుభవింపబడిన సమరోన్మనోత్సాహః = వింటివారిని లాగే ప్రయత్నము గలవాడై, సమరసన్నాహవ చతుర్థం = యుద్ధమును పూర్తిచేయించుట యందు నేర్పరితనము గలదియు, తత్కాలనరాస్త్ర = బ్రహ్మాస్త్రమును సంధాన = సంధించుటయును దశార్హం = అనర్హము యోగ్యమైనదియు అగు, దాశార్హశరాసనం = వైష్ణవధనుస్సును, గ్రాహయితు కామ ఇవ = గ్రహింపజేయ గోరినవానివలె, రామహస్తాత్ = శ్రీరాముని చేతినుండి, ప్రాక్తనం చాపం = మునుపటి ధనుస్సును శరైః = బాణములతో, అపజహార = అపహరించెను.

సోఽపి = ఆ శ్రీరాముడును, కోపపావకేన = క్రోధాగ్నితో, యావకితాననః = ఎఱ్ఱబారినముఖము కలవాడై, కుంభసంభవదత్తం = అగస్త్యునిచే ఇవ్వబడిన ధనుః = ధనుస్సును, ఆదత్త = స్వీకరించెను,

తా — దేవదానవులను పులకింపజేసెడి ద్వంద్వయుద్ధము జరిగిన పిదప, ఖరుడు చండకోదండమును చేబూని యుద్ధపరిసమాప్తిని గోరి, అగస్త్యు డిచ్చిన వైష్ణవధనుస్సును, శ్రీరామునిచే గ్రహింపగోరినవానివలె, శ్రీరాముని చేతిలోని పాతవిల్లును, హస్తలాఘవమును ప్రదర్శించి తన తనబాణములతో నపహరించెను.

శ్రీరాముడును క్రోధాగ్నిచే ఎఱ్ఱబారినముఖము గలవాడై, అగస్త్యుడి

మునిచే నివ్వబడిన వైష్ణవచాపమును చేయానెను.

శ — ఖరపరుషి శరాసనే గృహీతే
ఖర కిరణాన్వయ శేఖరేణ తేన,
ఖరరఘువరయో రణం సమాప్తం
ఖరా నఖరాయుధయోరివ క్షణేన. 48.

అ — ఖర కిరణాన్వయ శేఖరేణ = సూర్యవంశవిభూషణుడగు, తేన = ఆ శ్రీరామునిచే, ఖరపరుషి = నిబిడమైన కణుపులు గల. శరాసనే = ధనుస్సు గృహీతే = స్వీకరింపబడగా, ఖరరఘువరయోః = ఖరాసుర-రఘురాములకు క్షణేన = ఒక్కక్షణములో ఖరనఖరాయుధయోరివ = రాసభసింహములకు వలె రణం = యుద్ధము, సమాప్తమభూత్ = పూర్తియయ్యెను.

తా — సూర్యకులశేఖరుడగు శ్రీరాముడు దుష్ప్రధర్షమైన, వైష్ణవధనుస్సును చేబూనినవెంటనే ఖరాసురసంహారము నొనరించెను. చూపరులకు ఖర-రఘువీరుల మధ్య జరిగిన యా పోరాటము రాసభసింహముల మధ్యజరిగిన పోరాటమును గుర్తుకుతెచ్చెను.

వి — ఈశ్లోకములో పుష్పితాగ్రయను నర్ధసమవృత్తము దీని లక్షణమును 4శ్లోకములో చూడుడు.

ఇచ్చట భోజభూజాని నాలుగు పాదములలో ఆది యందు ఖర శబ్దమునుంచి యమకాలంకారముతో శబ్దవైచిత్ర్యమును సాధించినాడు. శేఖరేణ అను శబ్దములో నఖరాయుధశబ్దములోను-ఖరశబ్దములు కనబడుట కవీశ్వరుని ప్రతిభను చాటుచున్నది.

ఖరరఘువీరులను రాసభసింహములతో పోల్చుట ఖరరఘువీరులకు గల యంతరమును స్ఫుటముగా తెలియజేయుచున్నది.

ఇంద్రదత్తమైన ధనుస్సుతో శ్రీరాముడు ఖరాసురుని తెల్లిరగా జయించి నాడను విషయములో శ్రీరామాయణమిట్లు చెప్పుచున్నది. మహాత్ముడగు శ్రీరాముడు దేవేంద్రుడిచ్చిన ధనుస్సు నందు శరంబును సంధించి ఖరుని మీదికి విడిచెను. వజ్రముచే వృత్రాసురుని వలెను, నురుగుతో నముచివలెను, ఇంద్రదత్తమైన ధనుస్సుతో ఖరుడు చంపబడి నేలగూలెను.

ఇంద్రశరేణ ఖరవధే శ్రీరామాయణ వచనమ్ –

"ధనుర్దత్తం మఘవతా సురజ్యేష్ఠేన ధీమతా
సందధేచ సధర్మాత్మా ముమోచ చ ఖరం ప్రతి.

సవృత్ర ఇవ వజ్రేణ ఫేనేన నముచిర్యథా
బలో వేంద్రాశనిహతో నిపపాత హతః ఖరః ఇతి.

చ — ఖరవధ పరిశుద్ధే దండకారణ్యభాగే
మునిభిరభిహితానామాశిషాం తాదృశీనామ్,
స్వయమచరమపాత్రం స్వైర్గుణైర్మంథరాభూత్
తదను మనుకులేందు స్సానుజ శ్శౌర్యరాశిః. 51

అ – దండకారణ్యభాగే = దండకావన ప్రదేశము, ఖరవధ పరిశుద్ధే = ఖరాసురవధతో పవిత్ర మైనదికాగా, మునిభిః = మునులచే. అభిహితానాం = పలుకబడిన, తాదృశీనాం = అటువంటి, ఆశిషాం = ఆశీస్సులకు స్వైర్గుణైః = తనగుణములచే, స్వయం = తనంతట తానుగా, మంథరా = మంథర(కైకేయీదాసి) అచరమపాత్రం = మొదటి చోటు అభూత్ = ఆయెను తదను = తరువాత, సానుజః = తమ్మునితో కూడిన వాడు, శౌర్యరాశిః= శౌర్యవంతుడు మనుకులేందుః = మనువంశచంద్రుడునగు శ్రీరాముడు, ఆశిషాం = మునుల యొక్క ఆశీస్సులకు పాత్రమభూత్ = యోగ్యుడాయెను, తథాహి = అది నిజమే కదా:

తా — ఖరాసుర సంహారానంతరము, బాధారహితమై పరిశుద్ధమైన యీ దండకారణ్యములోని మునులందరు పరమానంద భరితులైరి, అమోఘములైన ఆశీస్సులను కురిపించిరి. కైకేయి మనస్సును విరిచి శ్రీరాముని అరణ్యమునకు పంపి విరుద్ధాచరణము నొనరించినను, మంథరకు మునుల యాశీస్సులు ముమ్మందుగా ముట్టినవి. దైవానుకూల్యమున్ననాడు చెడుకూడ మంచిని కలిగింపకలదుగదా? శూరాగ్రేసరులు, మనుకులభూషణులునగు రామలక్ష్మణులకు మునుల యాశీస్సులు తవాత ముట్టినవి. కష్టమున్ననుభవించు వారొకరు, ఫలమునను భవించువారు మరియొకరుగదా!

వి — ఈశ్లోకములో మాలినీ వృత్తము. దీనిలక్షణమును వశ్లోకములో చూడుడు.

దండకావనాన్ని దానవరహితంగా చేసినందుకు మునులందరు శ్రీరాముని ఆశీర్వదించుటకు బదులు కైకేయిదాసి మంథరను ఆశీర్వదించారు. కైకేయికి దురాలోచన కలిగించి రామపట్టాభిషేకాన్ని మంథర పాడుచేసి యుండకపోతే, రాక్షస సంహారమే జరిగియుండెడిదికాదు. కనుక మునులు ముమ్మందుగా మంథర నాశీర్వదించుట సముచితము, సమంజసము. చేసిన తప్పు కూడ దైవానుకూల్యమున్నచో ఒప్పుగా మారును.

"దైవానుకూల్యే కిం నామన శివాయ ప్రవర్తతే"

అను న్యాయము సత్యేతరముగాదు. విరుద్ధాచరణము నొనరించిన మంథరయు మునీశ్వరుల యాశీస్సులకు పాత్రమాయెను. మంథర మూలముగానే పట్టాభిషేకవిఘటన జరిగినది. కనుకనే శ్రీరాముడు వనానికి వచ్చుట జరిగినది. వచ్చినందుననే రాక్షససంహారమొనరించినాడు, కనుక మనబాధలు గట్టెక్కినవని సంతసించినమునులు ముందుగా మంథరను, తరువాత శ్రీరాముని ఆశీర్వదించినారు.

శ — ప్రాఙ్మంథరేతి మహిషీతి వరద్వయీతి
ధర్మవ్యయ వ్యథిత భూపతి భారతీతి
కాకుత్స్థ కాననకథేతి చ సంతి సంజ్ఞాః
పౌలస్త్యహీన భువనత్రయ భాగ్యపఙ్క్తేః 51

అ — ప్రాక్ = ముందుగా, మంథరేతి = కైకేయిదాసియగు-మంథరయనియు, మహిషీతి = దశరథుని పట్టపురాణియగు కైకేయి అనియు, వరద్వయీతి = రామునకు వనవాసము, భరతునకు పట్టాభిషేకము అను రెండు వరములనియు, ధర్మవ్యయవ్యథిత = ధర్మచ్యుతి వలన బాధపడిన, భూపతి భారతీతి = దశరథ మహారాజుయొక్క రామ వనవాస ప్రేరకవాక్యమనియు, కాకుత్స్థకాననకథేతి = శ్రీరాముని వన-వాసవార్తయనియు, పౌలస్త్యహీన = రావణ రహితమైన, భువనత్రయ = ముల్లోకములయొక్క, భాగ్యపంక్తేః = నిరాబాధస్థితిహేతుభూతమైన భాగధేయశ్రేణికి, సంజ్ఞాః = నామధేయములు, సంతి = కలవు

రావణాసురుని సంహారానంతరము ముల్లోకములకు మహాదృష్టము కలిగినది. ఆ అదృష్టపంక్తి యిది - మంథర మొదటిది దశరథ మహారాజు పట్టమహిషియగు కైకేయి రెండవది. రాముడరణ్యమున కేగుట, భరతునకు పట్టాభిషేకము జేయుట అను నీరెండువరముల జంట మూడవది. ధర్మలోపమువలన భయపడు దశరథమహారాజుగారి శ్రీరాముని అరణ్యమునకు పంపు వాక్యము నాల్గవది. పితృవాక్య పరిపాలనకై శ్రీరాముడు కాననముల కేగుట ఐదవది.

వి — ఈ శ్లోకములో వసంతతిలకా వృత్తము. దీని లక్షణమును వ శ్లోకములో చూడుడు.

గ — అథ శూర్పణఖా లంకాపురమపి జనస్థానమివ విజనస్థానం కాకుత్స్థేన కారయితుం, దశకంఠోపకంఠే క్షిప్రత్యేవనిపత్య రామలక్ష్మణ

యోర్యాథాతథ్యం - వైదేహ్యాదేహసౌన్దర్యం, ఖరప్రముఖై స్సాకం, అనీకస్య చతుర్దశసహస్ర సంఖ్యాకస్య, పంచతాకరణ కారణభూతా మాత్మావజ్ఞాం చ విజ్ఞాపయామాస. 52

అ—అథ=ఖరప్రముఖ రాక్షస సంహారానంతరము, శూర్పణఖా=శూర్పణఖ, లంకాపురమపి = రావణరాజధానియగు లంకా పట్టణమును గూడ, జనస్థానమివ = జనస్థానమునువలె, విజనస్థానం = జనరహితమైన ప్రదేశమునుగా, కాకుత్స్థేన = శ్రీరాముని చే, కారయితుం = చేయించుటకు, దశకంఠోపకంఠే=రావణుని సమీపమునందు, కృత్యేవ= మారణాధి దేవతవలె, నిపత్య = నేలమీదపడి, రామలక్ష్మణయోః = రామలక్ష్మణులయొక్క యథార్థస్వరూపమును, వైదేహ్యాః = విదేహ రాజ పుత్రియగు సీతాదేవియొక్క, దేహసౌన్దర్యం = శరీరసౌందర్యమును, ఖరప్రముఖై స్సాకం = ఖరుడు మున్నగు వారితోకూడ, చతుర్దశ సంఖ్యాకస్య = పదునాలుగువేల మంది గల, అనీకస్య = సైన్యము, పంచతాకరణ = చంపుటకు, కారణభూతాం = కారణమైన, ఆత్మావజ్ఞాంచ = తనకు కలిగిన తిరస్కారమును, విజ్ఞాపయామాస = విన్నవించెను.

తా — ఖరప్రముఖ రాక్షససంహారానంతరము శూర్పణఖ, జనస్థానమువలె లంకాపట్టణమునుకూడ నిర్జనస్థానమును చేయింపగోరెను వెంటనేలంకాపురమును ప్రవేశించి దశాననుని ముందు మారణాధిదేవత వలె క్రిందపడెను. రామలక్ష్మణులయొక్క అసహాయశూరత్వమును, సీతాదేవియొక్క యద్భుతసౌందర్యమును వర్ణించెను. మఱియు రామ లక్ష్మణులు ఖరదూషణత్రిశిరస్కులను, పదునాలుగువేల రాక్షసులను, వారి యధిపతులను సంహరించుటను నొక్కి వక్కాణించెను. ఆ యన్న దమ్ములు తన ముక్కు చెవులు కోసిన వైనమునుకూడ వివరించెను.

వి — శూర్పణఖ అన్నయగు రావణునకు రామలక్ష్మణుల యథార్థస్వరూపమును, చెప్పుటలో శ్రీరామాయణవచన మిట్లున్నది. ఆజానుబాహువు, అరవిందదళాయతాక్షుడు, నారచీరను కృష్ణాజినమును ధరించినవాడు, కందర్ప సుందరాకారుడున్ను దశరథ మహారాజు కుమారుడగు శ్రీరాముడు.

తథాచ శ్రీరామాయణవచనమ్—

దీర్ఘబాహుర్విశాలాక్షశ్చీరకృష్ణాజినాంబరః
కందర్పసమరూపశ్చ రామో దశ రథాత్మజః

సీతాదేవియొక్క దేహసౌందర్యమిట్లు వర్ణింపబడినది. అన్యూనానతి రిక్త అవయవ సన్నివేశము గలదియై, జగన్మోహన దివ్యమంగళ విగ్రహరామణీయకముతో నొప్పారుచున్నది. యథోచితమగు నంగ ప్రత్యంగ సన్నివేశము గలిగి సంశ్లిష్ట సంధిబంధము కలిగియున్నచో నది సౌందర్యము.

అఙ్గ ప్రత్యంగకానాం యస్సన్నివేశో యథోచితమ్
సంశ్లిష్ట సంధిబంధం యత్, తత్సౌందర్య మిహోచ్యతే

ప — స దండకాయాం కృతదండకాయాం
స్వసారమేనాం ప్రథిత స్వసారః
నిశామ్య, రామస్యనిశమ్య వృత్తం
చక్రేకృషం రాక్షస చక్రవర్తి.

అ. — ప్రథితస్వసారః = ముల్లోకములయందు ప్రఖ్యాతమైన రాన భుజబలముగల, సః రాక్షసచక్రవర్తి = రాక్షససార్వభౌముడగు రావణుడు, దండకాయాం = దండకారణ్యమునందు, కృత-దండ-కాయాం = కృత = లక్ష్మణునిచే చేయబడిన, దండ = కర్ణనాశాసిచ్ఛేదరూపమైన

శిక్షగల, కాయాం = దేహముగలదియగు, ఏనాం = ఈ, స్వసారం = చెల్లెలగు శూర్పణఖను, నిశామ్య = చూచి, రామస్య = రామునియొక్క వృత్తం = ఉపాఖ్యానమును, నిశమ్య = విని, రుషంచక్రే = కోపించెను

తా — ముల్లోకములలో ప్రసిద్ధికెక్కిన బాహుబలముతో నిండిన రావణుడను రాక్షసచక్రవర్తి, దండకావనములో ముక్కుచెవులు కోయబడిన తన చెల్లెలిని జూచెను ఆమెచే చెప్పబడిన శ్రీరామోదంతమును వినెను. మదీయంబగు నవక్రవిక్రమంబెఱుగని వనేచరుడగు రాముడెంత పనిజేసెనని నిశాచరచక్రవర్తి మిక్కిలి కోపగించెను.

వి — ఈ శ్లోకములో ఉపజాతి వృత్తము, దీని లక్షణమును వ శ్లోకములో చూడుడు.

దండకాయాం — దండకాయాం, స్వసారం — స్వసారః నిశమ్య - నిశామ్య, చక్రే - చక్ర, అను నాలుగుజంటలు భోజభూపాలుని శబ్ద - చమత్కార - వైచిత్రిని ప్రకటించుచున్నవి. దండకాయాం అను పదము దండకారణ్యమునందు అను నర్థము నిచ్చుచున్నది. కృత - దండ - కాయాం అను మూడుపదముల కలయిక యీ పదమును తయారుచేసినది. మొదటి పదమువలె భాసించుచున్నది. "నిశామ్య" అను పదమునకు "చూచి" అని యర్థము. "నిశమ్య" అను పదమునకు "విని" యని అర్థము. నిశామ్య అను పదము దైవాదికమగు.

ధాతువుకంటె నిష్పన్నమైన ల్యబంతము. "శమోఽదర్శనే అను సూత్రముచే " చూచుట " అనునర్థములో మిత్త్వము లేకపోవుట వలన హ్రస్వాదేశమురాదు. చక్రే = చేసెను అని అర్థము. చక్ర = చక్రము అని అర్థము. ఇది చక్రవర్తిపదములోని మొదటిభాగము. రాజుగారు నూతనపదములను సృష్టించుటలో సిద్ధహస్తులు. సరస్వతి వశ

వర్తినియై యుండెనని చెప్పక తప్పదు. వీరు సరస్వతీ అరావపరా రమ్మని పెద్దలు చెప్పెదరు.

గ—తతః ప్రస్థాప్య జనస్థానే రాక్షసా నష్ట నష్టనీతిరయం తాట కేయ హాటకమృగం పురస్కృత్య సీతాహ్వయాం హరిణీం గ్రహీతుం తస్యావసథ మాససాద. 54

మారీచోఽ ప్యాకర్ణిత రావణమతః ప్రయత్నశతైరపి అనివార్య మాణే తస్మిన్ సుబాహుమేవ బహుమన్యమానో గత్వంతరాభావాత్త దభ్యర్థనా మఙ్గీకృత్య జాతరూపమయ మగ్రరూపం గృహీత్వా సీతాం వంచయితుం పంచవటీ మగాహత 55

దశముఖోఽ పి కజలధరపథ స్థాపితరథః దాశరథిఘుటిటనే కృతాస్థ స్థ్సా. 56

అ — తతః = కోపించిన పిమ్మట, జనస్థానే = జన స్థానమునకు, అష్టరాక్షసాన్ = ఎనిమిది మంది రాక్షసులను ప్రస్థాప = బయులు దేరదీసి నష్టనీతిః = నీతి రహితుడైన, అయం = ఈరావణుడు తాటకేయ హాటక మృగం = తాటక యొక్క కుమారుడైన మారీచుడనే, బంగారులేడిని, పురస్కృత్య = ముందుంచుకొని, సీతాహ్వయాం = సీత యను పేరుగల హరిణీం = ఆడలేడిని (లక్ష్మిని) గ్రహీతుం = పట్టు కొనుటకు తస్య = ఆ మారీచుని యొక్క అవసథం = ఇంటిని గూర్చి ఆససాద = ప్రవేశించెను.

మారీచోపి = మారీచుడును, ఆకర్ణితరావణమతః = వినబడిన రావణుని యొక్క అభిప్రాయము గలవాడై తస్మిన్ = ఆ రావణుడు ప్రయత్నశతైరపి = చాల ప్రయత్నములచేతకూడ, అనివార్యమాణే = నివారింపబడని వాడు కాగా, సుబాహుమేవ = విశ్వామిత్రునియాగములో రాముని చేతిలో చనిపోయిన తన సోదరుడగు సుబాహువునే, బహు

మన్యమానః = శ్లాఘించుచున్నవాడై, గత్యంతరాభావాత్ = తనను విడిపించుకొనుటకు - ఉపాయాంతరమును గానక తదభ్యర్థనాం = రావణుని యొక్క కోరికను, అంగీకృత్య = అంగీకరించి (ఒప్పుకొని) జాతరూపమయ-మృగరూపం = బంగారు లేడి రూపమును, గృహీత్వా = స్వీకరించి, సీతాం = సీతను, వంచయితుం = మోసగించుటకు పంచవటీం = పంచవటీ క్షేత్రములో అగాహత = ప్రవేశించెను.

దశముఖోఽపి = రావణుడును, జలధర పథ = ఆకాశమునందు స్థాపిత = ఉంచబడిన, రథః = రథము కలవాడై, దాశరథి = రామలక్ష్మణులను, విఘటనే = వేరు చేయుటలో కృతాస్థః = ఆదరము గలవాడై, తస్థౌ = ఉండెను.

తా- కోపించిన తరువాత, ఎనిమిది మంది రాక్షసులను ఖరాలయమును కాపాడుటకై పంపెను. వక్రమార్గ వర్తియగు నీ రావణుడు సీతయను నాడలేడిని పట్టుకొనుటకు మారీచుని బంగారు లేడినిగా జేసి మున్ముందుగా పంపగోరి, జిత్తులమారి మారీచుని యింటికి స్వయముగా నేగెను! లోకములో వేటగాండ్రు ఒక జంతువులు పట్టుకొనుటకు మఱియొక్క జంతువును పంపుట పరిపాటియై యున్నదిగదా?

మారీచుడు రావణుని యభిప్రాయమును చెవులార వినెను. కాని మనసార అంగీకరించుటకు మనసొప్పలేదు. వానినా యకార్యమునుండి తప్పించుటకు పెక్కు ప్రయత్నములొనరించెను. అవియన్నియు బూడిదలో పోసినపన్నీరయ్యెను, విశ్వామిత్ర సత్రములో రామునిచేతిలో మరణించిన తనయన్ననే తనకన్నమిన్నగానెంచెను. తప్పుడు పని చేయవలసివచ్చినందుకు తనడెందమున నానందము గోల్పోయి పెక్కుగా వగచెను. రావణుని మనంబును మార్చుటకుగానీ, ఈ యకార్యము నుండి ఆత్మవిమోచనమును గావించుకొనుటకు గానీ అపాయములేని యుపాయములు గానక, వేరక, ఎట్టకేలకు చిట్టచివరకు రావణుని కోరిక

సంగీకరించెను మచ్చర. మెఱుగని మచ్చలుగల ముచ్చట గొలుపు బంగారు లేడిగా మారి జిత్తులమారి మారీచుడు సీతను వంచింపగోరి బంగారు లేడిగా పంచవటిలో ప్రవేశించెను.

అంతట దశవదనుడు తనయురదమును నింగిన నిలిపి దశరథ నందనులగు రామలక్ష్మణులను విడదీయుటకు వేచియుండెను.

శ- విపినమవజగాహే రాక్షసానాం కరోటీః
అసకృదసకృదావిర్బాష్పమాలోక్యశోచన్,
కృతరుచిరివ వర్త్మన్యంకుశానాం కుశానాం
పథికచరణలావిన్యంకురే న్యంకురేషః. 57

అ- అథ = అటు పిమ్మట ఏషన్యంకుః = బంగారు లేడిరూపములో నున్న మారీచుడు రాక్షసానాం = ఖరుడుమున్నగా గల రాక్షసుల యొక్క కరోటీః = పుఱ్ఱెలను అసకృదసకృత్ = పలుమారులు, ఆవిర్బాష్పం = కన్నీరు కాఱునట్లుగా, ఆలోక్య = చూచి, శోచన్=దుఃఖించుచు వర్త్మని = వనమార్గమునందు, అంకుశానాం = అంకుశీతుల్యములైన కుశానాం = దర్భలయొక్క, పథికచరణలావిని = బాటసారుల యొక్క పాదములను చీల్చునట్టి, అంకురే = అంకురములయందు (మొలకలయందు) కృతరుచిరివ = అభిలాష కలవాడు వలె, విపినం = అటవిలో, అవజగాహే = ప్రవేశించెను.

తా - అంతలో బంగారులేడిగా మారిన మారీచుడు త్రోవలో కనబడిన రాక్షసుల పుఱ్ఱెలను జూచి కన్నుల నీరుకార్చుచు శోకించుచుండెను. బాటసారుల పాదములలో గ్రుచ్చుకొనుచున్న వాడియైన దర్భాంకురములను మేయుచు వెనుకకు తిరిగి చూచుచు, మెల్ల మెల్లగా నడుచుచుండెను.

వి - ఈ శ్లోకములో మాలినీ వృత్తము. దీని లక్షణమును వశ్లోకములో

చూడుడు.

కుశానాం-కుశానాం, న్యంకురే-న్యంకురే అను యమకము రసికుల మనస్సును రంజింపచేయుచున్నది.

ప - తదను జనకపుత్రీయాచ్ఞయా తం జిఘృక్షు
ర్హరిణ మపజగాహే చాపమాదాయ రామః
సమయ ఇతిచ భేజే వక్త్రిమాతత్య మృత్యుః
కుశిక సుతమఖాజ్జాత్ర్భష్టమేనం జిఘాంసుః

అ - తదను = ఆ బంగారు లేడి ప్రవేశించిన తరువాత జనక పుత్రీ = సీతాదేవి యొక్క యాచ్ఞయా = కోరికతో తం = ఆ బంగారు లేడిని జిఘృక్షుః = పట్టుకొనగోరినవాడై, చాపమాదాయ = ధనుస్సును తీసికొని, హరిణకం = లేడిని, అపజగాహే = వెంబడించెను. మృత్యుః = యముడున్ను సమయః = ఇదియే మ్రింగుటకు తగినకాలము ఇతి = అనితలచి వక్త్రీ మాతత్య = నోరుతెఱచుకొని, కుశికసుత మఖాజా = విశ్వామిత్రుని యాగములోని యుద్ధముతో, భ్రష్టం = తప్పించుకొనిపోయిన ఏనం = ఈ మారీచుని, జిఘాంసుః = చంపగోరినవాడై, భేజే = మారీచుని దగ్గఱకు వచ్చెను.

తా - ముచ్చట గొలుపు మచ్చలుగల కనకపు కులుకు లేడి తనకు కావలెనని తెచ్చి పెట్టుడని అమచ్చెకంటితన ప్రియుని పరి పరివిధముల యాచించెను. వెంటనే జానకి యందలి ప్రేముడితో జాగుసేయక చాపముచేబూని లేడి వెంటపడెను.అదే సరియైన సమయమున్ని యెంచిన మృత్యువు కూడ నోరుతెఱచుకొని విశ్వామిత్రాధ్వరములో తప్పించు కొని పోయిన నీచమారీచుని మ్రింగగోరి వాని వెంటపడెను.

వి. - ఈశ్లోకములో మాలినీ వృత్తము. దీని లక్షణమును ప శ్లోకము లో చూడుడు.

వ — ఆకృష్య దూరముటజాదథ దర్శితాశః
క్రవ్యా శవిషణరఘునాథశరేణ విద్ధః
కార్తస్వరైణ తనుతాం విజహౌ హతోస్మి
త్యార్తస్వరేణ సహ రామవచోనిభేన. 69

అ — అథ = తరువాత విష క్రవ్యాశః = కనక మృగరూపములో నున్న మారీచుడను రాక్షసుడు, ఉటజాత్ = పర్ణశాలనుండి దూరమా కృష్య = దూరముగా తీసికొనిపోయి, దర్శితాశః = చూపింపబడిన గ్రహణకాంక్ష గలవాడై, రఘునాథశరేణ = శ్రీరాముని బాణముతో విద్ధః = కొట్టబడినవాడై హతోఽస్మి = చంపబడితిని ఇతి = అని, రామవచోనిభేన = శ్రీరాముని మాటతో సమానమైన, ఆర్తస్వరేణసహ = హా సీత, హా లక్ష్మణ అను దీనాక్రందనముతో కూడ కార్తస్వర = బంగారపు ఏణతనుతాం = లేడిరూపమును, విజహౌ = విడిచి పెట్టెను.

తా — ఆ మాయలేడి ఇదిగో దొరికినదిఇదిగో దొరికినదిఅనునాశను పుట్టించుచు శ్రీరాముని పర్ణశాలనుండి చాల దూరము తీసికొనిపోయెను. కుపితుడై రఘునాయకుడు తనసాయకముతో ఆమృగమును గట్టిగా కొట్టెను వెంటనే మాయలేడి లేడిరూపమునువీడి "హా హతోస్మి హా హతోస్మి హా మైథిలి హా లక్ష్మణ" అని రాముని కంఠస్వరముతో బిగ్గరగా అరచుచు రాక్షసరూపముతో నేలగూలెను.

వి — ఈ శ్లోకములో వసంతతిలకావృత్తము. దీని లక్షణమును వశ్లోకములో చూడుడు. కార్తస్వరైణ-ఆర్తస్వరేణ అనునీ పదద్వయ సృష్టి రాజుగారి ప్రతిభను వెల్లడించుచున్నది.

శ్రీరామునివలె హాహతోస్మి-మైథిలి లక్ష్మణ అని కేకలు వేయుచ రామబాణహతుడిడై మారీచుడు మరణించె ననుటలో శ్రీరామాయణ మిట్లు పలుకుచున్నది. చనిపోవుచున్న మారీచుడా కపటశరీరమును విడిచి

పెట్టెను. ఆ మాటను విని సీత లక్ష్మణుని అరణ్యమునకు పంపును. రావణుడు సీతను హరించుటకవకాశము కుదురును. ఇదియే సరియైనసమయమని హా హతోఽస్మి మైథిలి లక్ష్మణ! అని రాముని కంఠస్వరముతో పలికెను. మాయలేడి రూపమును వీడి, రాక్షసరూపమును ధరించి మారీచుడు జీవితమును విడిచిపెట్టెను.

తథా చ శ్రీరామాయణమ్—

"మ్రియమాణస్తు మారీచో జహౌ తాం కృత్రిమాం తనుమ్
కృత్వా తద్వచనం రక్షోఽధ్యాయేనతు లక్ష్మణమ్,
ఇహ ప్రస్థాపయేత్సీతా శూన్యేతాం రావణో హరేత్.
సంప్రాప్తకాలమాజ్ఞాయ చకార చ తతస్స్వరమ్.
సదృశం రాఘవస్యైవ హా సీతే లక్ష్మణేతి చ. మృగరూపం తు తత్త్యక్త్వా రాక్షసం
రూపమాత్మనః చక్రే స సుమహా [illegible]

గ – ఏతదాకర్ణ్య విదీర్ణ హృదయా [illegible] కర్తవ్యా కర్తవ్యమజానానా జానకీ [illegible] 60

తతశ్చార్యే న [illegible] పరం పరిభవతి భవతీమ్. 61

త్రిభువనసైకధనుర్ధరస్య శౌర్యరాశేరార్యస్య కశ్చిద్ధధీత కోణప ఘుణనిమిత్తాం విపత్తిమితి ప్రణిపత్య ప్రత్యాచక్షాణం (లక్ష్మణం) హృదయతోదకారిణ్యా వాణ్యా మోహవిహ్వలా సా బహ్వతర్జయత్. 62

భూయోఽపి లక్ష్మణః ప్రజావతీం పరుషభాషిణీ మేవమభాషత 63

అ – ఏతదాకర్ణ్య = హా మైథిలి హా లక్ష్మణ అను ఆర్తవాదమును విని, హృదయదయితే = ప్రాణనాథుని యందలి, ప్రేమ్ణా = ప్రేమతో విదీర్ణహృదయా = బ్రద్దలైన గుండె కలదియై కర్తవ్యాకర్తవ్యం = చేయదగినది యేదియో చేయదగనిది యేదియో అజానానా = తెలియనిదియై, జానకీ = సీత. భ్రాతరం = మీ అన్నను గూర్చి, జానీహి =

తెలిసికొనుము, ఇతి = అని, సౌమిత్రిం = లక్ష్మణుని ఆదిదేశ = ఆజ్ఞాపించెను.

తతశ్చ = తరువాత, ఆర్యే = ఓ పూజ్యురాలా! ఇదం ఆదిష్టం = నీచే చెప్పబడిన పని నకార్యం = చేయుదగినది కాదు. దిష్టదోషాత్ = కాలస్వభావము వలన(దైవప్రాతికూల్యము వలన) మిథ్యాప్రతీతిః = విపర్యయజ్ఞానము, భవతీం = నిన్ను, పరం = అధికముగా, బాధతే పరిభవతి = తిరస్కరించుచున్నది.

త్రిభువనైకధనుర్ధరస్య = ముల్లోకములలో ఏకధనుర్ధరుడును, శౌర్యరాశేః = మహాశౌర్య సంపన్నుడును, ఆర్యస్య = పూజ్యుడునుఅగు శ్రీరామునకు కోణప–ఘుణ–నిమిత్తాం = రాక్షసుడను- కీటవిశేషము వలన కలిగిన విపత్తిం = ప్రాణసంకటమును. కః = ఎవడు, శ్రద్దధీత = నమ్మును? ఇతి = అని పత్రిపత్య = నమస్కరించి, ప్రత్యాచక్షాణం = తిరస్కరించుచున్న లక్ష్మణం = లక్ష్మణుని, హృదయతోదకారిణ్యా = మనోవ్యథను కలిగించుచున్న, వాణ్యా = వాక్కుతో మోహవిహ్వలాసా = అజ్ఞానముతో ఒడలు తెలియని ఆ సీత, బహు = హెచ్చుగా, అతర్జయత్ = నిందించెను,

భూయోఽపి = తిరిగి, లక్ష్మణః = లక్ష్మణుడు పరుషభాషిణీం = కర్ణకఠోరముగా మాట్లాడుచున్న ప్రజావతీం = వదినగార్ని గూర్చి, ఏవం = చెప్పబోవు ప్రకారముగా అభాషత = పలికెను.

తా. – "హా హతోస్మి–మైథిలి, లక్ష్మణ!" అను శ్రీరాముని కంఠస్వరమును విన్నసీత,ఏమియు తోచక,లక్ష్మణా! మీయన్న ఏమయ్యెనో కనుగొనుమని దానిని యాజ్ఞాపించెను.

అటు పిమ్మట, లక్ష్మణుడు ఓ పూజ్యురాలా! మీయన్న ఏమయ్యెనో కనుగొనుమన్న నీయాజ్ఞ సరియైనది కాదు, దుర్దైవ వశమున విపరీత జ్ఞానము నిన్ను బాధించుచున్నది.

సకలలోకైకధనుర్ధరుడును ఉదార్య వీర్యసంపన్నుడుమఅయిన శ్రీరామునకు రాక్షసకీటకము వలన ముప్పు వాటిల్ల గలదని ఎవ్వరును నమ్మజాలరు, అని పాదాభివందనము చేసెను. వెళ్లుటకు వెనకాడుచున్న లక్ష్మణుని జూచి ఓరీ దయావిహీనుడా? ఘాతుకుడా? మర్యాదావభిజ్ఞుడా రాముని చావు నీకు సంతసమును సంతరించుచున్నది. కానీ, నేను శ్రీరాముని తప్ప మఱియొక పురుషుని కాలితో కూడ తాకనని, ప్రియుని

విపత్తితో ఏమియు తోచనిదియై సీత, మనోవ్యధను కలిగించు ములుకులవంటి పలుకులు పలికి పెక్కు భంగుల నిందించెను.

వి – సీత రాముని యార్తస్వనము విని, అన్నకు సహాయ మొనరించుటకై, లక్ష్మణుని అరణ్యమునకు పంపెను. ఈ విషయములో వాల్మీకి గారి వచనములివి. రాముని ఆర్తస్వరముతో సమానమైన ఆర్త స్వరమును విని, సీత మీ అన్నగారి విషయమును తెలిసికొని రమ్మని లక్ష్మణుని పంపెను తథా చభగవాన్ వాల్మీకిః–

ఆర్తస్వరం తు తం భర్తు రాజ్ఞాయ సదృశం వనే
ఉవాచ వచనం సీతా గచ్ఛ జానీహి రాఘవమ్

రాక్షసులను కీటవిశేషముల వలన కలిగిన విపత్తి రామునియేమియు చేయలేదు, అనిత్రోసివేసిన లక్ష్మణుని సీత–ఝుడిపించెను,

"పన్నగులు,అసురులు, దేవతలు దానవులు గంధర్వులు మున్నగు వారు నీ భర్తనుగొలువజాలరు, ఏమియుచేయజాలరు. అని లక్ష్మణునిచే రామాయణములో చెప్పబడినది. తదుక్తాం రామాయణే

పన్నగా సురగంధర్వ దేవదాన వరాక్షసాః
అశక్య స్తవ వైదేహి భర్తా జేతుం న సంశయః

ఇతి సీత, లక్ష్మణుని హృదయమునకు బాధను కలిగించు మాట

లిట్లనెను- "ఓ అనార్యుడా? దయావిహీనుడా? ఘాతుకుడా? వంశనాశకుడా? రాముని మరణము నీకు ప్రియమైనదిగా తోచుచున్నది అని ప్రారంభించి నేను రాముని తప్ప మఱియొక పురుషుని ఎడమకాలితో నైనా తాకనని తన మాటలను పూర్తి చేసినట్లు రామాయణములో నున్నది. తదుక్తం రామాయణే-

అనార్య కరుణారంభ నృశంసకులపాంసన?
అహం తవ ప్రియం మన్యే రామస్య వ్యసనం మహత్ ఇత్యారభ్య
న త్వహం రాఘవాదన్యం పదాపి పురుషం స్పృశే. ఇతి

వ — సుముఖి మమ సుమిత్రా సత్యమంబాయదాసీః
తదభజమవితర్కం మాతృసంపర్కసౌఖ్యమ్.
సపది విధివిపాకాత్ వ్యాహరంతీ దురుక్తిం
త్వమసి విపినమధ్యే మధ్యమాంబాపి జాతా. 84

అ - సుముఖి! = ఓ మధురభాషిణీ! సత్యం = నిజముగా సుమిత్రా అంబా = మా తల్లియగు సుమిత్రవు, జాతా = అయితివి, తత్ = అప్పుడు, అవితర్కం = నిస్సంశయముగ మాతృసంపర్కసౌఖ్యం = తల్లిదగ్గఱనున్నప్పుడు ఏ సౌఖ్యము కలదో ఆ సౌఖ్యమును అభజం = పొందితిని.

సపది = ఇప్పుడు, విధివిపాకాత్ = దుర్దైవము వల విపినమధ్యే = అడవిలో, త్వం = నీవు దురుక్తిం = కర్ణకఠోరములగు మాటలను, వ్యాహరన్తీ = పలుకుచున్న దానివై మధ్యమాంబాపి = కైకేయివి కూడ జాతా = అయితివి

తా - కఠినముగా పలుకుచున్న వదిన గారిని జూచి తిరిగి లక్ష్మణు డిట్లు చెప్పదొడగెను.

మధురభాషిణీ? మంచి పలుకులు పలికి నీవునన్ను బుజ్జగించితివి.

అనాడు నేను నిన్ను మా తల్లియగు సుమిత్రాదేవిగా భావన చే
భయ్యరణ్యమధ్యములో దువర్దైవ శమున పలుకరాని కర్ణ కఠో
నములు పలుకుటంజేసి నదిమితల్లియగు కైకేయి వికూత న
ఎటుచూచినను నీవు నాకు తల్లివేనేను నీకుకొడుకునే. నీవి
నాయందునీకు మఱియొక తలంపు సముచితముగాదు.

గ - ఇత్యుక్త్వా భ్రాతృసమీప గామిని లక్ష్మణే, తత్షణమేవ ర
న్వేషీ దశకంధరస్స్యందనం పహాయ విహాయః స్థలాదవతీర్య నిజ
కరణే వ్యమాంతం రాగం బహిః ప్రకటయన్నివ (ధృతకషాయ
కపట సన్న్యాసివేషః పర్ణశాలాభ్యర్ణ మాససాద. 65

అ - ఇత్యుక్త్వా = అని పలికి లక్ష్మణే = లక్ష్మణుడు భ్రాతృ
గామిని సతి = అన్నగారి దగ్గఱకువెళ్ళినవాడు కాగా, తత్షణమే
వెంటనే, రంధ్రాన్వేషీ = సీతాపహరణమునకు-అవకాశము ను
చున్న, దశకంధరః = రావణుడు స్యందనం = రథమును, విహా
విడిచిపెట్టి, విహాయస్థలా దవతీర్య = ఆకసము నుండి దిగి
నిజాంతఃకరణేఽపి = తన మనస్సు నందుకూడ అమాంతం -
నటువంటి, రాగం = అనురాగమును (ఎఱ్ఱదనమును) బహిః
యన్నివ = బయటకు ప్రకటించుచున్న వానివలె, ధృతకాషాయః
ధరింపబడిన ఎఱ్ఱని వస్త్రముగల వాడై, కపట సన్న్యాసి వేషః =
సన్న్యాసి వేషమును ధరించిన వాడై పర్ణశాలాభ్యర్ణం = ప
యొక్క సమీపమునకు, ఆససాద = చేరెను.

తా — ఇట్లు పలికి, తనయన్నగారిని వెదకికొనుచు
పోయెను. వెంటనే అదనుకొఱకై వేచియున్న రావణుడు, అరద
నింగి మీదనిలిపి నింగి నుండి నేలమీదికి దిగివచ్చి లోపలనున్న
యనురాగమును బయటకూడ ప్రకాశింపజేయ గోరినవానివలె, (
యాంబరంబును ధరించి,) మాయాభిక్షు వేషధారియై, సీత నివ

పర్ణశాల చెంతకు చేరెను.

వ — రామాశ్రమాద్విగత లక్ష్మణ సన్నిధానా.
సీతాం జహార చపలః పిశితాశనేంద్రః
మాలాం నవోత్పలమయీం పలలభ్రమేణ
దేవాలయాదివ నిరస్తజనా దలర్కః. ౬౬

అ — పిశితాశనేంద్రః = రాక్షస చక్రవర్తియగు రావణుడు విగత లక్ష్మణ సన్నిధానాత్ = లక్ష్మణుని సాన్నిధ్యము లేనట్టి, రామాశ్రమాత్ = రాముని పర్ణశాల నుండి సీతాం = సీతను. చపలః = చలచిత్తము గల అలర్కః = పిచ్చికుక్క నిరస్త జనాత్ = జనవిహీనమైన దేవాలయాత్ = గుడి నుండి, పలలభ్రమేణ = మాంసమను భ్రాంతితో, నవోత్పలమయీం = క్రొత్త కలువ పువ్వులతో తయారు చేయబడిన, మాలామివ = పూలదండను వలె, జహార = అపహరించెను.

తా — నిర్జనమైన దేవాలయమునుండి పిచ్చికుక్క మాంసమను భ్రాంతితో, కలువ పూల దండ నపహరించిన భంగి, చపలచిత్తుడగు-రాక్షస చక్రవర్తి రామాలయము నుండి సీతనపహరించెను.

వి — శ్రీరామాయణవ్యాఖ్యాత లిచ్చట నొక విశేషమును వెలిబుచ్చుచున్నారు. రాముడు లేడిని చంపుటకు వెళ్లినప్పుడు, లక్ష్మీరూపిణియగు సీత రామునిలోనే అంతర్ధానమును జెందెను, అప్పుడు తమ యుపయోగార్థమై రాముని యనుమతితో దేవతలచేనిర్మింపబడినమాయా సీతను మాత్రము రావణుడపహరించెను, రామునకు సీతావియోగము క్షణమాత్రమైనను సహింపరానిది, ఏ అంశములోను సీత రాముని ఒక్క క్షణముకూడ విడిచి యుండదు, అనునర్థమునిచ్చు

“విష్ణోరేషానపాయినీ” అను విష్ణుపురాణ వచన మిచ్చట ప్రమాణము.

ఒక్క క్షణముకూడ సీత రాముని విడిచి పెట్టి యుండదన్నచో, సీత, పెండ్లి యగుటకు పూర్వము జనకుని గృహములో నెట్లున్నది? అను ప్రశ్న యుదయించవచ్చును. తనయందే ఉన్న సీతను లోకవ్యవహారానుసారముగ జనకుని యింటిలో నావిర్భవించుట-వివాహము జరుపుటమున్నగునవి జరుపబడినవి అని చెప్పినచో ప్రశ్నకు సమాధానము కుదురును. రాముడు సీతకొఱకై వెదకుట విలపించుట అనుకరణ మాత్రము. స్త్రీ సంగము గలవారికిట్టి యవస్థ తప్పదని లోక సంగ్రహార్థము రామునిచే అన్వేషణ విలాపములు జరుపబడినవి.

వరప్రభావము వలన రావణకుంభకర్ణులను రాముడే వధింపవలసి యున్నది. కానీ మఱియొక విధముగ చంపకూడదా అన్నచో-మాయా సీతను కల్పించి, ఆమెనపహరించుటయను నపరాధముతో రావణహనన కథను ప్రవర్తింపజేసెను. లోకమును పవిత్ర మొనరించు పరదారాపహరణ మొనరించిన వారికి వినాశము తప్పదని తెలియజేయుటమైనది.

శ్లో॥ హా నాథ క్వచి రామసీతి బహుశో వ్యాకృశ్య బాష్పాకులం
చక్షుర్దిక్షు విముంచతీం దశరథస్యాద్యాం స్నుషామ్
రేరే రాక్షస మా వధూం ప్రరుదతీం ముంచేతి గృధ్రాధిపో
రుద్ధ్వాధ్వాన మనల్ప కోపమకరోదగ్రే వనాంతా వనమ్. 67

అ - హా నాథ = హా ప్రాణేశ్వరా శ్రీరామా! క్వ = ఎక్కడ చిరాయసి = ఆలస్యముచేయుచున్నావు? ఇతి = ఈ ప్రకారముగ, బహుశః = పెక్కుమారులు వ్యాకృశ్య = బిగ్గఱగా ఏడ్చి, బాష్పాకులం చక్షుః = నీటితో నిండినకన్నులను, దిక్షు = అన్ని దిక్కులయందు విముంచతీం = ప్రసరింపజేయుచున్న, దశరథస్య ఆద్యాం స్నుషాం = దశరథుని యొక్క పెద్ద కోడలగు సీతను, అవేక్ష్య = చూచి, రేరే రాక్షస = ఓరీ రాక్షసుడా! మా కురు = అపహరింపకుము ప్రరుదతీం = దుఃఖించుచున్న వధూం = ఆడమనిషిని ముంచ = విడిచిపెట్టుము, ఇతి = అని గృధ్రాధిప

= గృధ్రరాజగు జటాయువు, అగ్రేవనం = వనపురోభాగమునందు, అధ్వానం = మార్గమును, రుద్ధ్వా = అడ్డగించి అనల్పం కోపం = అధిక క్రోధమును, అకరోత్ = ప్రకటించెను.

తా — హా ప్రాణేశ్వరా! నీవెక్కడ నున్నావు? ఎందుల కాలవ్యయము చేయుచున్నావు? నాకెటువంటి విపత్తు సంభవించినదో గమనించినావా? అని సీత, కన్నీరు మున్నీరై పొంగ, పెక్కు భంగుల విలపించుచు, దిక్కు మాలిన వాకు దిక్కెవ్వరని, అన్ని దిక్కులకు దృష్టిని ప్రసరింపజేయు చుండెను.

రే రే రాక్షస! సీత నపహరింకుము. ఈమె సామాన్యురాలు కాదు. మాన్యురాలు, దశరథ మహారాజు కోడలు, దిక్కులు పిక్కటిల్లదు! ఖించు చున్న ఈమెను విడిచి పెట్టుము అని అరుచుచు గద్దలజేడు వృదుడై సను-క్రుద్ధుడై అయ్యడవిలో రక్కసుల జెన్ని తోవనడ్డగించెను.

వి — సిహ్మాకరణముగ రావణుడు-తన ప్రియమిత్రుడగు దశ రథుని కోడలినిఎత్తుకొనిపోవుచుండగా, వానినిఓడించి జటాయువు సీతను విడిపించుటకు ప్రయత్నించెను.

శార్దూల వి కీడి తవృత్తము లక్షణమును-లోచూడుడు,

ప — సమభూత్సమయే తస్మిన్ సమరం సమరంహసోః,
మిథోమథన సంక్రుద్ధ గృధ్రరాక్షసరాజయోః ౯౫

అ— తస్మిన్ సమయే = ఆసమయము నందు, సమరంహసోః = తుల్యమైన వేగము గలవారును, మిథోమథన = పరస్పరప్రహారముతో సంక్రుద్ధ = కోపగించిన, గృధ్రరాక్షస రాజయోః = గృధ్రరాజ-రాక్షస రాజులకు (జటాయువునకు-రావణునకు) సమరం = యుద్ధము సమభూత్ = జరిగెను.

తా — అయ్యవసరంబున్న అతిశ్రీ విక్రమశాలులగు గృధ్ర రాజ

రాక్షస రాజులకు, పరస్పర ప్రహారంబులతో. క్రోధావేశంబులు పెచ్చు పెరుగుటం జేసి వారల సమరము చాలసేపు జరిగెను.

వి — ఇచ్చట 'సమరం సమరం' అను అనుప్రాసము మెచ్చుకొనదగియున్నది, గృధ్రరాజ-రాక్షసరాజయోః అనుటకుబదులు "గృధ్రరాక్షస రాజయోః" అనుట సముచితముగా నున్నది. ద్వంద్వాంతములోనున్న రాజన్ శబ్దము రెండు చోట్ల అన్వయించుచున్నది ఇచ్చట శ్లోకవృత్తము. దీని లక్షణమును లోచూడుము,

స — దశముఖరథమాశు ధ్వస్త రథ్యం వినూతం
శిథిలతరవరూథం శీర్ణచక్రం సచక్రే
గురుదభిహతశక్తిప్రాసబాణాసఖడ్గ
త్రిశిఖ విశిఖ తూణీ పాశకుంతశ్శకుంతః ॥౬౯॥

అ — సః శకుంతః = ఆ జటాయువు గరుత్ = రెక్కలచే, అభిహత = కొట్టబడిన, శక్తి = శక్తి యను నాయుధము, ప్రాస = ఈటె యొకయాయుధము బాణాస-ధనుస్సు, ఖడ్గ = చంద్రహాసము, త్రిశిఖ = త్రిశూలము, విశిఖ = బాణములు, తూణీ = అమ్ములపొదులు, కుంతః = బల్లెము గలవాడై, దశముఖరథం = రావణునియొక్క రథమును, ఆశు = శీఘ్రముగా ధ్వస్త రథ్యం = నశించిపోయిన గుఱ్ఱములు గల దానిని గాను వినూతం = చనిపోయిన సారథి గల దానిని గాను, శిథిలతర = మిక్కిలి చెడిపోయిన వరూథం = ఇరుసుగలదానిని గాను శీర్ణచక్రం = విరిగిపోయిన చక్రములు గల దానిని గాను, చక్రే = చేసెను,

తా — రాక్షసరాజుచే ప్రయోగింపబడిన, శక్తి ప్రాసధనుః ఖడ్గ త్రిశూల బాణ తూణీర పాశకుంతములను శకుంతమగు జటాయువు తన రెక్కలతో నుగ్గునుగ్గు చేసెను. రావణుని రథాంగములను (చక్రములను) విఱుగగొట్టెను. గుఱ్ఱములను చంపివేసెను. ఇరుసును రెండు ముక్కలు చేసెను. సారథిని చంపివేసెను. ఇట్లు జటాయువు నానావిధ శౌర్యము ప్రకటించెను.

వి – జటాయువు సూతుడ్ని గుఱ్ఱములను చంపి; రథమును విఱుగగొట్టి ధనుస్సును విఱిచి చత్రమును ముక్కలు ముక్కలు సేసి-రావణుని ఆయుధముల నన్నింటిని ధ్వంసమొనరించెను.

శతాంత శబ్దమును రెండుసార్లు ప్రయోగింపగలుగుట కవీశ్వరుని శక్తిని తెలియజేయుచున్నది.

శ – రాక్షసాసిక్షతః క్షిప్రం, పపాత పతతాం వరః
మైథిలీపక్షపాతేన పక్షపాత మవాప్య సః 78

అ సః పతతాం వరః = ఆపక్షిరాజము, మైథిలీ = సీతయందలి పక్షపాతేనతః = ఆసక్తి విశేషముతో, (ప్రేమతో) రాక్షసాసిక్షతః – రావణుని యొక్క చంద్రహాసముతో నరకబడినవాడై, పక్షపాతం = పక్షఛేదం = (ఱెక్కలను తెగగొట్టుటను) అవాప్య = పొంది పపాత = నేలమీద కూలెను.

తా – రావణుని చంద్రహాసముచే నరకబడిన జటాయువు సీతయందలి పక్షపాతముతో తన పక్షపాతమును పొందెను.

వి – జటాయువు రావణుని చంద్రహాసపు దెబ్బలకు ఱెక్కలుతెగి నేల గూలెను, ఇచ్చట పక్షపాత శబ్దమునకు ఱెక్కలు తెగుట, ప్రేమ అను, రెండు రథములను కవి చక్కగా కూర్చినాడు. జటాయువు ఱెక్కలు తెగి నేలగూలెనని చెప్పుటకు ప్రమాణము.
క్రూరుడగు రావణునిచే ఱెక్కలు తెగగొట్టబడి చంపబడిన జటాయువు నేల గూలెను."
తదుక్తం రామాయణే,

"సచ్ఛిన్న పక్ష స్సహసా రక్షసా రౌద్రకర్మణా
నిపపాత హతో గృధ్రో ధరణ్యా మల్పజీవితః."

గ — తత్క్షణ మన్యరథాధిరూఢేన రావణేన ఖడ్గేనాపి, నీయమానా జానకీ శృంగ సంగత ప్లవంగ పంచకే పంచచూడ ఇవ క్ష్మాధర

కుమారకే, కస్మింశ్చిత్ క్ష్మాధరే, సుగ్రీవసాత్కృతదశగ్రీవప్రతాపానల సదృశం వాలినాశపిశునమహోల్కాపాత ప్రతిమం, రామసాహాయ్యక ప్రోత్సాహనాయ పుత్రమభిపతత్పతంగబింబ శంకావహం కనక కపిశ కౌశేయోత్తరీయాంతరిత మాభరణ జాలమపాతయత్. 71

గ — తత్పతనమపి స్వతేజః పతనమివ నాలక్షయన్ అంకాలంకారభూతా మశోకవనికాం మైథిలీ మ యదనయాభిజ్ఞో దశగ్రీవః 72

అ — తత్క్షణం = జటాయువు తెక్కలు నరికిన పిమ్మట, అనవీ రథాధిరూఢేన = మతియొక రథము నెక్కిన, రావణేన = రావణునిచే. భూయోఽపి = తిరిగి, నీయమానా = తీసిక నిపోఁబడుచున్న జానకీ = సీతాదేవి, శృంగ = శిఖరము నందుసంగత = కూర్చొనియున్న ప్లవంగ పంచకే = సుగ్రీవాది పంచకముగల, పంచచూడే = పంచశిఖలుగల క్ష్మాధర కుమార ఇవస్థితే = రాజకుమారుని వలెనున్న కస్మింశ్చిత్క్ష్మాధరే = ఒక పర్వతము నందు సుగ్రీవసాత్కృత = సుగ్రీవుని స్వాధీనముచేయఁబడి నదశగ్రీవ = రావణుని యొక్క, ప్రతాపానం = ప్రతాపాగ్నితో, సదృశం = సమానమైనదియు, వాలినాశపిశున = వాలి యొక్క వధను సూచించునట్టి మహోల్కాపాత = మహోల్కాపాతముతో, ప్రతిమం = సమానమైనదియు, రామ = రామునియొక్క సాహాయక = సాహాయ్యము చేయుటకు ప్రోత్సాహనాయ = ప్రోత్సాహ పరచుటకు, పుత్రం = తన కుమారుడగు, సుగ్రీవుని దగ్గఱకు అభిపతత్ = వచ్చుచున్న పతంగబింబ = సూర్యబింబముయొక్క శంకావహం = సందేహమును కలిగించుచున్నదియును — కనకకపిశ = బంగారమువలె పింగళ వర్ణము గల, కౌశేయోత్తరీయ = పట్టు వస్త్రపు పమిటకొంగు ముక్కయందు అంతరిత = కట్టబడినదియునగు, ఆభరణజాలం = అందెలుమున్నగాగల నగల సముదాయమును, అపాతయత్ = పడవేసెను

తత్పతనమపి = "అనగల" మూటయొక్క పతనమును స్వతేజ, పతనమివ = తన ప్రతాపము యొక్క పతనమును వలె, నా అలక్షయన్ =

గుర్తింపనివాడై, లంకాలంకారభూతాం = లంకాపట్టణమునకు భూషణ దృశమైనటి, అశోకవనికాం=అశోకవనమును అనయాభిజ్ఞః= నీతిశాస్త్రాచరణ శూన్యుడైన-దశగ్రీవః=రావణుడు, మైథిలీం = సీతను,ః అనయత్ పొందించెను.

తా — జటాయువుయొక్క రెక్కలను నరికి, రావణుడు మఱియొక రథమునెక్కి సీతను తిరిగి తీసికొనిపోవుచుండెను. పంచ శిఖలుగల రాజకుమారుడో అన్నట్లు ఐదుగురు వానరులతోకూడిన ఒక కొండమీద, తన పట్టుపుట్టపు పమిటకొంగుకొంగున కట్టిన నగలమూటను క్రిందికి జారవిడిచెను. ఆ మూట శక్తిచే పృథ్విపై యుద్ధనము చేయబడిన రావణుని ప్రతాపాగ్నివలెను, బాహుబలశాలియగు వాలి వినాశమును సూచించు ఉల్కాపాతమువలెను, శ్రీరామునకు సాహాయ్యమునొనరింపుమని తన పుత్రుడగు సుగ్రీవునకు ప్రోత్సాహము నిచ్చుటకు నింగినుండి నేలకు దిగుచున్న సూర్యబింబమువలెను, చూపరులకు చూపట్టెను.

, ఆ నగలమూట పతనమును, తన ప్రతాపాగ్ని పతనముగా భావింపని దుర్వినీతుడగునా – రావణుడు లంకాలంకార భూతమగు నశోకవనములో సీతను జేర్చెను.

వి — ఐదుకోతులు గల పర్వతముమీద సీత తన చీరకొంగున కట్టిన నగలమూటను పడవేసెను. ఈ కోతులు తన నగలను తన ప్రియుడగు రామునకు చూపగలవని సీతయొక్క అభియాస. తొందరలో రావణుడు దీనిని గ్రహింపలేదు.

అత్ర రామాయణమ్—

"హ్రియమాణా తు వైదేహీ క్వచిన్నాథమపశ్యతీ
దదర్శ గిరిశృంగస్థాన్ పంచ వానర యూథపాన్
తేషాం మధ్యే విశాలాక్షీ కౌశేయకనకప్రభమ్

ఉత్తరీయం వరారోహా శుభాన్యాభరణానిచ
ముమోచ, యది రామాయ శంసేయురితి భామినీ
వస్త్రముత్సృజ్య తన్మధ్యే వినిక్షిప్తసుభూషణమ్
సంభ్రాంతస్తు దశగ్రీవస్తత్కర్మచ న బుద్ధవాన్
ప — అశోకవనికామలేభే రాక్షసీ పరివేష్టితామ్
సీతాం మారుతివాలాగ్నిస్తంభనార్హామివౌషధీమ్ 73

అ — అశోకవనికా = అశోకవనము, రాక్షసీ పరివేష్టితాం = రాక్షస స్త్రీలచే చుట్టుముట్టబడిన సీతాం = సీతాదేవిని, మారుతివాలాగ్ని = హనుమంతునియొక్క తోకయందలి నిప్పును, స్తంభనార్హాం = ఆపివేయుటకు యోగ్యమైన, ఓషధీమివ = లతా విశేషమునువలె, లేభే = పొందెను.

తా — రాక్షసస్త్రీలచే చుట్టుముట్టబడిన సీతను, హనుమంతుని వాలాగ్నిస్తంభనౌషధినిగా, అశోకవనిక పొందెను.

వి — రావణుడు సీతను అశోకవనములో అశోకవృక్షముక్రింద నుంచెను. లంకాదహనములో అశోకవనము తగులబడలేదు. అందుకు కారణము సీతయను నోషధివిశేషమే. ఆ ఓషధివిశేషము లేనిచో అశోకవనికకూడ తగులబడియుండెడిది.

ప — కాకుత్స్థోప్యథ రక్షసామధిపతేర్వాగ్వాగురావేష్టితే
కృత్వా హాటకతాటకేయహరిణే శార్దూలవిక్రీడితమ్
ఆగచ్ఛన్ననుజేన తత్ర గదితామాకర్ణ్య వార్తాం తతః
సీతానజ్ఞమలాలసస్తదుటజం రామః ప్రతస్థే ద్రుతమ్ 74

అ — అథ = తరువాత, కాకుత్స్థోపి = రఘునాయకుడున్ను, రక్షసామధిపతేః = రాక్షసనాయకునియొక్క, వాగ్వాగురావేష్టితే = ప్రేరణ వచనము వలతో నియమింపబడిన, హాటక – తాటకేయహరిణే = హరి

చేడను బంగారు లేడియందు, శార్దూల విక్రీడితం = పెద్దపులియొక్క క్రీడను, కృత్వా = సలిపి, ఆగచ్ఛన్ = వచ్చుచు, అనుజేన = తన తమ్ముడగు లక్ష్మణునిచే, గదితాం = చెప్పబడిన, వార్తాం = వృత్తాంతమును, ఆకర్ణ్య = విని, తతః = అటు పిమ్మట, సీతాసఙ్గమలాలసః = సీతాదేవిని కలిసికొనవలెనను గట్టి కోరికగలవాడై, రామః = రాముడు తదుటజం = సీతయొక్క పర్ణశాలనుగూర్చి, ద్రుతం = శీఘ్రముగా, ప్రతస్థే = బయలుదేరెను.

తా — రాక్షసరాజు, తనమాటలవలతో మారీచుడను లేడిని కట్టివేసెను. రాముడాలేడిని పెద్దపులి చంపినట్లు చంపివేసెను. త్రోవలో తమ్ముని జూచి వాని మాటలువిని, సీతను జూడగోరి, శీఘ్రముగా పర్ణశాలకు బయలుదేరెను.

వి — మారీచుడను లేడిని రాముడను పెద్దపులి చంపి యింటికి చేరెను. ఇచట శార్దూలవిక్రీడితమను శబ్దము — ఈ శ్లోకములోని వృత్తమునుకూడ చెప్పుటవలన కవీశ్వరుని చాతుర్యము తెలియుచున్నది. ఇచట ముద్రా అను అలంకారము

వ — అయం కథంస్యాదితి బాష్పగర్భ
మాలోక్యమానో వనదేవతాభిః
విలోకయన్కేవలపర్ణశాలాం
వినష్టచేతా విలలాప రామః 75

అ — అయం = ఈశ్రీరాముడు కథంస్యాత్ = ఏ ప్రకారముగా ఉండగలడు, ఇతి = అని, బాష్పగర్భం = కన్నులలో నీరుతిరుగునట్లుగా, వనదేవతాభిః = వనదేవతలచే ఆలోక్యమానః = చూడబడుచున్నవాడై, కేవలపర్ణశాలాం = సీతారహితమైన పర్ణశాలను, విలోకయన్ = చూచుచు, వినష్టచేతాః = ఉత్సాహరహితుడై, రామః = రాముడు, విలలాప = దుఃఖించెను.

తా—సీతలేని ఈపర్ణశాలలో శ్రీరాముడెట్లుండగలడని వనదేవతలు శ్రీరాముని జూచి దుఃఖించుచుండెను. శ్రీరాముడు సీతలేని పర్ణశాలను జూచి బొటబొటకన్నీరు కార్చెను.

వి— అయ్యో సీతలేని పర్ణశాలను జూచి, రాముడెంత బాధపడునో అని వనదేవతలు, గుడ్లనీళ్లు గుడ్లలోనేయిముడ్చుకొనుచుండిరి. ఇట్లనుట వలన నొక విశేషము తెలియుచున్నది.

మహాత్ముల యొక్కయు, గురువుల యొక్కయు, దేవతల యొక్కయు కన్నీరు నేలమీదపడినచో, దేశభ్రంశము, గొప్పదుఃఖము, మరణము అను వీటిలో ఏదో ఒకటి సంభవించును, అని పెద్దలు చెప్పెదరు. రామునకు సీతావియోగమువలన పెద్దదుఃఖము సంభవింపనున్నది. కావున "బాష్పగర్భం" అను విశేషణమును వేసినాడు. తదుక్తమ్—

"మహాత్మ, గురు, దేవనాం అశ్రుపాతః క్షితౌయది,।
దేశభ్రంశో మహద్దుఃఖం మరణంచ భవేద్ధ్రువమ్." ॥

వ — హాకష్టమత్ర న హి సా కిమిదం ప్రవృత్తం
ఆలోకయామి చటులామిహ పాదముద్రామ్
మాంవీక్ష్య నూనమగృహీతమృగం ముహూర్త
మంతర్హితాతరుషు రోషవతీవసీతా॥

అ — హా కష్టం!ప్రాప్తం! అయ్యో! ఎంత కష్టము వచ్చిపడినది? అత్ర = ఇచ్చట, సా = ఆ సీత, నహ్యస్తి = లేదు, ఇహ = ఇక్కడ చటులాం=శిథిలిమైన,పాదముద్రాం=అడుగులజాడను, ఆలోకయామి= చూచుచున్నాను, అగృహీతమృగం = పట్టుబడనిలేడిగల, మాం = నన్ను, వీక్ష్య = చూచి. ముహూర్తం = రెండు గడియలపాటు, రోషవతీసీతా = క్రోధముగల సీత, తరుషు = చెట్లలో, అంతర్హితేవ=దాగియున్నదివలె నున్నది, నూనం = నిశ్చయము.

తా — అయ్యో! ఇచ్చట సీతలేదు. ఏమి జరిగియుండును. ఇచ్చట చెఱిగిన అడుగులజాడ కన్పట్టుచున్నది. లేడిని పట్టుకొని రాన్ని నన్ను జూచి కోపించి, సీత కొంచెముసేపు ఈ గుబురుగా నున్న చెట్లలో దాగియున్నదేమో!

వి — తాను కోరిన లేడిని రాముడు తీసికొని రాకపోవుటవలన కోపించిన సీత, రామునకు కనబడకుండ చెట్లచాటునో పుట్టచాటునో, దాగియుండునని కవియుత్ప్రేక్షించినాడు. అది నిజమే. తాము కోరిన వస్తువులను భర్తలు తీసికొనిరానిచో వారిమీద కోపమును చూపుటకు భార్యలు తఱచు ఇట్లు చేయుచుందురు.

వ — త్వదభిలషితపూర్త్యా వంచితః పంచవట్యా
అచరమచరమోహం మోహభాజాం ప్రజానామ్
తదిహ సరళబుద్ధేనైషరోషస్య కాలః
సుముఖి మయి ముఖం కిం సోఢ సీతావియోగమ్ 77

అ — హే సరళబుద్ధే = వంకరటి కరలేని తిన్ననిబుద్ధి కలదానా సుముఖి = ఓ అందమైన ముఖము కలదానా! ఓ సీతా! త్వదభిలషిత పూర్త్యై = నీయొక్క కోరికయొక్క పూర్తితో, అహం = నేను, విప్రలబ్ధః = వంచింపబడితిని. అహం = నేను మోహభాజాం = స్త్రీ వ్యామోహములో పడిన ప్రజానాం = జనులలో, అచరమః = అగ్రేసరుడనై, పంచవట్యాం = పంచవటిలో అచరం = తిరిగియుంటిని. ఏషః = ఇది రోషస్య = రోషమునకు కాలః = సమయము, న = కాదు, మమ ముఖం = నాయొక్క ముఖము, సోఢసీతావియోగం కిమ్ = సహింపబడిన సీతా వియోగముకలది కాదుగదా?

తా — మాయామర్మము తెలియగనిదానా! అందమైన ముఖము గలదానా! ఓ జానకీ! నీ కోరికను నెరవేర్చుతేనివాడనై, స్త్రీ పరవశు లగు పురుషులలో అగ్రగణ్యుడనై, అరణ్యమంతయు తిరిగితిని. నీవు

కోపగింపకుము. కోపించుట కిది యతము కాదు. నీ ముఖముచూడక, నేనొక్క నిముసమైన నుండగలనా ?

వి — లోకోత్తరలావణ్యసంపన్నమగు నీ ముఖము నేను, క్షణమైననుజీవింపజాలనని, తన హృదయములోనిబాధను ఈశ్లోకములో వెల్లడించుచున్నాడు. ఈ శ్లోకములో మాలినీవృత్తము. దీని లక్షణము వ శ్లోకములో చూడుడు. మచర – మచర, మోహ, మోఽహఅను ఛే కానుప్రాస – అనుప్రాస రసికులకానందమును కూర్పగలదు.

వ — యద్యస్తి కౌతుక మపూర్వమృగే మృగాక్షి
చాంద్రం హరామిహరిణంమమ సన్నిధేహి,
యావన్నముంచసి మయా హృతమేణమేనం
తావద్దధాతు తవవక్త్రతులాం మృగాంకః 78

అ — హే మృగాక్షి = ఓ కురంగాక్షీ ! అపూర్వమృగే‍ం = మున్నెన్నడు చూడని లేడియందు, కౌతుకం = వేడుకే అస్తియది = ఉన్నచో, చాంద్రంహరిణం=చంద్రునకుసంబంధించినలేడిని, హరామి= తీసికొనిరాగలను, మమసన్నిధేహి=నా దగ్గఱకురమ్ము, మయా=నాచేత హృతం =తీసికొనిరాబడిన, ఏనంఏణం = ఈ లేడిని, యావత్ = ఎంత లోగా, న ముంచసి=విడిచిపెట్టవో, తావత్= అంతలోగా, మృగాంకః= చంద్రుడు, తవ = నీయొక్క, వక్త్రతులాం = ముఖముతో సామ్యము దధాతు = ధరించుగాక.

తా — ఓ కురంగాక్షీ! నీకు అపూర్వకురంగముమీద నభిలాషయే యున్నచో, చంద్రునిలోని కురంగమునైన తెచ్చి ఇవ్వగలను. వెంటనే బయుల్పడుము. నేను తెచ్చిఇచ్చే లేడిని నీవు విడవకుము. నీవు విడుచునంతలో అ చంద్రుడు నీ ముఖముతో సాదృశ్యమునను భవించు గాక.

వి — వసంతతిలకావృత్తము శ్లోకము చూడుడు.

వ — సప్రాణాచేజ్జనకతనయా కిం న తిష్ఠేతమహ్యం
హింస్రైర్హిస్రైర్వ్యాఘ్రైః ఖలు నిహతా రక్తసిక్తా న పృథ్వీ
గోదావర్యాం పులినవిహృతిం రామశూన్యా న కుర్యాత్,
యుక్తం నక్తంచరకబళనాత్ సర్వథా సంస్థితాసా 79

అ — జనకతనయా = సీతాదేవి, సప్రాణాచేత్ = జీవించి యున్నచో మహ్యం = వియోగాసహిష్ణువునైన నాకొఱకు, తనను కన బరచకుండగా, నతిష్ఠేత=ఉండలేదు. హింస్రైర్హిస్రైర్వ్యాఘ్రైః = వ్యాఘ్రాది ఘాతుకమృగములచే, న నిహతా = చంపబడలేదు, పృథ్వీ = నేల, రక్తసక్తా = నెత్తురుచే తడుపబడినది, న = కాలేదో, గోదావర్యాం = గోదావరీ తీరమునందు, పులినవిహృతిం = ఇసుకతిన్నెలమీద విహార మును, రామశూన్యా = ప్రియతముడగు నేను లేకుండగా న కుర్యాత్ = చేయజాలదు, సర్వథా = ఏ విధముగా జూచినను, సా = ఆసీత, నక్తంచరకబళనాత్= రాక్షసులచే తినబడుటవలన, సంస్థితా=మరణించి నది, ఇదం యుక్తం = ఇది తగినయాలోచన.

తా — పరమ పతివ్రతయగు జానకి బ్రతికియున్నచో నాపిలుపు విని బయటకు రాకమానదు. నేలమీద నెత్తురుతో తడిసియుండలేదు గనుక ఆమె ఘాతుకమృగములచే చంపబడియుండలేదు. గోదావరీ తీరపు ఇసుకతిన్నెలమీద నేను లేకుండ విహరింపనేరదు. పతిని విడనాడి పులినములమీద విహరించుట పతివ్రతల ధర్మము కాదుగదా? కనుక, నిక్కముగా, నరమాంసభక్షకులగు రాక్షసులచే మ్రింగబడి మడిసి యుండును.

వి — సీత బ్రతికియున్నచో నా పిలుపు విని నా ముందుకు రాకమానదు. ఘాతుకమృగములచే మ్రింగబడలేదు. మ్రింగబడినచో నేల రక్తసిక్తము కాలేదేల? పతివ్రతయగు సీత పతినగు నన్ను విడిచి

ఒంటరిగా విహారయాత్రకు వెడలియుండదు. ఒంటరిగా విహార యాత్రకు వెడలుట పతివ్రతఅయాచారము కాదుగదా ? కనుక రాక్షసుల చేతనే భ్రమింగబడినది అని సిద్ధాంతీకరించుట కవీశ్వరుని భావనాశక్తిని బయటపెట్టుచున్నది.

శ — లోకాన్తర ప్రణయినం శ్వశురం ప్రణన్తుం
అజ్ఞప్తకాలమతిలంఘ్య యది ప్రయాసి,
విజ్ఞాప్యమామపి సమాహ్వాయ సాధ్వి తస్మై
సౌమిత్రి రేవ భరతే నిదధాతు రాజ్యమ్ 80

అ — హే జానకి = ఓ జానకి, లోకాంతరప్రణయినం = స్వర్గ లోకములోనున్న, శ్వశురం = మామగారైన దశరథ మహారాజును, ప్రణంతుం = నమస్కరించుటకు, అజ్ఞప్తకాలం = దశరథునిచే వన వాసమునకై నియమింపబడిన పదునాలుగు సంవత్సరముల కాలమును అతిలంఘ్య = అతిక్రమించి, ముందుగానే ప్రయాసి యది= వెళ్ళదలచి నచో, సాధ్వి = పతివ్రతయగు ఓ సీతా! తస్మై = మీ మామగారికి విజ్ఞాప్యం=మనవిచేసి, మామపి=నన్నుకూడ, సమాహ్వాయ=పిలువుము సౌమిత్రిరేవ = లక్ష్మణుడే, భరతే = భరతునియందు, రాజ్యం = రాజ్య మును, నిదధాతు = ఉంచుగాక.

తా — ఓ జానకీ! లోకాంతరగతుడైన మీ మామగారికి పాదాభి వందనము చేయుగోరి, పదునాలుగు సంవత్సరముల తరువాత అయోధ్యకు రండను మామగారి యాజ్ఞనతిక్రమించి నీవు లోకాం తరమునకు వెళ్ళదలచితివేమో? ఓ సాధ్వీ!లాగా! మామగారికి మనవి చేసి నన్నుకూడ వచ్చుటకు పిలిపింపుము" స్వర్లోకయాత్రాతత్పరుడగు శ్రీరాముడయోధ్యకు వచ్చుటకు వీలు కుదురలేదు. నీవే రాజ్యమును పరిపాలింపుము అని లక్ష్మణుడే భరతునకు సామ్రాజ్య పట్టాభిషేకము నొనరింపగలడు.

వి - మీ మామగారి యాజ్ఞాను సారము, మామగారికి నమ స్కరించుటకు నీవుస్వర్గమున కేగినచో; ఓ సాధ్వీ! నీవుమీ మామగారితో చెప్పి, పదునాలుగేళ్ల వనవాసము పూర్తికాక పోయినను, నన్ను కూడ స్వర్గమునకు పిలిపింపుము అన్నయగు రాముడు స్వర్గమునకేగుట వలన ఈ రాజ్యభారము నీవే భరింప వలసియుండునని అన్నగారు నాతో చెప్పినారు. కనుక ఈ నేలను నే నేల జాలనని యనక నీవే ఏలుకొనుమని లక్ష్మణుడే మదాజ్ఞాపరిపాలకుడై భరతునకు— ఈ విషయమును విన్నవింప గలడను నీ భావము రామవిలాపములో మచ్చుతునక యని చెప్పకతప్పదు. ఇచ్చట వసంతతిలకావృత్తము.

వ — ఇత్థం విలప్య విపినే దయితాం విచిన్వన్
రామో న తత్ర ధృతిమాన్నహి లక్ష్మణశ్చ,
తాదృగ్విధా మపి కథాం కథయన్ స్వవాచా
వల్మీకజన్మమునిరేవ కఠోరచేతాః 81

అ - ఇత్థం = ఇట్లు, విలప్య = దుఃఖించి, రామః = రాముడు తత్ర విపినే = ఆ అడవిలో, దయితాం = భార్యయగు సీతను, విచిన్వన్ = వెదకుచు ధృతిమాన్ = ధైర్యవంతుడు, నబభూవ = కాలేదు లక్ష్మణశ్చ = లక్ష్మణుడును, ధృతిమాన్ = ధైర్యవంతుడు, న బభూవ కాలేదు.

స్వవాచా = తన వాక్కుతో. తాదృగ్విధాం కథామపి = శ్రీరామ విలాప-ప్రబంధమును, కథయన్ = చెప్పుచున్న కఠచేతాః = కఠరతో హృదయుడైన, వల్మీకజన్మకిమునిరేవ = వాల్మీకిమహర్షియే, ధృతిమాన్ బభూవ = ధైర్యవంతుడాయెను.

తా — ఇవ్విధముగ, విపినములో సీతను వెదకుచు, విలపించిన విరహార్తుడగు రాముడుగానీ, పరదుఃఖదుఃఖితుడగు వాని తమ్ముడగు లక్ష్మణుడు గానీ ధైర్యవంతులుగారైరి. ఇంత కఠిన మైన కథను తన

నోటితో చెప్పుచున్న కఠోరచిత్తుడగు వాల్మీకియే, ధైర్యసంపన్నుడని చెప్పకతప్పదు

వి – సీతను వెదకుచు రాముడు విలపించి ధైర్యహీనుడాయెను అట్టిరాముని జూచిలక్ష్మణుడు ధైర్యరహితుడాయెను. రామవిలాపమును రమ్యముగ వర్ణించిన వాల్మీకి మిక్కిలి స్థైర్యవంతుడని చెప్పక తప్పదు.

గ — తతః ప్రారభ్యమాణ ప్రయాణాన్ ప్రాణా నష్టభ్య, జటాయు(స్తతస్తతః) క్రియమాణ సీతాన్వేషణం, రామం సలక్ష్మణ మా, లక్షయన్న వోచత. 82

గ — ఆయుష్మన్! మాం ఖడ్గవిక్షతపక్షతిం క్షితితలే నిక్షిప్య క్షిప్ర మపజహార జానకీం రావణ ఇతి. 83

అ — తతః = తరువాత, ప్రారభ్యమాణ ప్రయాణాన్ = ప్రారంభింపబడినప్రయాణముగల ప్రాణాన్=ప్రాణములను, అదష్టభ్య=అపుకొని, జటాయుః = జటాయువు, క్రియమాణ సీతాన్వేషణం = చేయబడుచున్న సీతను వెదకుట గల సలక్ష్మణం రామం = లక్ష్మణునితో కూడియున్న, రామం = శ్రీరాముని, అలక్షయన్ గుర్తించుచు, అవోచత = పలికెను

ఆయుష్మన్ = ఓ చిరంజీవీ! రావణః = రావణుడు ఖడ్గ = కత్తితో విక్షత = తెగగొట్టబడిన పక్షతిం = రెక్కలకుదురుగల మాం = నన్ను క్షితితలే = నేలయందు నిక్షిప్య = పడవేసి, = క్షిప్రం తొందరగా, జానకీం = సీతను, అపజహార = ఎత్తుకొనిపోయెను.

తా — తరువాత, జటాయువు—పోవుటకు సిద్ధముగానున్న తన ప్రాణములను, ఉగ్గబట్టుకొని, సీతను వెదకుచు, తమ్మునితో వచ్చుచున్న రాముని కనుగొని యిట్లు పలికెను.

"ఓ చిరంజీవీ! చంద్రహాసముతో నా రెక్కలను తెగగొట్టి నన్ను

నేలమీద పడగొట్టి, వట్టిమూర్ఖుడగు రావణుడు, సీతనుఅపహరించి వెడలి పోయెను.

వి జటాయు శబ్దము షకారాంతముగాను, ఉకారాంతముగాను కన్పట్టుచున్నది."జటాయోర్లంకాపురస్థాం రఘువీరపత్నీమ్"అనుచోట ఉకారాంతముగాను "జటాయుషః పక్షపాతం విధాయ" షకారాంతము గాను కన్పట్టుచున్నది.

ఇచ్చట క్షకారానుప్రాస అనుప్రాసకు, మచ్చులేని మచ్చుతునక అలసిపోయిన నారెక్కలను కత్తితో తెగగొట్టి, రావణుడు సీతను తీసి కొని మింటిలోనికెగిరి పోయెనను భావము రామాయణములో నున్నది.

తథా చ రామాయణమ్

"పరిశ్రాంతస్య మే పక్షౌ ఛిత్త్వాఖడ్గేన రావణః
సీతామాదాయ వైదేహీం, ఉత్పపాత విహాయసమ్"

వ. స్వయమపి శరభంగస్వీకృతాం భంగహీనాం
సపది గతి మవాప్తస్సంహృతాయుర్జటాయుః
నయనసలిలమిశ్రం రామహస్తేన దత్తం
దశరథదురవాపం ప్రాపనైవాపముంభః 84

అ. జటాయుః = జటాయువు స్వయమపి = స్వయముగా శరభంగ స్వీకృతాం = శరభంగమహామునిచే స్వీకరింపబడిన, భంగహీనాం = శాశ్వతమైన, గతిం = వైకుంఠస్థానమును, అవాప్య = పొందినవాడై

దశరథదురవాపం = తండ్రియగు దశరథునిచే పొంద శక్యము గానిదియు, రామహస్తేన = శ్రీరాముని చేతితో దత్తం = ఇవ్వబడిన నైవాపమంభః = నివాపజలాంజలిని ప్రాప = పొందెను.

తా — చెప్పి, వెంటనే జటాయువు ప్రాణములను విడిచిపెట్టెను.

శరభంగమహాముని వలె తానును, శాశ్వతమైన వైకుంఠ పదము నలంకరించెను. ఇచ్చట గుర్తింపదగిన విశేషమేమనగా, తన ప్రియ మిత్రుడగు దశరథుడందుకొనజాలని, ప్రాంజలియైన శ్రీరామునిచే నివ్వబడిన కన్నీటితో కూడిన నివాపాంజలిని (శ్రద్ధాంజలిని) జటాయు నందుకొనగలిగెను.

వి - జటాయువు వైకుంఠమును పొందెను. తన తండ్రి మిత్రుడగు జటాయువు శ్రీరాముడిచ్చిన నివాపాంజలిని అందుకొనగలిగెను. తండ్రి యగు దశరథున కాయదృష్టము లభింప లేదు,

ఉక్తం చ రామాయణే—
"తతో గోదావరీం గత్వా నదీం నరవరాత్మజౌ
ఉదకం చక్రతు స్తస్మై గృధ్రరాజాయ తావుభౌ"

తిర్యక్కులకు కర్మచేయునధికారము లేదుగనుక అగ్ని సంస్కారము లేదుఉత్తమలోకములులేవుముక్తియెట్లుకలుగును? అనుప్రశ్నకునీవునాచే అంగీకరింపబడినావు గనుకశాశ్వతమైన ముక్తిని పొందుమని రామునిచే రామాయణములో చెప్ప బడియుండుటచే, తిర్యక్కే అయినను జటాయువునకుముక్తితప్పనిసరి "అని సమాధానము.

నృసింహపురాణములో నిట్లు చెప్పబడినది ఓ పక్షిరాజా! నాకొఱకై నీవు మరణించినావు గనుక, నాయనుగ్రహము వలన విష్ణులోకమును పొందగలవని రాముడు, చెప్పినాడు తదుక్తం నృసింహపురాణే,

"మత్కృతే మరణం యస్మాత్ త్వయా ప్రాప్తం ద్విజోత్తమ!
తస్మాన్మమ ప్రసాదేన విష్ణులోక మవాప్స్యసి, ఇతి

సుగ్రీవుడు-అంజనేయుడు. గజేంద్రుడు జాంబవంతుడు, జటాయువు ముక్తులని ముక్తుల జాబితాలో నుండుట వలన జటాయువునకు మోక్షము తప్పని సరియని నిర్ణయము. తదుక్తమ్-

"సుగ్రీవో హనుమా నృక్షో గజో గృధ్రో వణిక్పథ ఇతి

గ — అథ దక్షిణారణ్యానింప్రతి ప్రస్థితే కాకుస్థే, రాక్షసీ కాచిద యోముఖీ నామ సౌమిత్రి మభిభూయ తదీయ శస్త్రేణ శూర్పణఖాస్థితి మలభత 85

తతః క్రౌంచారణ్యసరణ్యా ప్రయాతా వేతౌ,మహర్షేః స్థూలశిరసః శాపాత్కోణపతాం ప్రపన్నః పన్నగపతి భోగ భీషణాభ్యాం భుజాభ్యాం బబంధ యథార్థనామా కబంధః 86

తదనంతర మనత్రుపాత్రేషు రాక్షసీనేత్రేషు పదోత్పాదిత తర వారిభ్యాం రామలక్ష్మణయోస్తరవారిభ్యాం కబంధ బాహుయుగళం కదళీలావ మలూయత 87

అ — అథ = జటాయువు మోక్షము పొందిన తరువాత, కాకుత్స్థే = శ్రీరామచంద్రుడు, దక్షిణారణ్యానింప్రతి = దక్షిణమహారణ్యమును గూర్చి, ప్రస్థితే = బయలుదేరిన వాడుకాగా అయోముఖీనామ= అయోముఖియను నొక రాక్షసి, సౌమిత్రిం = లక్ష్మణుని, అభిభూయ = తిరస్కరించి, తదీయశస్త్రేణ =లక్ష్మణునియొక్క ఖడ్గముతో శూర్పణఖా స్థితిం = శూర్పణఖ యొక్క ముఖ భంగరూప నిష్పత్తిని, అభజత = పొందెను.

తతః = తరువాత, క్రౌంచారణ్యసరణ్యా = క్రౌంచ పర్వత వన మార్గము ద్వారా, ప్రయాతౌ = బయలుదేరిన, ఏతౌ = ఈ రామ లక్ష్మణులను, మహర్షేఃస్థూలశిరసః= స్థూలశిరుడనేమహర్షి యొక్క,శాపాత్ =శాపమువలన,కోణపతాం = రాక్షసత్వమును,ప్రాప్తః=పొందినవాడును, యథార్థనామా = సార్థకనామధేయుడునగు, కబంధః = కబంధుడను రాక్షసుడు, పన్నగపతి = ఆదిశేషుని యొక్క భోగ = శరీరమువలె

భీషణాభ్యాం = భయంకరములైన భుజాభ్యాం = బుజములతో బబంధ = బంధించెను.

తదనంతరం = బాహువులతో బంధించిన తరువాత, అనశ్రు పాత్రేషు = కన్నీళ్లను ఎఱుగనట్టి, రాక్షసీ నేత్రేషు = రాక్షసాంగనల కన్నులు సదా = ఎల్లప్పుడు, ఉత్పాదితతర = మిక్కిలి కలిగింపబడిన వారిభ్యాం కన్నీళ్లు కలిగిన. రామ లక్ష్మణయోః = రామలక్ష్మణుల యొక్క తరవారిభ్యాం = ఖడ్గములతో, కబంధ బాహుయుగళం = కబంధుని భుజద్వంద్వము, కదళీలావం = అరటి చెట్లనుఛేదించినట్లుగ అలూయత = ఛేదింపబడెను.

తా — పిమ్మట, శ్రీరాముడు దక్షిణ మహారణ్యములో ప్రయాణము చేయుచుండెను, అచ్చట నయోముఖియనునొక రక్కసి లక్షణుని తనకు ప్రియునిగా నుండుమని నిర్బంధించెను. కుపితుడై, లక్షణుడు శూర్పణఖకు వలెనే ఈమెకు ముక్కు చెవులు స్తనాగ్రములు. తెగగోసెను

పిమ్మట రామలక్ష్మణులు క్రౌంచారణ్యములో ప్రయాణించుచుండగ పర్వముల వలె భయంకరములైనభుజములతో అపమూర్ధకళేబరుడగు కబంధుడు వారిని బంధించెను. ఈ కబంధుడొక అందమైన గంధర్వుడు అడవిలో కామరూపియగు నితడు కబంధరూపముతో తిరుగుచు స్థూల. శిరస్కుడను మహర్షిని సంహసించెను కుపితుడైనమహర్షి ఇదేరూపము నీకు స్థిరముగా నుండు గాకయని శపించెను, వెంటనే, రామ లక్ష్మణులు ఖడ్గములతో కబంధుని కుడి చేతిని—ఎడమ చేతిని అరటి చెట్లను వలె నరికివేసిరి.

వి – అరణ్యానీ అనగా, పెద్ద అడవి.సరసీయనగా పెద్దసరస్సు.

అయోముఖియను రాక్షసి లక్ష్మణుని గవయగోరి శూర్పణఖవలె

ముక్కు చెవులు స్తనాగ్రములఖండనకు గురియయ్యెను.

ఏహి రంస్యావహే॥ఇత్యుక్త్వాసమాలింబత లక్ష్మణమ్.
ఏవముక్తస్తుకుపితః ఖడ్గముద్యమ్య లక్ష్మణః
కర్ణనాసే స్తనౌ తస్యాః విచకర్తారిసూదనః

అను వాక్యము లిచ్చట ప్రమాణము.

కబంధుడను రక్కసి పాముల వంటి తనభీకరములగు కరము లతో రామ లక్ష్మణులను బంధించెను. రాముడు శేషశాయియగుట వలన లక్ష్మణుడు శేషుని అవతారమగుట వలన, పాముల వంటి చేతులకు వారు భయపడలేదు,

కబంధు డనగా తలలేని శరీరము మాత్రముగలవాడని యర్థము. అపమూర్ధకళేబరము కస్య శిరసః బంధో అస్యాస్తీతి విగ్రహః. ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బకు ఉరస్థలములోనికి పోయినతలగలవాడనిఅర్థము

ఓ రామా! నేను చాల అందమైనవాడను, కబంధ రూపమును ధరించి అడవిమృగములను బాధింపసాగితిని, నాయీ రూపమును జూచి స్థూలశిరుడను మహర్షి ఘాతుకము, గర్హితమునగు ఈ రూపమే నీ కెల్లవేళలా ఉండుగాక అని శపించెను. ఈ రూపము రణరంగములో ఇంద్రుని కోపము వలన వచ్చినదని కబంధుడు లక్ష్మణునకు చెప్పెను

రామాయణే లక్ష్మణం ప్రతి కబంధవాక్యమ్

పురా రామ మహాబాహో మహాబలపరాక్రమ
రూపమాసీన్మమాచింత్యం త్రిషు లోకేషు విశ్రుతమ్
తతః స్థూలశిరానామ మహర్షిః కుపితో మయా
విచిన్వన్ వివిధం వన్యం రూపేణానేన ధర్షితః
తేనాహ ముక్తః ప్రేక్ష్యేదం ఘోర శాపాభిధాయినా
ఏతదేవ నృశంసంతే రూపమస్త్వితి గర్హితమ్

ఇంద్రకోపాదిదం రూపం ప్రాప్తమేవ రణాజిరే ॥ ఇతి

(ఉత్పాదిత) తరవారిభ్యాం తరవారిభ్యాంఅనుపదద్వయము కవీశ్వరుని శబ్దవైచిత్యమును తెలియజేయుచున్నది కబంధుని కుడిచేతిని రాముడు ఎడమ చేతిని లక్ష్మణుడు తెగగొట్టెననుటలో రామాయణ మిట్లు చెప్పుచున్నది.

"దక్షిణో దక్షిణం బాహుమసక్తమసినా తతః
విచ్ఛేద రామో వేగేన, సవ్యం వీరస్తు లక్ష్మణః

వ — తదను దను కబంధే నాదరా దర్థితౌ తౌ
గిరితటభువిదేహం దేహతుస్తస్య భీమమ్
అకథయదథ శాపాపాయ తుష్టస్సరామం
తపన తనయ మైత్ర్యా మైథిలీం ప్రాప్నుహీతి. 88

అ తదను = చేతులు నరికిన పిమ్మట, దనుకబంధేన = దనువను పూర్వనామముగల కబంధునిచే, ఆదరం = ఆదరముగా; అర్థితౌ = కోరబడిన, తౌ = ఆ రామలక్ష్మణులు తస్య = ఆ దనుకబంధుని యొక్క భీమం = భయంకరమైన దేహం = కళేబరమును గిరితటభువి = కొండనెత్తము నందు. దేహతుః = తగలబెట్టిరి, అథ = తగలబెట్టిన తరువాత శాపాపాయతుష్టః = శాప విముక్తిచే సంతసించినవాడై, సః = ఆ కబంధుడు, తపనతనయ = సూర్య పుత్రుడైన సుగ్రీవుని యొక్క మైత్ర్యా = స్నేహముతో మైథిలీం = సీతను- అప్నుహి = పొందుము ఇతి = అని అకథయత్ = చెప్పెను.

తా — తరువాత, దనుకబంధుని కోరికపై, భయంకరమగు వాని శరీరమును కొండమీద తగలబెట్టిరి. ఆ దను కబంధుడు, రాక్షస శరీరమును విడిచిపెట్టి శాపవిముక్తి కలుగుటంజేసి, మిక్కిలి సంతసించి

సూర్యపుత్రుడగు సుగ్రీవుని మైత్రితో సీతను పొందుమనిచెప్పెను.

వి :-రామలక్ష్మణులు కబంధుని దేహానికి అగ్ని సంస్కార మొనరించిరి శాపవిముక్తిని పొందిన కబంధుడు, సూర్యపుత్రుడగు సుగ్రీవునితో మైత్రి నొనరింపుమని పలికి ఋశ్యమూకమార్గమును జూపి స్వర్గమున కేగెను. రామాయణములో నిట్లున్నది-తదుక్తంరామాయణే.

శ్రూయతాంరామ వక్ష్యామి సుగ్రీవో నామ వానరః
స తే స హాయో మిత్రం చ సీతాయాపరిమార్గణే ఇతి

గ — తస్మిన్నృశ్యమూకమార్గముపదిశ్య స్వర్గంగతే, మతంగాశ్రమవాసిన్యా (తపస్విన్యా) శబర్యా కృతాం సపర్యాం ప్రతిగృహ్య రామస్తదనుజ్ఞయా మనోజ్ఞ వివిధ విహగ కూజితం, మృగగణ విహరణ మహనీరం గహనపద మవగాహ్య, వ్యాకోచ కుశేశయ పరిచయ కషాయైః, వన దేవతాలతా దోలాను కూలైః, కూలాయాత లీలావరవశ వశావల్ల భమదాంబుచుంబిభిః, శంబరారాతి శరధి సదృశతటరుహ సహకార శిఖర విసర దాసవాసార శీకర శీతలైః, వివిధలతా లాసికాలాస్యోపదేశ దేశికాయమానైః, కాయమాన సమానాభోగలతా గృహకేళీలుబ్ధ లుబ్ధక పురంధ్రీ శిథిలధమ్మిల్ల మల్లికా గంధ మాంసలైః, మల్లికాక్ష పక్షవిక్షోభ క్షోదీభూత పాథః పాథేయైః, తట పవనైరనుకమ్ప్యమానః పంపామ భజత 89

ఇతి శ్రీవిదర్భరాజ విరచితే శ్రీమతి చంపూరామాయణే అరణ్య కాండః

అ — తస్మిన్ = ఆ దనుకబంధుడు, ఋశ్యమూకమార్గం = ఋశ్యమూక పర్వతము యొక్క త్రోవను, ఉపదిశ్య = చెప్పి, స్వర్గం గతేసతి = స్వర్గమునకు వెళ్లిన వాడుకాగా. మతంగాశ్రమవాసిన్యా =

మతంగాశ్రమములో నివసించుచున్న (తపస్విన్యా = తాపసియగు) శబర్యా = శబరిచే, కృతాం సపర్యాం = చేయబడిన పూజను రామః = రాముడు ప్రతిగృహ్య = స్వీకరించి. తదనుజ్ఞయా = ఆ శబరి యొక్క అనుమతిచే, మనోజ్ఞ = మనోహరమైన, వివిధ విహగకూజితం = నానా ప్రకారములైన పక్షుల యొక్క కూతలు గలదియు, మృగగణ = లేళ్ల గుంపుల యొక్క విహరణ = విహారముచే, మనోహరం = హృదయానందమును కలిగించునదియు నగు గహనపదం = అరణ్యఖాదమును అవగాహ్య = ప్రవేశించి

వ్యాకోచ = వికసించిన. కుశేశయ = కమలముల యొక్క పరిచయ = సంబంధముతో, కషాయైః = పరిమళించుచున్నవియు, వనదేవతల యొక్క లతాదోలా = తీగెల ఉయ్యలలకు, అనుకూలైః = యోగ్యమైనవియు, కూల = పంపానది యొడ్డున, అయతలీలాపరవశ = అవిచ్ఛిన్న క్రీడా పరతంత్రములైన, వశావల్లభ = కరిణీ నాథుల యొక్క. మదాంబుచుంబిభిః = మదసలిలమునాస్వాదించుచున్నవియును, శంబరారాతి శరధి సదృశాని = పంచబాణుని తూణీరములతో సమానమైన, తటరుహ = ఒడ్లయందు మొలిచిన సహకార-శిఖర = తియ్యమామిడి పూలగుత్తుల నుండి విసరత్ = జారుచున్న, ఆసవాసార శీకర శేఖరైః = మకరందవర్షము యొక్కతుంపరలే శిరోభూషణముగా గలవియు వివిధలతా-లాసికా = పలురకములగు తీగలను నర్తకీమణులకు, లాస్యోపదేశ = మధురనృత్యమును నేర్పుట యందు, దేశికాయమానైః = నాట్యాచార్యులైనట్టివియును, కాయమాన సమాన = మండపముతో సమానమైన ఆభోగ = విస్తారము గల తాగృహ = లతాగృహములయందు కేళీలుబ్ధ = క్రీడాసక్తులైయున్న లుబ్ధపురంధ్రీ = శబరయువతుల యొక్క, శిథిల ధమ్మిల్ల = ఊడిపోయిన కేశపాశముల యందలి- మల్లికాగంధ = మల్లెపూల పరిమళముచే

మాంసలైః = అభివృద్ధిని చెందినట్టివియు, మల్లికాక్ష = హంసల యొక్క, పక్ష = ఱెక్కల యొక్క విక్షేప = ఊపులచే క్షోదీభూత = చూర్ణమైన, పాథః పాథేయైః = ఉదకమనే దారిబత్తెముగలవియును, అగు, తటవన పవనైః = తీరకాంతార మారుతములచే అనుకమ్ప్యమాన= జాలితో చూడబడుచున్నవాడై, పంపాం = పంపానదిని, అభజత = పొందెను.

ఇది శ్రీ విదర్భదేశపు రాజగు భోజునిచే రచింపబడిన శ్రీమంతమగు చంపూ రామాయణములోని అరణ్యకాండము.

తా — ఆ దనుకబంధుడు ఋశ్యమూకమార్గమునుపదేశించి స్వర్గమున కేగెను. రామలక్ష్మణులు మతంగ మహర్షి యాశ్రమమునకు జని, చిరకాలము నుండి రాముని రాకకై వేచియున్న శబరియను శ్రమణిని జూచి ఆమె ఇచ్చునాతిథ్యమును ప్రీతితో స్వీకరించిరి.

శ్రీరాముడామెయనుమతితో తన తమ్మునితో పంపయను పద్మ సరస్సును చేరెను.

మనోహరములై పలురకములగు పక్షుల కలకలారావములు విన వచ్చుచుండెను గుంపులు గుంపులుగా లేళ్లు ఇటునటు తిరుగుచుండెను.

# కిష్కింధాకాండము

ప — సతాం సఖాం బుద్ధిమివ ప్రసన్నాం
పంపాం వియోగజ్వర జాతకమ్పః,
విలోకయన్ లోకనివిష్టకీర్తి
రార్తిం రఘూణాం ప్రవరః ప్రపేదే. 1

అ — నః = విరాధ త్రిశిరో దూషణ ఖర కబంధాదులనయత్నముగ చంపుటచే ప్రసిద్ధ పరాక్రమ సంపన్నుడైన వాడును, లోకనివిష్ట కీర్తిః = జగద్విఖ్యాత కీర్తి సంపన్నుడైన రఘూణాం ప్రవరః = రఘు శ్రేష్ఠుడైన శ్రీరాముడు, సతాం బుద్ధిమివ = సత్పురుషుల యొక్క బుద్ధివలె, ప్రసన్నాం = నిర్మలమైన తాం = సుప్రసిద్ధమైన, పంపాం = పంపానది నివిలోకయన్ = చూచుచు, వియోగజ్వరజాతకమ్పః = సీతా విరహము వల్లనైన సంతాపముతో కలిగిన శరీరకంపము గలవాడై ఆర్తిం = మన్మథవ్యథను ప్రపేదే = పొందెను

తా — రాక్షససంహారం బొనరించి జగద్విఖ్యాతకీర్తిసంపన్నుడైన రఘునాయకుడు, సజ్జనుల చిత్తంబునుంబోలే నిర్మలంబై యున్న పంపానదిని జూచి సీతా వియోగ జ్వరముచే వణుకుచున్న వాడై మన్మథ వ్యథను పొందెను.

వి — ఇచ్చట ఉపజాతి వృత్తము. అరణ్య-శ్లో చూడుడు.

రాముడు తమ్మునితో కూడ—తామరపువ్వులు, కలువ పువ్వులు రకరకాల చేపలు గల పంపానది వద్దకు వెళ్ళి, ఏమియుతోచని వాడై దుఃఖించెనని రామాయణములో నున్నది. తదుక్తం—రామాయణే

సతాం పుష్కరిణీం గత్వా పద్మోత్పలఝషాకులామ్
రామః సౌమిత్రిసహితో విలలాపాకులేన్ద్రియః.

శ్రీమద్రామాయణ కిష్కింధాకాండములోని మొదటి పద్యము యొక్క, సతాం, అనువదముతో భోజుడు కూడ నీకాండను ప్రారంభించుట వాని చాతుర్యమును చాటుచున్నది.

గ — తత స్తస్యా స్తటవనే నానానోకహనివహ పరిష్కృతేనిభృతేతరభ్రమణ పరభృత వ్రాత చంచూమయ విపంచీ సముదంచిత పంచమాంచితా, సంతతాకుంచిత పంచశర శరాసన శరాసార వంచిత పథిక జన సంచార ప్రపంచా ప్రమదభరభరిత చంచరీకకుల కంచుకితమాధవీ మాధవీ విభూతిరుదజృంభత.

అ తతః = తరువాత, తస్యాః = అపంపానది యొక్కతటవనే = తీరారణ్యము నందు- నానా నోకహనివహ = పలురకములగు చెట్లగుంపులలో పరిష్కృతే = అలంకరింపబడినదియు, నిభృతేతరభ్రమణ = అతిచంచలమైన త్రిప్పట కలిగిన, పరభృతవ్రాత = కోకిలల యొక్క చంచూమయ = కంఠములనే, విపంచీ = వీణలనుండి, సముదంచిత = పుట్టిన, పంచమ = పంచమ స్వరముతో అంచితా= మనోహరమైనదియు

సంతత = ఎల్లప్పుడు ఆకుంచిత = ఎక్కు పెట్టబడిన పంచశర శరాసన = మన్మథుని యొక్క ధనుస్సు నందలి శరాసార = బాణ వర్షముతో వంచిత = వారింపబడిన, పథికజన = బాటసారుల యొక్క, సంచారప్రపంచః = రాకపోకలయొక్క ప్రచారముగలదియు ప్రమదభర = సంతోషముతో భరిత = నిండిన, చంచరీకకుల = తుమ్మెదలతో కంచుకిత = చుట్టబడిన, మాధవీ = గురువిందతీగెలుగలదియగు మాధవీవిభూతిః = వసంతునకు సంబంధించిన సంపద, ఉదజృంభత = విజృంభించెను.

తా — తరువాత చూత చాంపేయాది తరువరశోభితంబైన, ఆ పంపాతీరారణ్యములో వసంత లక్ష్మి నడయాడజొచ్చెను. హడావిడిగ తిరుగుచున్న కోకిలలు పంచమ స్వరమును పలుకుచుండెను. పంచ

బాణుడు విరామము లేకుండగ బాణవర్షము ను కురుపించుచుండ. టబాసారులు తమ ప్రయాణమును నిలిపివేసిరి. గురువిందతీగెలమీద వాలిన తుమ్మెదలు మహోత్సాహముతో రొదచేయుచుండెను.

వ — యత్ర కాంతైర్వియుక్తానాం యుక్తానామపి సుభ్రువామ్
దోలాకర్మ వితన్వన్తి మనాంసి చ వపూంషి చ 3

అ — యత్ర = ఏ వసంతసమయము నందు కాంతైః = ప్రియులతో, వియుక్తానాం = విరహమును పొందినవారికిని, యుక్తానాం = కలిసిమెలసియున్నవారైన సుభ్రువామపి = యువతులకు కూడ మనాంసి చ = మనస్సులున్ను, వపూంషిచ = శరీరములున్ను దోలాకర్మ = ఉయ్యాలలూగుటను, వితన్వన్తి = చేయుచున్నవి,

వి — ఇచ్చట శ్లోక వృత్తము: వియుక్తానాం యుక్తానాం అను జంట, మనాంసి-వపూంషి అను జంట పద్యమునకు హృద్యతను కలిగించుచున్నవి,

వ — కరతలైర పచాయమథేక్షణైః
అవచయం చ వనేషు జనేషు చ,
సుమనసాం మనసామపి యద్దినే
విరచయంతి విలోలవిలోచనాః 4

అ — యద్దినే = ఏ మధుమాస దివసము నందు, విలోలవిలోచనాః = చంచలాక్షులు, కరతలైః = హస్తములతో, వనేషు = పూలతోటలలో, సుమనసాం = పువ్వుల యొక్క, అపచాయం = కోయుటను అథ = మఱియు, ఈక్షణైః = చూపులతో, జనేషు = జనుల, మనసాం = మనస్సుల యొక్క, అపచయం = ఆకర్షణమును విరచయన్తి = చేయుచున్నారో.

తా — అప్పుడు చంచలాక్షలు మృదుల కరతలములతో, తోటలలో పువ్వులను కోయుచుండిరి, చూపులతో తోటలలో నున్న పురుషుల మనస్సుల నాకర్షించుచుండిరి.

వి — ఈ శ్లోకములో ద్రుత విలంబిత వృత్తము. దీని లక్షణము అరణ్య-శ్లో లో చూడుడు.

"అపచయం-అపచాయం," "వనేషు-జనేషు,"

"సుమనసాం-మనసాం," అనునీ మూడు జంటలు,

"విరచయంతి విలోల—విలోచనాః" అనునీ అద్యానుప్రాస,శ్లోకమునకు శోభను గూర్చుచున్నవి.

అపచాయము = కోయుట, అపచయము = ఆకర్షించుట.

గ — తస్మిన్ననమశరసమరసమయే, పంపాం సమయా పర్యటన్ పర్యాకుల హృదయో హృదయదయితాం హృది లక్షయన్ లక్ష్మణమిత్థ మభాషత.

అ — తస్మిన్ అనమశరసమరసమయే = ఆ పంచబాణరణ కాలము నందు, పంపాం సమయా = పంపానదికి దగ్గరగా, పర్యటన్= తిరుగుచు పర్యాకులహృదయః = కలతనొందిన మనస్సుగలశ్రీరాముడు హృదయదయితాం = తన ప్రాణేశ్వరియగు సీతను హృది = హృదయములో, లక్షయన్ = చూచుచున్నవాడై, లక్ష్మణం = లక్ష్మణుని గూర్చి ఇత్థమభాషత = ఇట్లు పలికెను.

తా — అయ్యవసరంబున, పంపానదీతీరంబున శ్రీరాముడు పర్యటించుచు, తన ప్రియురాలిని తలచుకొని, వ్యాకులిత చిత్తుడై లక్ష్మణునితో నిట్లనెను.

శ్లో — అథౌ సిద్ధౌషధిరివహితా కేశికాలేసయస్యో

పత్నీ త్రేతాయుజనసమయే క్షత్రియాణ్యేవ యుద్ధే

శిష్యా దేవద్విజ పిత్రుసమారాధనే బంధురార్తౌ

సీతా సామే శిశిరితమహాకాననే కా న జాతా॥ 8

అ — యా = ఏ సీత, అధౌ = మనోవ్యథ కలిగినపుడు, సిద్ధౌషధివ = సంజీవనాద్యోషధి విశేషమువలె, హితా = ఆరోగ్యమును కలిగించునట్టిదో, కేళికాలే = క్రీడాసమయమునందు, వయస్యా = స్నేహితురాలైనట్టిదో, త్రేతాయజనసమయే = ముచ్చిచ్చులయొక్క పూజాకాలమునందు పత్నీ = సహధర్మచారిణియో, యుద్ధే = యుద్ధమునందు క్షత్రియాణ్యేవ = క్షత్రియజాతికి చెందిన వీరాంగన అయియున్నదో, దేవ ద్విజ పిత్రు సమారాధనే = ఇష్టదేవతలకు, వసిష్ఠాబ్రాహ్మణులకు — దశరథ కౌసల్యాదులకు, పూజలొనరించు వపుడు శిష్యా = అంతేవాసినిగా నుండు నట్టిదియో, ఆర్తౌ = బాధకలిగినప్పుడు బంధుః = అనుంగుచుట్టమైయున్నదో, సా సీతా = ఆసీత, శిశిరితమహాకాననే = చల్లని అడవిలో మే = నాకు, కా = ఎవరు నజాతా = కాలేదు.

తా — సీత మనోవ్యథను మాన్పునట్టి సిద్ధౌషధి విశేషము వలె, హితమును గూర్చునది క్రీడాసమయమున విడిచి వెళ్లని స్నేహితురాలు అగ్నిత్రయసాధ్యంబగు యజ్ఞంబున, సహధర్మచారిణి, రణరంగమున నిల్చునపుడు వీరాంగన. దేవతలకు, బ్రాహ్మణులకు; గురువులకు, పితరులకు పూజలొనరించు నవసరంబున, శిష్యురాలు. బాధనను భవించునపుడు, బాధనుబాపునట్టి ఆప్తబంధువు, అట్టి సీత, అడవిలో నెను సుఖముగా కాలము గడుపుటకు అధికముగా నుపయోగించినది.

వి — మందాక్రాన్తావృత్తము. ఇచ్చట అధిశబ్దము - మనోవ్యథను బోధించినను, అధివలన కలుగు వ్యాధికికూడ సూచకము. అధి అనగా మానసికబాధవ్యాధి అనగా శరీరమునకు కలుగు రోగము.అధి

వలన వ్యాధులు కలుగుననని చికిత్సవలన నశించుననని జ్ఞానవాసిష్ఠములో చెప్పబడినది.

తదుక్తం జ్ఞానవాసిష్ఠే-

అధినా వ్యాధయస్తత్ర ద్రవ్యమంత్ర శుభక్రియైః
చికిత్సనాది శాస్త్రోక్తైః నశ్యంతి త్వం చ వే త్సిచ

త్రేతాగ్ని లనగా-అహవనీయాగ్ని— గార్హపత్యాగ్ని-దక్షిణాగ్ని పత్నియనగా భార్య. పత్యురనయా యజ్ఞస్సంపద్యత ఇతి విగ్రహః. భార్య, సహాయముతో భర్త యజ్ఞమునుపూర్తి చేసికొనగలుగుచున్నాడు ఈ శ్లోకము"ఇయం గేహే లక్ష్మీః"అనుభవభూతిగారి శ్లోకమును కొద్దిగా గుర్తుచేయుచున్నది.

వ — మలయగిరిచరోయం మన్మథాధోరణాజ్ఞా
మథితపథికవర్గః మారుత వ్యాళహస్తీ
విరచయతి మదీయే శైత్య సౌరభ్యమాంద్యైః
త్రివిధ మదసమృద్ధో మానసే వప్రలీలామ్ 7

అ — మలయగిరిచరః = మలయాద్రి యందు తిరుగుచున్నదియు మన్మథా ధోరణ = మన్మథుడనే మావటీవానియొక్క ఆజ్ఞా = అజ్ఞతో. మథితపథికవర్గః = మర్దింపబడిన బాటసారులు గలదియును, అగు, అయం మారుతవ్యాళహస్తీ = ఈ మలయమారుతమనే మదపు టేనుగు, శైత్యసౌరభ్యమాంద్యైః = చల్లదనము, పరిమళము,జాడ్యము అను త్రివిధమదసమృద్ధః = మూడురకములగు మదములతోకూడినదియై మదీయే మానసే = నామనస్సునందు వప్రలీలాం = ఉత్పాతకేళిని

విరచయతి = చేయుచున్నది.

తా — మలయమారుతమను మదపుటేనుగు మ
కలయతిరుగుచు, మన్మథుడను మావటి వానియాజ్ఞచే, 
ఇచ్చవచ్చినట్లు త్రొక్కివేయుచున్నది. మఱియు శైత్యము
మాంద్యముఅను ముమ్మదములతో నిండినదియై, సామనస
సరోవరము నందు వప్ర క్రీడను జరుపుచున్నది.

వి — మాలినీవృత్తము ఇచ్చట "శైత్య సౌరభ్య
లతో కూడిన మలయమారుతము (దక్షిణపవనము) బా
బాధించుచునామనస్సును కలవరపరచుచున్నది" అని అతి
కవి చెప్పియున్నాడు. మారుతము నందు మత్తగజత్వమ
థునియందు హస్తిపకత్వమును, శైత్యసౌరభ్యమాంద్యవ
మదత్వమును, ఆరోపించుట కవి యొక్క ప్రతిభను చా
దక్షిణపవనము మలయగిరియందుద్భవించును. మత్తమ
కూడ మలయగిరి యందే యుద్భవించును. హిమవత్
వింధ్యపర్వతము, మలయపర్వతము ఏనుగులకు ఉత్పత్తి
పెద్దలు చెప్పెదరు. తదుక్తం—"హిమవద్వింధ్యమలయాః గ
వానగాః ఇచ్చటవ్యాళ"శబ్దము మదపు టేనుగును బోధించు
హస్తి శబ్దమును కూడ ప్రయోగించుట పునరుక్తము
కరికలభము, కర్ణకుండలము అను పదముల వలె,ఏనుగు
శయమును ప్రకటించుటకట్లు ప్రయోగింపబడినది కనుక పు

గ — ఏవం దుస్సహవిరహాకృశాను (భావ) క
భావసంధుక్షణ విచక్షణ లక్ష్మణవచన ధార్యమాణ ధై

మగ్రత స్సుగ్రీవో విలోక్య వాలి ప్రహితా, న సర్పధియా సుదూరమ
పససర్ప ॥ 8

స తు సమ్మంత్ర్య మంత్రిభిః, తయోరాశయ
మనజిగమిషుః ప్రభంజనాత్మజం ప్రాహిణోత్ ॥ 9

తా — ఏవం = పైన చెప్పినప్రకారము గా, దుస్సహ = సహింప శక్యముగాని, విరహాగ్నిశాను = విరహాగ్ని యొక్క ప్రభావ = వ్యాపారముచే = కృశ = కృశించిన అనుభావం = సామర్థ్యము గలవాడును భావ సంధుక్షణ = స్వభావానుసంధానమునందు విచక్షణం = నేర్పరియగు. లక్ష్మణ = లక్ష్మణుని యొక్క వచన = మాటలచే; ధార్యమాణ = ధరింపజేయబడిన ధైర్యం — ధైర్యము గలవాడును, అగు, రాఘవం = శ్రీరాముని, సుగ్రీవః = సుగ్రీవుడు. అగ్రతః = ముందు భాగములో, విలోక్య = చూచి వాలిప్రహిత = వాలిచే పంపబడిన అపసర్పధియా = గూఢచారియనుభ్రాంతితో సుదూరము, చాలదూరము అపససర్ప = వెడలి పోయెను.

స తు = ఆ సుగ్రీవుడైతే, మంత్రిభిః = మంత్రులతో, సమ్మంత్ర్య = ఆలోచించి, తయోః = ఆ రామ లక్ష్మణుల యొక్క అవజగమిషుః = తెలిసికొనగోరినవాడై ప్రభంజనాత్మజం = వాయుదేవుని కుమారుడైన, హనుమంతుని. ప్రాహిణోత్ = పంపెను.

భా — శ్రీరాముడు విరహాగ్నిచే కృశించియుండెను. ఆలోచనా సామర్థ్యమును గోల్పోయెను కోల్పోయినసామర్థ్యమును తిరిగి కలిగింప గల తనవచన రచనా పాటవముతో, లక్ష్మణుడు రామునకుధైర్యమును కలిగించుచుండెను అట్టి శ్రీరాముని సుగ్రీవుడుచూచి తనయున్నయుగు వాలి యొక్క గూఢచారియై యుండనోపుననియెంచి, తామున్నచోటును

విరచయతి = చేయుచున్నది.

తా — మలయమారుతమను మదపుటేనుగు మలయగిరిమీద కలయతిరుగుచు, మన్మథుడను మావటి వానియాజ్ఞచే, బాటసారులను ఇచ్చవచ్చినట్లు త్రొక్కివేయుచున్నది. మఱియు శైత్యము సౌరభ్యము మాంద్యములను మదోదకములతో నిండినదియై, సామనస్సను మానస సరోవరము నందు వస్త్ర క్రీడను జరుపుచున్నది.

వి — మాలినీవృత్తము ఇచ్చట "శైత్య సౌరభ్యమాంద్యము లతో కూడిన మలయమారుతము (దక్షిణపవనము) బాటసారులను బాధించుచునామనస్సును కలవరపరచుచున్నది" అని అతిరమ్యముగా కవి చెప్పియున్నాడు. మారుతము నందు మత్తగజత్వమును, మన్మ థునియందు హస్తిపకత్వమును, శైత్యసౌరభ్యమాంద్యములయందు మదత్వమున, ఆరోపించుట కవి యొక్క ప్రతిభను చాటుచున్నది, దక్షిణపవనము మలయగిరియందుద్భవించును. మత్తమాతంగములు కూడ మలయగిరి యందే యుద్భవించును. హిమవత్ పర్వతము, వింధ్యపర్వతము, మలయపర్వతము ఏనుగులకు ఉత్పత్తిస్థానములని పెద్దలు చెప్పెదరు. తదుక్తం—"హిమవద్వింధ్యమలయాః గజానాంప్రభ వానగాః ఇచ్చటవ్యాళ"శబ్దము మదపు టేనుగును బోధించు చున్నది. హస్తి శబ్దమును కూడ ప్రయోగించుట పునరుక్తము అయినను, కరికలభము, కర్ణకుండలము అను పదముల వలె,ఏనుగు లోని మదాతి శయముప్రకటిరచుటకట్లు ప్రయోగింపబడినది కనుక పునరుక్తి లేదు,

గ — ఏవం దుస్సహవిరహకృశాను (భావ) కృశాను భావం భావసంధుక్షణ విచక్షణ లక్ష్మణవచన ధార్యమాణ ధైర్యం రాఘవ

మగ్రగత స్సుగ్రీవో విలోక్య వాలి ప్రహితా, వ సర్పధియా సుదూరమ
పససర్ప 8

స తు సమ్మంత్ర్య మంత్రిభిః, తయోరాశయ
మనజిగమిషుః ప్రభంజనాత్మజం ప్రాహిణోత్ 9

అ — ఏవం = పైన చెప్పినప్రకారముగా, దుస్సహ = సహింప శక్యముగాని, విరహక్రశాను = విరహాగ్ని యొక్క ప్రభావ = వ్యాపారముచే) = కృశ = కృశించిన అనుభావం = సామర్థ్యము గలవాడును భావ సంధుక్షణ = స్వభావానుసంధానమునందు విచక్షణం = నేర్పరియగు. లక్ష్మణ = లక్ష్మణుని యొక్క వచవ = మాటలచే ధార్యమాణ = ధరింపజేయబడిన ధైర్యం — ధైర్యము గలవాడును, అగు, రాఘవం = శ్రీరాముని, సుగ్రీవః = సుగ్రీవుడు. అగ్రతః = ముందు భాగములో. విలోక్య = చూచి. వాలిప్రహిత = వాలిచే పంపబడిన అపసర్పధియా = గూఢచారియనుభ్రాంతితో సుదూరము, చాలదూరము అపససర్ప = వెడలి పోయెను.

స తు = ఆ సుగ్రీవుడైతే, మంత్రిభిః = మంత్రులతో, సమ్మంత్ర్య = ఆలోచించి, తయోః = ఆ రామ లక్ష్మణుల యొక్క అవజగమిషుః = తెలిసికొనగోరినవాడై ప్రభంజనాత్మజం = వాయుదేవుని కుమారుడైన, హనుమంతుని. ప్రాహిణోత్ = పంపెను.

తా — శ్రీరాముడు విరహాగ్నిచే కృశి చియుండెను. ఆలోచనా సామర్థ్యమును గోల్పోయెను కోల్పోయినసామర్థ్యమును తిరిగి కలిగింప గల తనవచన రచనా పాటవముతో. లక్ష్మణుడు రామునకుధైర్యమును కలిగించుచుండెను అట్టి శ్రీరాముని సుగ్రీవుడుచూచి తవయన్నయగు వాలి యొక్క గూఢచారియై యుండనోపుననియెంచి, తామున్న చోటును

విడనాడి, క్రొత్త చోటునకు పారిపోయెను.

ఆ సుగ్రీవుడు తనమంత్రులతో కొంతసేపుమంతనములు రామునకు గావించి రామ-లక్ష్మణుల యభిప్రాయమును తెలియగోరి, వాయు నందనుని వారి వద్దకు బంపెను.

వి— మనోవ్యథతోను, మన్మథవ్యథతోను బాధపడుచున్న రామునకు లక్ష్మణుడు ధైర్యమును గలిగించెననుటలో శ్రీరామాయణ మిట్లు చెప్పుచున్నది- ఓరామా! దుఃఖమును దిగ్రమింగుము నీకు భద్రము గలుగు గాక. ఓ పురుషశ్రేష్ఠా? దుఃఖింపకుము, పాపరహితులైననీబోటివారు బుద్ధి మాంద్యమును బొందరాదు, తదుక్తం శ్రీరామాయణే

"సంస్తంభ రామ భద్రంతే మాశుచః పురుషర్షభ?
నేదృశానాం మతిర్మందా, భవత్యకలుషాత్మనామ్.

ప — తపన పవనయోర్యః ప్రాప్తవాన్ పుత్రభావం
శతమఖకృతపాళిర్విద్యయా జన్మనా చ,
స తు దశముఖకీర్తిస్తోమ సోమస్య పక్ష
శ్చరమ ఇవ తనూమాన్ ప్రాప రామం హనూమాన్ ॥

అ యః = ఏ హనుమంతుడు, తపన-పవనయోః = సూర్యునియొక్కయువాయువు యొక్కయు. పుత్రభావం = పుత్రత్వమును, విద్యయా = విద్యచేతను, జన్మనా చ = పుట్టుకచేతను, ప్రాప్తవాన్ = పొందినవాడా యెనో శతమఖ ఇంద్రునిచే కృతపాళిః = జేయబడిన మచ్చగలవాడును దశముఖ = రావణునియొక్క కీర్తిసోమసోమస్య = యశోమండలచంద్రునకు తనూమాన్ చరమః పక్షఇవ = రూపమును ధరించినకృష్ణపక్షము వలె నున్నవాడును అగు స హనూమాంస్తు = ఆ హనుమంతుడు రామం = రాముని ప్రాప = పొందెను.

తా— హనుమంతుడు, పుట్టుకచేతను, చదువుచేతను, వాయువునకు, సూర్యునకును పుత్రుడాయెను. మహేంద్రుని వజ్రాయుధమువకు చిన్నతనములోనే గుఱియై, వామహనుభంగమును పొందియుండెను. అతడు రావణుని కీర్తిచంద్రునకు, తనువునుదాల్చిన కృష్ణపక్షమైయుండెను. అట్టి హనుమంతుడు శ్రీరాముని సమీపమునకు వెళ్ళెను.

వి —హనుమంతుడు సూర్యపుత్రుడెట్లు ? పూజ్యుడగు సూర్యుని వలన వరములను పొంది, వానివలన సకలశాస్త్రములను అధ్యయనము చేయుటచే – హనుమంతుడు సూర్యపుత్రుడైనాడు. ఈ విషయము, ఉత్తరకాండలో నిట్లు చెప్పబడియున్నది. " పూజ్యుడగు సూర్యుడిట్లనెను – వీనికొఱకు – నా తేజస్సుయొక్క శతాంశమును ఇవ్వగలను. ఇతనికి సకలశాస్త్రములు నధ్యయనము చేయుశక్తి కలుగగలదు. ఇతడు సంభాషణనిపుణుడగు వాగ్మికాగలడు. ముల్లోకములలోను వీనితో సమానమైన శాస్త్రవేత్త మఱియొకడుండజాలడు.

శిష్యుడు ఉపాధ్యాయపుత్రుడనుటలో వాలినిగూర్చి శ్రీరాముడిట్లు పలికెను— జ్యేష్ఠసోదరుడు, తండ్రి, చదువుచెప్పిన గురువు అను నీ ముప్వురు ధర్మమార్గవర్తులైనచో పితృపదవాచ్యు లగుచున్నారు. మఱియుకచోట, కన్నతండ్రి, ఉపనయనము చేసినవాడు, చదువు చెప్పినవాడు, భయమునుండి రక్షించినవాడు, అను నీ యైదుగురు తండ్రులుగా చెప్పబడుచున్నారు. తదుక్తం,

" జనితా చోపనేతా చ, యశ్చ విద్యాం ప్రయచ్ఛతి,
అన్నదాతా, భయత్రాతా, పంచైతేపితరస్స్మృతాః. "
" జ్యేష్ఠభ్రాతా పితావాపి యశ్చ విద్యాం ప్రయచ్ఛతి
త్రయస్తే పితరో జ్ఞేయాః ధర్మేచ పథివర్తినః "

కేసరియనువానికి అంజనయను భార్యగలదు. ఆమెయందు వాయువు ఉత్తముడైన పుత్రుని గనెను. కనుక హనుమంతుడు వాయుపుత్రుడు. తదుక్తం — తత్ర రాజా ప్రశాస్త్యస్య కేసరీ నామ వై పితా,

యస్య భార్యా బభూవేష్టాహ్యంజనా నామవిశ్రుతా,
జనయామాస తస్యాంవై వాయురాత్మజముత్తమమ్.

హనుమంతుడు మహేంద్రుని వజ్రఘాతమును చిన్నతనము లోనే భరింపగలిగెను. కనుక గొప్పశక్తిగలవాడు. హనుమంతుడు పుట్టిన వెంటనే సూర్యబింబమును జూచి, రివ్వున ఎగిరి పండను భ్రాంతితో సూర్యబింబమును మ్రింగజూచెను. రాహు వీవిషయమును మహేంద్రునకు తెలియజేయగా మహేంద్రుడు తన వజ్రాయుధముతో హనుమంతుని గట్టిగా కొట్టెను. కొండమీదపడ్డ హనుమకు ఎడమబుగ్గ దెబ్బ తగిలెను. నాటినుండి హనుమంతుడనీ పేరు వచ్చెను. ఇట్టి గుణములుగల వాడగుటవలన నీతడు దూతగానుండుట కర్హుడు. కామందకుడు — దూతయొక్క లక్షణములనిట్లు చెప్పియున్నాడు. పండితుడు, జ్ఞాపకశక్తిగలవాడు, యుక్తియుక్తముగ మాటలాడు వాడు, శస్త్రాభ్యాసము, శాస్త్రాభ్యాసము గట్టిగా చేసినవాడును, దూతగానుండుటకర్హుడు.

యథాహ కామందకః—
ప్రగల్భస్స్మృతిమాన్ వాగ్మీ శస్త్రే శాస్త్రే చ నిష్ఠితః
అభ్యస్తకర్మా నృపతేర్దూతో భవితుమర్హతి

గ — సఏష స్వీకృతభిక్షువేషః సవినయం మేతావా బభాషే 11 భవంతౌ కతరౌ? కాంతాకారౌ కాంతారం కథమిద ముపాతరేతామ్ 12 విచిత్రజిష్ణు కోదండమండితావపి దివసస్యాస్య సుధీపత్వాత్ భవంతౌ న జీమూతౌ 13 జటావల్కలయుతావపి జంగమత్వాత్ భవంతౌ న కల్పవృక్షౌ. తమోపహాలోకకవితావపి యోగవద్వభాస్వర తేజస్విన్ని త్వాత్ భవంతౌ న పుష్పవంతౌ. 15

అ__ న ఏషః = ఆ యీ హనుమంతుడు, స్వీకృత భిక్షువేషః= సన్న్యాసివేషమును ధరించినవాడై, ఏతౌ = ఈ రామలక్ష్మణులను గూర్చి, సవినయం= వినయముతో, అబభాషే=పలికెను, కాంతాకారౌ= మనోహరములగు రూపములుగల, భవంతౌ=మీరిద్దఱు కతరౌ = ఎవరు ఇదం = ఈ దుష్ప్రదేశమైన, కాంతారం = అరణ్యమును, కథం = ఎందు నిమిత్తము, అచాతరతాం = ప్రవేశించిరి? విచిత్రతర = మిక్కిలి ఆశ్చర్యకరములగు, జిష్ణుకోదండ = జయశీలమైన ధనుస్సులతో, మండితావపి = అలంకరింపబడినవారైనను. అస్య దినస్య= ఈ పగలు ( దుర్దినముగాక ) సుదినత్వాత్ = సుదిన మగుటవలన భవంతౌ = మీరు, న జీమూతౌ= మేఘములు కానేరరు. జటావల్కల యుతావపి = జడలను, వల్కలములను ధరించినవారైనను, జంగమత్వాత్ = సంచారశీలురు గనుక, న కల్పద్రుమౌ = కల్పవృక్షములు కానేరరు, తమోపహాలోకకలితావపి = చీకటిని పోగొట్టునట్టి వెలుగుతో కూడినవారైనను, యౌగపద్య = ఒక్కసారి, భాస్వర = ప్రకాశించుచున్న, తేజస్సాన్నిధ్యాత్ = తేజస్సామీప్యముండుటవలన, భవంతౌ= మీరిద్దఱు, న పుష్పవంతౌ = సూర్యచంద్రులు కానేరరు.

తా — భిక్షుకుని వేషమును ధరించి రామలక్ష్మణుల ముందర నిలిచి వినయముతో వారికిట్లనియె. సుందరాకారులైన మీరెవరు? దుష్ప్రవేశంబగు నీ కాననంబునకు రా కతంబేమి? ఆశ్చర్యకరములై, ఇంద్రధనుస్సులవలె నున్న జయశీలంబులగు ధనుస్సులతో నలంకరింపబడిన మీరు, ఈ దినంబు సుదినంబగుటజేసి మీరు మేఘములు గారని నాకు తోచుచున్నది.

జటలను, వల్కలములను ధరించియున్నను మీరు సంచారశీలురగుటంజేసి కల్పవృక్షంబులు కారని తోచెడిని.

అజ్ఞానాంధకారమును పోగొట్టు వెలుగుగలవారైనను, ఒక్కసారి

ఇద్దఱు వెలుగుచుండటం జేసి, పుష్పవంతులని పిలువబడు సూర్య చంద్రులుగారని యనుపించుచున్నది.

వి — హనుమంతుడు భిక్షుకుని వేషమును ధరించి, రామలక్ష్మణులను సమీపించెను. దూతలు యథేచ్ఛముగ వేషములు మార్చుకొన వచ్చును. అది దారుణ ఆచారము గదా!

తదుక్తం శ్రీమద్రామాయణే —

"భిక్షురూపతతో భేజే శఠబుద్ధితయా కపిః"
పుష్పవంతౌ అను నీ పదము సూర్యచంద్రులను చెప్పుచున్నది.
"ఏకయోక్త్యా పుష్పవంతౌ దివాకర నిశాకరౌ" ఇత్యామరః

ప — కుశస్తంభేపి సంభూతం సౌరభ్యమివ భాసతే,
తపోవేషేఽపు సౌన్దర్యం యువయో ర్యువయోగినోః 16

అ — కుశస్తంభేపి = దర్భకాండమునందుకూడ, సంభూత = పుట్టిన, సౌరభ్యమివ = పరిమళమువలె, తపోవేషేఽపి=జటావల్కల ధారణరూపమైన ముని వేషమునందుకూడ యువయోగినోః = తరుణ తపోధనులగు, యువయోః = మీ యిద్దరియందు, సౌందర్యం = రామాణీయకము, భాసతే = ప్రకాశించుచున్నది.

తా — దర్భకాండమునకు సౌరభ్యమబ్బినట్లు బాలయోగులగు మీ యిద్దఱుకు తాపసవేషములో నున్నను, సౌన్దర్యమబ్బినది.

ప — యుష్మద్వార్తా సుధాస్వాదలుబ్ధయోః శ్రోత్రయోస్సుఖమ్,
స్వయమేవ గ్రహీతుం మే జిహ్వా ప్రహ్వాప్రవర్తతే. 17

అ — యుష్మద్వార్తా = మీ వృత్తాంతమనే, సుధాస్వాద = అమృతాస్వాదమునందు, లుబ్ధయోః=ఆసక్తిగల, శ్రోత్రయోః=చెవులకు

సంబంధించిన సుఖం = సుఖమును, స్వయమేవ = స్వయముగా గ్రహీతుం = గ్రహించుటకు మే జిహ్వా = నా నాలుక, ప్రిహ్వా = వినమ్రురాలై ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది.

తా — భవద్వృత్తాంతామృతాస్వాదము నందాసక్తిగల నా చెవులకు సుఖమును సంపాదింపగోరి, నా నాలుక వంగుచున్నది,

గ. — కశ్చిదస్తి వానరపతి స్సుగ్రీవ ఇతి 18

తేన భ్రాతృభయాదృశ్యమూకముపాశ్రితేన యువాభ్యాం సమం సఖ్యమిచ్ఛతా ప్రేషితం హనుమదభిధానం భిక్షురూప ప్రతిచ్ఛన్న మిమంజనం అంజనేయం ప్రభంజనసంజాతం జానీతమితి 19

తతస్తదీయం వచన మాకర్ణ్య, కర్ణయుగళసుధావర్షి దేవర్షిప్రతిమో దాశరథి స్తముపాశ్లిష్య, తద్దర్శితేన పథా, విరచిత భువనసౌఖ్యం, సఖ్యం తవనతనయేన సాకం, అగ్నిసాక్షికమకరోత్, 20

అ — సుగ్రీవ ఇతినామ్నా = సుగ్రీవుడను పేరుతో, కశ్చిత్ = ఒకానొక, సమస్త వానరపతిః — సకలవానర ప్రభువు అస్తి = కలడు.

భ్రాతృభయాత్ = అన్నయగు వాలి భయము వలన ఋశ్యమూకం = ఋశ్యమూక పర్వతమును, ఉపాశ్రితేన = ఆశ్రయించిన వాడును, యువాభ్యాం = మీ యిద్దరితో సఖ్యం = స్నేహమును, ఇచ్ఛతా = కోరుచున్న తేన = ఆ సుగ్రీవునిచే ప్రేషితం = పంపబడిన వాడును హనుమ దభిధానం = హనుమంతుడను పేరు గలవాడును, భిక్షురూప ప్రతిచ్ఛన్నం = సాధువు వేషములో నున్న ఇమం వానరం = మర్కటస్వరూపుడగు ఇమంజనం = వీనిని ప్రభంజన = వాయువు వలన, జాతం = పుట్టిన వానిని గాను, అంజనేయం = అంజనాదేవి యొక్క బిడ్డగాను, జానీతం = తెలిసికొనుడు.

తతః = తరువాత, కర్ణయుగళ = శ్రోత్రద్వంద్వము నందు సుధావర్షి=అమృతమును వర్షించు నట్టిదియు, అనుతదీయం వచనం = హనుమంతుని మాటను, ఆకర్ణ్య విని దేవర్షిప్రతిమః = దేవమునితో సమానుడైనసామిటో దాశరథిః=లక్ష్మణునితో కూడియున్న శ్రీరాముడు తముపాశ్లిష్య =ఆహనుమంతుని కౌగిలించుకొని, తద్దర్శితేన = ఆహను మంతునిచే చూపబడిన పథా = మార్గముతో గత్వా=వెళ్లి, తపనతనయేన సాకం = సూర్యసుతుడగు సుగ్రీవునితో కూడ, విరచిత భువన సౌఖ్యం = కలిగింపబడిన సకలలోక సౌఖ్యముగల, సఖ్యం = మైత్రిని అగ్నిసాక్షికం = అగ్నిసాక్షికముగఅకరోత్ = చేసెను.

తా — వానరులందఱకు ప్రభువైన సుగ్రీవుడను వానరుడొకడు గలడు.

భ్రాతృభయంబున పారిపోయి ఋశ్యమూకముమీద తలదాచు కొన్న సుగ్రీవునిచే నేను పంపబడితిని. అతడు మీయిద్దఱితో సఖ్యమును జేయగోరుచున్నాడు. నేను భిక్షువేషమును ధరించి మీ జాడ తెలియ గోరి వచ్చినాను. నా పేరు హనుమంతుడు. నా తల్లి దండ్రులు అంజనా ప్రభంజనులు. ఇది నావృత్తాంతము.

అటు పిమ్మట, అమృత వర్షమును కురిపించు హనుమంతుని మాటలనువినిదేవర్షితుల్యుడగుదశరథనందనుడుహనుమంతుని బుజముల మీదకూర్చొని వానిచే చూపబడిన త్రోవలో నడచి ఋశ్యమూకమును జేరి ముల్లోకముల కానందమును కలిగించునట్టి సఖ్యమును సూర్య నందనునితో అగ్నిసాక్షికముగ ఏర్పాటు చేసికొనెను.

వి — హనుమంతుని బుజముల మీదనెక్కి, రామలక్ష్మణులు సుగ్రీవుని సమీపమునకుజనిరి. ఈ విషయములో శ్రీరామాయణ మిట్లు చెప్పుచున్నది. తదుక్తం శ్రీరామాయణే

"పృష్ఠమారోప్య తౌ వీరౌజగామ కపికుంజరః."

సకలలోకకంటకుడు రావణుడు. రావణసంహారము వీరిస్నేహము వలన జరుగవలసి యున్నది. కనుక వీరియువురి స్నేహము సకలలోకానందదాయకము. వీరి స్నేహమగ్నిసాక్షికముగ జరిగినది. భగ భగ మండుచున్న అగ్నికి ప్రదక్షిణము గావించి, రాఘవసుగ్రీవులు మైత్రిని పెంపొందించుకొనిరి.

తథా చ శ్రీరామాయణమ్.

"తతోగ్నిం దీప్యమానం తౌ చక్రతుశ్చ ప్రదక్షిణమ్.
సుగ్రీవో రాఘవశ్చైవ వయస్యత్వముపాగతౌ."

స — యోగం వితన్వతి హనూమతి రాఘవస్య
వైవస్వతేన హరిణా సమవర్తినా చ,
మేనే విధిర్ఘటయితుం హరి మింద్రపుత్రం
వైవస్వతేన హరిణా సమవర్తినా చ. 21

అ హనూమతి = ఆంజనేయుడు, రాఘవస్య = శ్రీరామునకు వైవస్వతేన = సూర్యపుత్రుడును, సమవర్తినా = ఎల్లప్పుడు సౌమ్యముతో నుండువాడైన, హరిణా = వానరుడగు సుగ్రీవునితో, యోగం = కలయికను, వితన్వతిసతి = చేసినవాడుకాగా, విధిః = దైవము ఇంద్రపుత్రం = ఇంద్రుని యొక్క కుమారుడును, హరిం = వానరుడునగు వాలిని, వైవస్వతేన = సూర్యుని యొక్క కుమారుడును, సమవర్తినా = అన్ని ప్రాణులయందుసమభావముతో నుండు వాడును అగు, హరిణా = యమునితో ఘటయితుం = కూర్చుటకు మేనే = తలచెను.

తా — హనుమంతుడు శ్రీరామునకు, సూర్య నందనుడును వానరుడును, మిత్రుల యందు, శత్రువుల యందు సమానమగు దండనమును కలిగియుండు వాడునగు సుగ్రీవునితో సంబంధమును కూర్చెను, అప్పుడు బ్రహ్మదేవుడు ఇంద్రనందనుడును వానరుడునగు వాలిని

సూర్యనందనుడను, ప్రాణులకు కర్మానురూపఫలప్రదుండు యముని తో సంబంధమును కూర్పడలచెను. శ్రీరామ సుగ్రీవసఖ్యము వాలిమరణమునకు కారణమయ్యెనని భావము.

వి వసంత తిలకా వృత్తము.

"వైవస్వతేన హరిణా సమవర్తినా చ

వైవస్వతేన హరిణా సమవర్తినా చ" అనునీ రెండు నాల్గవ పాదములు, సమముగా నుండుట చేతను అర్థభేదము కలిగియుండుట చేతను పాదయమకము

గ తతస్తత్ క్షణ సంభూత విస్రంభాయ ప్రతిశ్రుత వాలివధాయ కథిత నిజమన్మథ దశాయ, దాశరథయే సుగ్రీవో దశగ్రీవనీయమాన సీతా పాతితాని కానిచిదాభరణాని న్యదర్శయత్ 22

అ తతః = తరువాత, తత్క్షణ = వెంటనే, సంభూత విస్రంభాయ = కలిగిన నమ్మకము గలవాడును, ప్రతిశ్రుత వాలివధాయ = ఒప్పుకొనబడిన వాలియొక్క వధ గల వాడును, కథితని జమన్మథదశాయ = చెప్పబడిన తనయొక్క మన్మథావస్థ గలవాడును, అగు, దాశరథయే = శ్రీరాముని కొఱకు సుగ్రీవః = సుగ్రీవుడు, దశగ్రీవ = రావణునిచే నీయమాన = తీసికొనిపోబడు, సీతా = సీతచే పాతితాని = పడవేయబడిన, కానిచిదాభరణాని = కొన్ని నగలను న్యదర్శయత్ = చూపించెను

వి - తరువాత సుగ్రీవుడు శ్రీరాముని నమ్మెను శ్రీరాముడు వాలిని చంపగలనని ప్రతిజ్ఞ చేసెను. తన సీతావియోగ వృత్తాంతమును వానికి తెలిపించెను. అప్పుడు సుగ్రీవుడు - రావణాపహృతయగు సీతచే కొండమీద పడవేయబడిన నగలను కొన్నింటిని శ్రీరామునకు చూపించెను

ప — ప్రత్యర్పితానాం కపిపుఙ్గవేన
రామస్స్వకాన్తాధృతభూషణానామ్,
సంస్కారహైన్యాత్ పరిధూసరాణాం
ప్రక్షాళనం బాష్పజలైశ్చకార 23

అ — రామః = శ్రీరాముడు, కపిపుంగవేన = వానరశ్రేష్ఠుడైన సుగ్రీవునిచే, ప్రత్యర్పితానాం = తిరిగి యివ్వబడిన, స్వకాంతా = తన ప్రియురాలగు సీతచే ధృత = ధరింపబడిన భూషణానాం = నగల సంస్కారహైన్యాత్ కడుగుటతుడుచుట అను సంస్కారములేకపోవుటవలన పరిధూసరాణాం = మిక్కిలి దుమ్ము కొట్టుకొనిపోయి యున్నందున బాష్పజలైః = కన్నీటితో, ప్రక్షాళనం = కడుగుటను, చకార = చేసెను.

తా — తనప్రియురాలిచే ధరింపబడి, సుగ్రీవునిచే తన కివ్వబడి నగలు సంస్కారము లేనందున, దుమ్ము కొట్టుకొనియుండెను. వాటిని శ్రీరాముడు తన కన్నీటితో కడిగెను.

గ — తతస్సౌమిత్రిఫణితి నిర్బంధసంధుక్షిత ధైర్యేణ రామే ణానుయుక్తో వాలివైరకారణం భానుసూనురిత్థమ కథయత్,

పురా ఖలు నిఖిలరిపుకుల తిమిర నిచయ మారీచి మాలినం వాలి నం మాయావీనామ దానవః కశ్చన దుందుభేర్భ్రాతా యుద్ధాయ రుద్ధ్వా తద్బలచలిత ధృతి రురగనగరకుహరమగాహత.

అ — తతః = తరువాత, సౌమిత్రి = లక్ష్మణునియొక్క ఫణితి = మాటలవల్లనైన, నిర్బంధ = నిర్బంధము, సంధుక్షిత = ప్రోత్సహింపబడిన, ధైర్యేణ = చిత్తస్థైర్యముగల, రామేణ = శ్రీరామునిచే అనుయుక్తః = ప్రశ్నింపబడినవాడై, భానుసూనుః = సూర్యనందను డగు, సుగ్రీవుడు వాలివైరకారణం = వాలితో విరోధమునకు కారణ మును, ఇత్థం = చెప్పబోవు విధముగ, అకథయత్ = చెప్పెను, పురా ఖలు = పూర్వకాలమునందు, నిఖిలరిపుకుల = సమస్త శత్రు సము దాయమనే, తిమిరనిచయ = గాఢాంధకారమునకు, మరీచిమాలినం = సూర్యుడగు, వాలినం = వాలిని, దుందుభేర్భ్రాతా = దుందుభియను దానవునియొక్క సోదరుడును, మాయావీనామ = మాయావి యను

కశ్చిత్ = ఒకానొక, దానవః = రాక్షసుడు, యుద్ధాయ = యుద్ధము కొఱకు, రుద్ధ్వా = అడ్డగించి; తద్బలచలితధృతిః = ఆ వాలియొక్క బలమువలన పోయిన ధైర్యముగలవాడై, ఉరగనగరకుహరం = పాతాళగుహను, అగాహత = ప్రవేశించెను.

తా — నగలను జూచి శ్రీరాముడు శోకవిహ్వలుడైన తరువాత మహాత్ముడవు, మహానుభావుడవునైన నీవీ విధంబుగ శోకించుట తగిన పనికాదని ఉపలాలనవాక్యములతో లక్ష్మణుడు శ్రీరామునకు ధైర్యమును కలిగించెను. నీకును, వాలికిని వైరం కలుగుటకు కారణంబేమి యని శ్రీరాముడు ప్రశ్నింపగా సుగ్రీవుడిట్లు చెప్పసాగెను.

రాక్షసకులమునకు కడికట్టిడికి సోదర్యుడును, మా యన్నయు నగు వాలిని దుందుభి భ్రాతయగు మాయావియను దానవుడొకడు యుద్ధముసేయు కోరికతో, త్రోవలో వానిని అడ్డగించి వాని ముందు నిలబడుటకు ధైర్యము చాలక, పాతాళగహలో ప్రవేశించెను.

గ —తదను గుహాం గాహమానేనమాన శాలినా, హేమమాలినా వాలినా బిలముఖపాలనాయ, నిహితః, తన్నోత్థానవేళాం పరిపాలయన్ సన్, చిరకాలేஉప్రతీతే ఫేనస్త్యాన మాంస విస్తృతమసృక్పూరమపేక్ష్య భ్రాతా మే నిహత ఇతి నిరచినవమ్. 26

తదను విపులోపల ఫలక పిహితబిలముఖః,
తస్మై దత్వా స్వయము దశ్రు రుదకం నైవాప
మవాపం శోకాంధః కిష్కింధామ్. 27

అథ విదితవృత్తాంతైరమాత్యైరభిషేచితేమయి, సవాలీ మాయా

వినం నిహత్య ఖరతరభుజపరిఘబిలవదనపిధానః, తరసా రసాతలాన్నిర్గత్య పురం ప్రవిష్టోஉతీవరుష్టః, ప్రశ్రష్టాశం బహుశః ప్రణిప

తంతం ప్రతిపాదితయాథాత థ్యమముం జనం నిరాగసమపి నగరాన్ని రకాసయత్. 28

తదను తదను ధావనాత్కాందిశీకస్య మమపర్వతేఽ స్మిన్నుతో భయసంచార కారణమాకర్ణ్యతామ్. 29

పురైకదా వాలిన మతను భుజబలమఖిల—
కులాచలచాలన చతురం చతురర్ణవలంఘనజంఘాలం
దుందుభిర్నామ బృన్దారకారి ర్గలాయుకాయః,
పరిభూయ సమరే సమతిష్ఠత. 30

తదను నిహతస్య తస్య శరీరం వాలీ బలవలేహేన సకలలోక విలయవిలోలలలితా తులబలపవన చలితలఘుతూలలీలయా మతఙ్గాశ్రమక్షితౌ క్షిప మక్షిపత్ 31

అ — తదను = తరువాత, గుహాం = కొండగుహను, గాహమానేన = ప్రవేశించువాడును, మానశాలినా = అభిమానధనుడును, హేమమాలినా = ఇంద్రుడిచే ఇవ్వబడిన బంగారపు గొలుసుగలవాడను అగు, వాలినా = వాలిచే, బిలముఖపాలనాయ = కొండగుహయొక్క ద్వారరక్షణకై, నిహితః = ఉంచబడిన నేను, తస్య = ఆ వాలియొక్క ఉత్థానవేళాం = పునరాగమన సమయమును గూర్చి, పరిపాలయన్ = ఎదురుచూచుచున్నవాడనై, చిరకాలే వ్యతీతే = చాలకాలము గడచిన తరువాత, ఫేనస్త్యాన = నురుగుతో గడ్డకట్టుకొనిపోయిన, మాంస = మాంసముతో, విస్తృత = పర్యాప్తమైన, అస్రపూరం = రక్తప్రవాహమును, అవేక్ష్య = చూచి, మే భ్రాతా = నాయన్నయగు వాలి, నిహత ఇతి = చంపబడెనని, నిరచినవః = నిశ్చయించితిని.

తదను = తరువాత, విపులోపల = విశాలమైన శిలాఫలకముతో, పిహిత=

మూయబడిన బిలముఖః = గుహాద్వారముగలవాడనై, ఉద్రుక్షః = కన్నీరు కార్చుచున్నవాడనై, తస్మై = మా అన్నయగు వాలికొఱకు, నైవాపముదకం = తర్పణసలిలమును, దత్త్వా = ఇచ్చి, శోకాంధః = భ్రాతృవధజనితదుఃఖముతో ఏమియు తోచనివాడనై, కిష్కింధాం = కిష్కింధా నగరమును, అవాపమ్ = చేరితిని, అథ = తరువాత, విదితి వృత్తాంతైః అమాత్యైః = తెలిసికొనబడిన వృత్తాంతముగల మంత్రుల చేత, మయి = నేను, అభిషిచితే = వానరరాజ్యమునందభిషిక్తుడను కాగా, సః వాలీ = మా యన్నగారగు నా వాలి, మాయావినం = మోసగాడగు మాయావియగు నా దానవుని, నిహత్య = చంపి, ఖర తర = మిక్కిలి కఠినములైన, భుజపరిఘ = అరదండా కఱ్ఱలవంటి చేతులతో, విఘటిత = బద్దలు కొట్టబడిన, బిలముఖ పిధానః = బిల ద్వారముయొక్క అచ్ఛాదన శిలాఫలకముగలవాడై, తరసా = వేగ ముతో, రసాతలాత్ = పాతాళలోకము నుండి, నిర్గత్య = బయటకు వచ్చి, పురం = కిష్కింధాపురమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడై, అతీవ రుష్టః = మిక్కిలి కోపించినవాడై, ప్రభ్రష్టాశయం = ఏమి తోచనివాడనై యున్నవాడను, బహుశః = పలుమారులు, ప్రణిపతంతం = కాళ్ళమీద పడుచున్నవాడను, ప్రతిపాదితయథాతథ్యం = చెప్పబడిన నిజముగలవాడను, అయిన ఇమం జనం = నన్ను, నిరాగసం = నిరపరాధినైనను, నగరాత్ = కిష్కింధానగరము నుండి, నిరకాసయత్ = వెడలగొట్టెను.

తదను = వెడలగొట్టిన తరువాత, తదనుధావనాత్ = వాలివెంబడిం చుటవలన, కాందిశీకస్య = భయపడి పారిపోవుచున్న, మమ = నాకు, అస్మిన్ పర్వతే = ఈ పర్వతమునందు, అకుతోభయసంచారకారణం = ఎవరివలనను, ఏవిధమైన భయము లేకుండగా తిరుగుటకు కారణము, ఆకర్ణ్యతాం = వినబడుగాక.

పురా = పూర్వము, ఏకదా = ఒకానొకప్పుడు, అతను = తక్కువగాని, భుజబలం = బాహుబలము గలవాడును, ఖిలకులాచల = సమస్తకుల పర్వతములను, చాలన = కదలించుటయందు, నిపుణం = నేర్పరి యును, చతురర్ణవ = నాలుగు సముద్రములను, లంఘన = దాటుట యందు, జంఘాలం = పిక్కబలము గలవాడును అగు, వాలినం = వాలిని, దుందుభిర్నామ = దుందుభి అనే బలాయ కాయః = ఎనుబోతు రూపముగల, బృందారకారిః = సురవైరియగు, రాక్షసుడు, పరిభూయ = తిరస్కరించి, సమరే = యుద్ధమునందు, సమతిష్ఠత = మరణించెను.

తదను = తరువాత, నిహతస్య, తస్య = చంపబడిన దుందుభి యొక్క, శరీరం = శరీరమును, వాలీ = వాలి, బలావలేపేన = బల గర్వముతో, సకలలోకవిలయ = జగత్ప్రళయమునందు, విలోల = కదలుచున్న, లలిత = వ్యాపనశీలమై అతులబల = సాటిలేనిబలముగల పవన = గాలిచే, చలిత = కదల్పబడిన, లఘుతూలలీలయా = తేలిక యైన పత్తిపింజ రీతిగా, క్షిప్రం = వేగముగా, మతంగాశ్రమక్షితౌ = మతఙ్గాశ్రమసమీప భూమియందు, అక్షిపత్ = పడవేసెను.

జా — తరువాత, మానశాలి, హేమమాలియగు వాలి, బిల ద్వారమును కాపాడుటకు నన్నునిలచి, గుహలో ప్రవేశించెను. మా అన్నయగు వాలిరాకకై, చిరకాలము వేచియుంటిని. నురుగుతో మాంసఘటితో గూడిన రక్తప్రవాహము అవిచ్ఛిన్నముగ గుహనుండి వెలువడ జొచ్చెను. దానిని జూచి మా యన్న మరణించెనని నిశ్చ యించుకొంటిని.

తరువాత, పెద్దపెద్ద శిలాఫలకములతో బిలద్వారమును మూయ గట్టితిని. మరణించిన బాహుబలశాలియగు వాలికొఱకు, కన్నీటితో పాటు ప్రాంజలినై, నివాపాంజలిని భక్తిశ్రద్ధలతో సమర్పించి, కిష్కింధానగరమునకు చేరుకొంటిని.

వివరముగా, విషయమునంతయు విన్న మంత్రులు విషయాంతర విముఖులై కిష్కింధా విషయమునకుగా పరిపాలకుని నొనరించి, పట్టాభిషిక్తుని గావించిరి.

పిమ్మట బాహుబలశాలియగు వాలి మాయావియగు మాయావిని చంపి, తన పీ భుజార్గలతో బిలద్వారమునందలి, మిక్కిలి పొడవు, వెడల్పుగల రాతిబండలను తొలగించి, పాతాళగుహనుండి బయటపడి, కిష్కింధానగరమునకు చేరుకొనెను. బిలమధ్యములో దానవుని చంపబడకుండుట యేమి అని యెంచి బిలద్వారమును గట్టిగా మూసివేసి ఏమియు నెఱుగని వానివలెవచ్చి యీ ద్రోహి రాజ్యసుఖముల ననుభవించుచున్నాడని, తలచి, నిజమును చెప్పినను, వినక, ఏమిచేయువలెనో తెలియక, తికమకపడుచున్న నన్ను, నిరపరాధినని యెంత చెప్పినను వినక, చావగొట్టి కిష్కింధాపురమునుండి తరిమివేసినాడు.

తరువాత మాయన్న నన్ననుసరించి వచ్చుటనుగాంచి, కాందిశీకుడనై, యీ పర్వతమునకు చేరుకొంటిని. ఈ పర్వతముమీద నాకెవ్వరివలన, ఎట్టిభయములేదు. అట్లు జరుగుటకు కారణమొండుగలదు దానిని వినిపించెదను సావధానముగ వినుడు.

మా యన్న భుజబలమింతటిదని చెప్పుట కెవ్వరివలవి కాదు. అతడు కులాచలములనన్నిటిని పెకలించి వేయగలడు. సమస్తసాగరములనొక పరి దాటగలడు. ఇట్టి మహావీరుని దున్నపోతురూపములో నున్న దుందుభియను రాక్షసుడొకడు పరిభవించెను. దానికి కినుక వహించిన మా యన్న వానిని యుద్ధభూమిలో చంపివేసెను.

వాని మృతకళేబరమును బలగర్వముతో మహాప్రళయమారుతము దూదిపింజను ఎగురగొట్టిన భంగి మతంగమహర్షి గారి యాశ్రమ భూమిలో పారవైచెను.

వి — మహేంద్రము, మలయము సహ్యము శక్తిమంతము ఋక్షపర్వతము, వింధ్యము పారియాత్ర అని ఏడు కులాచలములు. తదుక్తమ్—

"మహేంద్రో మలయస్సహ్య శ్శక్తిమాన్ ఋక్షపర్వతః
వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః"

ప — తత్ర వాలికరనున్న నిష్పత
ద్దుందుభిప్రభవ రక్తబిందుభిః
పాటలం తదభవన్మనేర్వనం
తస్య వక్త్రమపి రోషరూషితమ్. 32

అ — తత్ర = ఆసమయమునందు, వాలికరనున్న = వాలియొక్కచేతి ప్రేరితమై, నిష్పతత్ = పడుచున్న, దుందుభి = దుందుభి శరీరమునుండి, ప్రభవ = పుట్టిన, రక్తబిందుభిః = నెత్తురుచుక్కలతో, మునేః = మునీశ్వరునియొక్క, తద్వనం = అయ్యరణ్యము, తస్య = ఆ మునియొక్క రోషరూషితం = కోపముతో పూయబడిన, వక్త్రమపి = ముఖమున్ను, పాటలం = ఎఱ్ఱనైనది, అభూత్ = అయెను.

తా — వాలిచేతులతో నలిపివేయబడినదుందుభి శరీరమునుండి కారిన నెత్తురుచుక్కలతో ఆశ్రమమంతయు ఎఱ్ఱబారెను. క్రోధముతో మహాముని ముఖముకూడ నెఱ్ఱబారెను.

వి — రథోద్ధతావృత్తము.

గ — తతో మతంగశాపబలాత్, అవాలివశ్యమృశ్యమూకం
విమృశ్యాస్మిన్ విస్మృతపురనివాససుఖేమయి, సుచిరం నివసతి సతి. 33

తతః = తరువాత, మతంగశాపబలాత్ = మతంగమహర్షియొక్క శాపబలమువలన, ఋశ్యమూకం = ఋశ్యమూక పర్వతమున్ను, అవాలి

వశ్యం = వాలియొక్క వశముగాని దానినిగా, విమృశ్య = ఆలోచించి, అస్మిన్ = ఈ ఋశ్యమూకమునందు, విస్మృతపురనివాససుఖే = మఱచిపోయిన పట్టణ నివాససుఖము కలవాడనై, మయి = నేను, సుచిరం = చాలకాలము, నివసతిసతి = నివసించుచున్నవాడను కాగా.

తా — తరువాత, మతంగమహాముని శాపవశంబున, వాలి ఋశ్యమూకంబును ప్రవేశింపనేరడని యెంచితిని. నిజపురంబుకంటె, నధికసుఖంబులనిచ్చటనే అనుభవించుచు, చాలకాలము గడిపితిని.

వి — వాలి ఇచ్చట ప్రవేశింపరాదు. ప్రవేశించినచో, చచ్చిపోగలడనునది మతంగశాపము. తదుక్తం శ్రీరామాయణే—

" ఇహానేనాప్రవేష్టవ్యం — ప్రవిష్టస్య వధో భవేత్ "

శ — అయమసుఖయ ద్దేవం దేవ ధీమాన్ హనూమాన్
రిపురితి భవతోఽపి త్రస్త మస్తౌజసం మామ్,
దవహుతవహధూమస్తోమ ఇత్యంబువాహాత్,
చకితమివ మయూరం మారుతో వారిశీతః, 34

అ — హే దేవ = ఓ ప్రభూ ధీమాన్ = ఊహాపోహకుశలుడైన, అయం హనుమాన్ = ఈ హనుమంతుడు, భవతోఽపి = మీ వలనకూడ, రిపురితి = శత్రువు అని, త్రస్తం = భయపడినవాడను, అస్తౌజసం = నష్టతేజస్కుడను అయిన, మాం = నన్ను గూర్చి, వారిశీతః = నీటిచే చల్లనైన, మారుతః = గాలి, దవహుతవహః ఇతి = దావాగ్నియొక్క, (కార్చిచ్చుయొక్క) ధూమస్తోమ ఇతి = పొగయని, అంబువాహాత్ = నీలమేఘమునుండి, చకితం = భయపడిన, మయూరమివ = నెమిలివలె, అసుఖయత్ = సుఖపెట్టెను.

తా — ఓ పత్రిభూ! ఇప్పుడు ధీమంతుడగు నీ హనుమంతుడు మిమ్ముఁ జూచి మాయన్న పంపిన గూఢచారియని భయపడి, తెలివి తప్పి

పాటిపోవుచుంటిని, కార్చిచ్చు నుండి వచ్చుపొగయని, కొబుమబ్బును జూచి పాటిపోవుచున్న నెమిలిని మొయిలు నుండి వచ్చిన చల్లగాలి సంతోషపరచినట్లు సంతోషపరచినాడు.

గ — శ్రుత్వా తురామశ్శోకోదగ్రాం సుగ్రీవగిరం మథయద్వేదం మహాభాగః మాభైషీః మమ శిలీముఖ ఏవ వలీముఖస్య తస్యాసూన్ కాలక్షేపమపాస్య పాస్యతీత్యుక్త్వా తత్ప్రత్యయార్థం పాదాంగుష్ఠేన ప్రేరిత దుందుభికళేబరః, తత్కర్మణా ప్యతృప్తస్య తస్య సుగ్రీవస్య ప్రార్థనయా. సప్తభువనస్తంభసంభావనయా కిం సప్తధాప్రవర్ధ్య మాన పరిణాహారోహాన్ సప్త సాలాన్ అవిధేయ యాతుధాన కులవధ పిధాయకేన సాయకేన వివ్యాధ ౩౫

సోఽయం సాయకో నికటగిరికటకమపి పాటయామాస. ౩౬

అ — అథ = తరువాత, రామః = శ్రీరాముడు శోకోదగ్రాం = శోకబహుళమైన సుగ్రీవగిరం = సుగ్రీవుని మాటను, శ్రుత్వా = విని, హే మహాభాగః = ప్లవంగ మండలసార్వభౌమా? మాభైషీః = భయపడకుము, మమ శిలీముఖ ఏవ = నాబాణమే, తస్య వలీముఖస్య = ఆవాలి యొక్క అసూన్ = ప్రాణములను కాలక్షేపమపాస్య = ఆలస్యము చేయక, (త్వరలో) పాస్యతి = హరింపగలదు. ఇత్యుక్త్వా = అనిపలికి ప్రత్యయార్థం = ఆ సుగ్రీవుని నమ్మకము కొఱకు పాదాంగుష్ఠేన = కాలి బొటనివ్రేలితో, ప్రేరిత = పదియోజనముల దూరము-విసిరి వేయబడిన దుందుభికళేబరః = దుందుభి యొక్క మృతదేహము గలవాడై, తత్కర్మణాపి = కాలిబొటని వ్రేలితో దుందుభిమృతదేహమును దూరముగా విసరి వేయుట చేతనుగూడ అతృప్తస్య = తృప్తిని పొందనటువంటి, తస్య = ఆ సుగ్రీవుని యొక్క ప్రార్థనయా = కోరికతో, సప్తభువన = ఏడులోకములకు వలయు, స్తంభ సంభావనయా =

స్తంభములను తయారు చేయవలెను కోరికతో, సప్తథా = ఏడురక ములుగా, ధాత్రా = బ్రహ్మచే, ప్రవర్ధ్యమాన = వృద్ధిపొందింపబడుచున్న పొడవు వెడల్పు గల సప్తసాలాన్ = ఏడుమద్ది చెట్లను, అపిధేయ-యాతుధానకులవధ-విధాయకేన = దుర్వినీతులగు రాక్షసుల వంశము లను నాశనము చేయునట్టి, సాయకేన = బాణముతో వివ్యాధ = భేదించెను

సోయం సాయకః = ఆ యీ బాణము, గిరికటకమపి = దగ్గఱనున్న పర్వతనితంబమును కూడ, పాటయామాస = బ్రద్దల కొట్టెను.

తా — సుగ్రీవవృత్తాంతమును విన్నపిదప, ఓయీ? భయ పడకుము. నాబాణమే జాగుసేయక వాలి ప్రాణముల నుబలిగొనగలదు' అని చెప్పి శ్రీరాముడు సుగ్రీవునకు నమ్మికను కలిగించుటకై, ఎడమ కాలిబొటని వ్రేలితో దుందుభి కళేబరమును దూరముగా పారవైచెను' సుగ్రీవుడంతటితో సంతృప్తిని చెందనేరడయ్యెను. అంతట సుగ్రీవుని కోరికపై, సప్తభువనములకుస్తంభములనుతయారుచేయుటకై, బ్రహ్మచే ఏడు రకములుగా పోషింపబడుచున్నవియు, మిక్కిలి పొడవువెడల్పు కలిగినవియు, నగు ఏడుమద్ది చెట్లను సకల రాక్షసకుల వధ విధాయ కమగు సాయకములో నరికి వేసెను,

ఆ సాయకముదరిదాపులోనున్న కొండను బ్రద్దలు కొట్టి, భూమిలో ప్రవేశించెను.

వి — సుగ్రీవుడు శ్రీరాముని ప్రభావమును. తెలిసికొనగోరి దుందుభికాయమును జూపెను, దానిని శ్రీరాముడు పాదాం గుష్ఠముతో, ఇషుతూలలీలగా విసరివేసెను, దానితో సంతసింత సింపని సుగ్రీవుడు, కపిస్వభావముతో సప్తసాలములను భేదింపు మనికోరగా, శ్రీరాముడు, నిజకపి స్వభావ్యముచేనితడు నా యొక్క ప్రభావమును తెలిసికొననేరక, సప్తసాల భేదనమును కోరినాడు, దానిని మాత్రమే చేసినచో నాప్రభావమితనికి తెలియుటెట్లని తలచిన

శ్రీరాముడు సప్తసాల భేదనము, దగ్గఱలోనున్న గిరికటకభేదనమును తన హస్తలాఘవమును చూపించుచు, నొక్కబాణముతో జరిపెను. ఈ విషయములో శ్రీమద్రామాయణము–బలాఢ్యుడగు శ్రీరామునిచే విడిచి పెట్ట బడినబాణము సప్తసాలములను భేదించి, గిరికట్టకమును కూడ భేదించి భూమిలో ప్రవేశించెను.

తథా చ శ్రీరామాయణమ్—

"స విసృష్టో బలవతా బాణ స్స్వర్ణ పరిష్కృతః,
భిత్త్వా సాలాన్ గిరిప్రస్థం సప్త భూమిం వివేశహ"

వ — నిర్భిన్నసాలకటకోఽస్మి యథా తథాత్వం
పౌలస్త్యసాలకం యుధి పాటయేతి
ఊచే శిలాదళనజాతరవేణ నూనం
తస్మై వలీముఖవ రాయ శిలీముఖస్సః 37

అ – యథా ఏవిధముగ, అహం = నేను నిర్భిన్నసాలకటకోస్మి= బ్రిద్దలు కొట్టబడిన మద్దిచెట్లుపర్వతని తంబము గలవాడ నైతినో, తథా= అవిధముగ, త్వం = ఓ సుగ్రీవుడా! నీవును పౌలస్త్య సాలకటకం = రావణునియొక్క ప్రాకారనితంబమును, యుధి=యుద్ధములో పాటయ= బ్రద్దల గొట్టుము, ఇతి = అని, శిలాశకల = రాతిముక్కల నుండిజాత= పుట్టిన రవేణ= ధ్వనితోనశిలీముఖః= ఆ రామబాణము వలీముఖవరాయ= వానరశ్రేష్ఠుడగు సుగ్రీవుని కొఱకు ఊచే = పలికెను.

తా ఓ సుగ్రీవా! నేనెట్లు సాలకటకమును భేదించితినోఅట్లే నీవును పౌలస్త్య సాలకటకమును భేదింపుమని పాషాణ విదారణధ్వనితో రామబాణము సుగ్రీవునితోపలికెను.

వి — వసంతతిలకావృత్తము.

అట్టిరామబాణ సామర్థ్యమును కనులార గాంచిన సుగ్రీవునకు సుగ్రీవుడు పరమానోన్మాలి హేమ మాలియునగు వానిని చంపగలడని నమ్మికగలిగెను.

గ — తతస్తత్ప్రియయాదాహూతేన పురుహూతతనయేన సార్థం, తస్య తలాతలియుద్ధే ప్రవృత్తే, సుజనదుర్జనయోర్భేదం రూపతో వివేక్తు మక్షమతయా సదసి వాచం యమతాముపేతఇవ వాగ్మి తయోరవిశేష కర్మణో ర్భేదమనవ గచ్ఛన్న ముక్త శరోఽభూ ద్దాశరథిః 38

సుగ్రీవస్తు వాలిబలానహ తయా లబ్ధదైన్యో వదాన్య ఇవ రామ మార్గణాపాత మార్గేచక్షుర్విక్షిపన్నపగత ధృతిస్స దూరమ పాసరత్ 39

తమేవమృశ్యమూకే మూకపత్రితయా. నిషణ్ణం విషణ్ణ హృదయం దయాళురాలోక్య త్రైలోక్యైకధన్వీ రామ స్తద్భేదమవగన్తు కామః కామవ్యభిజ్ఞానమాలాం సుగ్రీవ గ్రీవాయాం. బాణనివారణ నిపుణాం సిద్ధౌషధిమివ బద్ధ్వా, భూయోఽపివాలినమాహ్వాయా హ్వాయేతి తమాదిదేశ 40

పునరవ్యాహ్వయ తికిష్కింధాం పర్జన్య ఇవగర్జతి తస్మిన్‌సుతారామపహత స్తారాభిహితాం హితోక్తి మతిక్రమ్య దురతిక్రమతయా నియతేస్సమా రబ్ధసమరో దాశరథినిశితతర శరశకలిత వక్షఃస్థలః క్షితితలేపనిపాత 41

అథ విదితవృత్తాంతా, సంతతాశ్రు నిష్యన్ద కలుషతర తారా తారా నగరాన్నిర్గత్య, వారి వారితమివ సారణయూథపతిం, నిర్భయ నిరీక్ష మాణ సుగ్రీవ ముద్గత గ్రీవముత్థాతు మక్షమం క్షమాతలార్పితకూర్పర యుగళం దళ దసృక్ప్రనరశారశరీరం శరాపనశిఖ న్యస్తహస్తేవ

సన్నికర్షస్థితేన కాకుత్స్థేన కృతసల్లాపం, అపేతాడంబరమివాంబునిధిం అస్తోన్ముఖమివ మయూఖమాలినం వాలిన మాలింగ్య స్వాంకోత్తం సిత తదుత్తమాంగా రఘునాథ మిత్థమకథయత్.

అ తతః = మద్దిచెట్లను భేదించిన తరువాత, తత్ప్రిత్యయాత్= అనమ్మిక వలన, అహుతేన = పిలువబడిన పురుహూత తనయేన సార్థం = ఇంద్రు పుత్రునితోకూడ, తస్య = అసుగ్రీవునకు తలాతలి, యుద్ధే = ముష్టియుద్ధము. ప్రవృత్తే= జరుగగా, సుజన దుర్జనయోార్భే దం = మంచివాని యొక్కయు చెడ్డవానియొక్క తేడాను, రూపతః= ఆకారము వలనవివేక్తుం = తెలిసికొనుటకు అక్షమతయా = వీలుకుదురక పోవుటచే, సదసి = నిండుసభలో, వాచంయమతాం = మౌనమును, ఉపేతః = పొందిన వాగ్మీవ = వక్త వలె దాశరథిః = శ్రీరాముడు అవిశేషవేషకర్మణోః= మార్పులేని వేషము చేష్టితము కలిగిన, తయోః= అవాలి సుగ్రీవుల యొక్క భేదం = తేడాను. అనవగచ్ఛన్ = తెలిసికొన లేని వాడై, అముక్తశరః = విడిచి పెట్టబడని ప్రాణము గల వాడాయెను

సుగ్రీవస్తు = సుగ్రీవుడయితే, వాలిబలాసహిష్ణుతయా = వాలి యొక్కబలమును సహింపలేనివాడగుటచే. ర్థదైన్యః = దైన్యమును పొందిన వాడై, వదాన్య ఇవ = దాతవలె, రామమార్గణాపాతమార్గే = రామబాణము పడుమార్గము నందు చక్షుః =కంటిని విక్షిపన్ = ప్రసరింప జేయుచు, అపగతధృతిః = పోయిన ధైర్యముగల వాడై, సుదూరం= చాల దూరము అపాసరత్ = పరుగెత్తెను.

త్రపయా = సిగ్గుతో, ఋశ్యమూకే = ఋశ్యమూక పర్వతము నందు మూకవత్ = మూగవానితో సమానముగ, నిషణ్ణం = కూర్చొని యున్నవాడును, విషణ్ణహృదయం = విషాదాక్రాంతచిత్తుడును అగు తమేనం = అ ఈ సుగ్రీవున్ని దయాళుః = పరమ కారుణికుడును

త్రైలోక్యధన్వీ = జగదేకధానుష్కుడును, అయిన, రామః = శ్రీరాముడు తయోః = వారిద్దఱియొక్క భేదం = భేదము, అవగన్తుకామః = తెలిసికొనగోరిన వాడై, కామపి=ఒకానొక అభిజ్ఞానమాలాం = భేదము తెలియజేయుపూలదండనుసుగ్రీవాగ్రీవాయాం=సుగ్రీవునియొక్క మెడయందు బాణ నివారణనిపుణాం = రామబాణము ను వారించుటయందునేర్పుగల. సిద్ధౌషధిమివ = రక్షా కరండకమును వలె బద్ధ్వా = కట్టి, భూయోపి = తిరిగి, వాలినం = వాలిని ఆహవాయ = యుద్ధముకొఱకు. ఆహ్వయేతి = పిలుపునిమ్మని, తం = ఆసుగ్రీవుని, ఆదిదేశ =అజ్ఞాపించెను.

తస్మిన్ సుగ్రీవే = అ సుగ్రీవుడు, కిష్కింధాం = కిష్కింధా పట్నమును గూర్చి, పునరప్యవాప్య = తిరిగి వెళ్లి, పర్జన్య ఇవ = మేఘునివలెగర్జతిసతిగర్జించుచున్న సువాడుకాగా,త్రిమపుత్రః = ఇంద్రపుత్రుడగు వాలి తారాభిహితాం = తారయను తన భార్యచే చెప్పబడిన హితోక్తిం = మంచిమాటను, అతిక్రమ్య = లెక్క సేయక, నియతేః= దైవయోగము దురతిక్రమతయా = ఉల్లంఘింపరానిదగుటచే సమారబ్ధసమరః = ప్రారంభింపబడిన యుద్ధము గలవాడై దాశరథినిశితతర, శరశకలితవక్షః స్థలః = శ్రీరామునియొక్క మిక్కిలి వాడియైన బాణముచే ముక్కలుగా జేయబడిన ఱొమ్ముగలవాడై, క్షితితలే = నేలమీద నిపపాత = పడెను.

అథ = వాలి నేలమీదకూలిన తరువాత,విదితవృత్తాంతా= తెలిసికొనబడిన వృత్తాంతముగలదియు సంతతాశ్రునిష్యంద = అవిచ్ఛిన్నముగ కన్నీరు కారుటచే కలుషతర = మిక్కిలి దూషితమువైన, తారా= కనుగ్రుడ్లుగల, తారా = వాలి భార్యయగు తార. నగరాత్ = కిష్కింధాపురము నుండి, నిర్గత్య = బయటకు వచ్చి, వారి = కట్టు కఱ్ఱయందు వారితం = కట్టబడిన, వారణయూథపతిమివ = గజయూథ నాథునివలె మన్న వానును, నిర్భయం = భయరహితముగ నిరీక్షమాణ = చూచు

చున్న సుగ్రీవం = సుగ్రీవుడు గలవాడున్ను, ఉద్గాతగ్రీవం = పైకి ఎత్తిన కంఠముగల వాడును, ఉత్థాతుం = పైకిలేచుటకు అక్షమం = శక్తిలేని వాడును, క్షమాతలే = నేలమీద అర్పిత = ఉంచ బడిన కూర్పరయుగళం = మోచేతులు గలవాడును, గళదసృక్ప్రసర= కారుచున్న నెత్తురుధారతో శారశరీరం = కృష్ణరక్తసిత వర్ణముగల శరీరము గలవాడును. శరాసన శిఖర = ధనుష్కోటియందు. న్యస్తహస్తేన = ఉంచబడిన చెయ్యిగల వాడును, సన్నికర్షస్థితేన = దగ్గఱలో నున్న కాకుత్స్థేన కకుత్స్థ వంశోత్పన్నుడగు శ్రీరామునితో కృతసల్లాపం= చేయబడిన సంభాషణముగల వాడును. అపేతాడంబరం = నిస్తరంగ నీరధివోలెనున్న వాడును, అస్తోన్ముఖం మయూఖమాలినమివ = అస్త మింపనున్న సూర్యుని వలెనున్న వాడును. అగు. వాలినం = వాలిని. ఆపీంద్య = కౌగలించుకొని స్వాంకోత్సంసిత తదుత్తమాంగా = తన తొడయం దుంచుకొనబడిన వాలి యొక్క తల కలదియై. రఘునాథం= రఘునాయకుడగు శ్రీరాముని గూర్చి ఇత్థం ఈ చెప్పబోవు ప్రకారముగ అకథయత్ = పలికెను.

తా — సొలసిపారణా సంతరము, దృఢవిశ్వాసముతో పిలువ బడిన, సునాసీర సూనునితో సూర్య సూనునకు—ముష్టి యుద్ధము ఘోరముగా జరిగెను. ఆకారమునుబట్టి "వీడు సజ్జనుడు వీడుదుర్జనుడు అని తెలిసికొనుట కవకాశముండదు గనుక, సమాన వేషభూషా చేష్టిత ములుగల ఆయన్నదమ్ములలోని తేడాను రాముడు కనుగొన జాలడా యెను. కనుక వాలిమీద బాణమును విడిచి పెట్టడాయెను.

సుగ్రీవుడును బలశాలియగు వాలిబలమునుసహింపజాలని వాడై దీనుడై దాతకొఱకుఎదురుచూచుచయాచకునివలె, రామబాణమార్గములో దృష్టిని ప్రసరింపుచు, ధైర్యమును కోల్పోయి చాల దూరము పాఱి పోయెను.

ఋశ్యమూకపర్వతము నందు మూగవాని వలె, విషణ్ణ హృదయుడై నిషణ్ణుడైయున్న సుగ్రీవుని, హృదయాళువు దయాళువునుజగదేకధనుర్ధరుడునైన శ్రీరాముడు కాంచెనుకాంచి,వాలిసుగ్రీవులలోభేదమును తెలియగోరిన వాడై గుర్తింపు మాలనొకదానిని సుగ్రీవుని మెడలో వేసెను అది రామబాణనివారణమునకై ఉంచిన సిద్ధౌషధివలె భాసిల్లుచుండెను తిరిగివాలినియుద్ధమున కాహ్వానింపుమని సుగ్రీవునకాదేశించెను

కిష్కింధా పురమునకేగి. సుగ్రీవుడు "వాలిగీతిరిగి యుద్ధమునకు రమ్మ" ని పర్జన్యునివలె గర్జించెను. "ఇందులో ఏదో కుట్రయున్నది వెళ్లవద్దు నామాట నాలకింపుడ" ని తారతారస్వరముతో మహితమగు హితమును బోధించెను. దైవయోగమెవ్వరికిని దాటరానిదిగాన, ఆమె మాటలను పెడచెవిన బెట్టి, సూర్యనందనునితో సురేంద్రనందనుడు పోరాటమునకు దిగెను. దశరథనందనుడు వాలి వక్షః స్థలము నందు వాడి బాణమును నాటగాఁ బాహుబలశాలి వాలి నేలగూలెను.

వాలి నేలగూలిన తరువాత, వాలిమరణోదంతమును తెలిసికొని కన్నీరు మున్నీరుగా కార్చుచు కిష్కింధ నుండి రణరంగమునకు చెచ్చెర విచ్చేసి అచ్చట నచ్చెరువుతో బాహుబలశాలియగు వాలిని జూచెను. అప్పుడతడు కట్టు కట్టుకు కట్టబడిన గజయూథనాథుని వలె గానవచ్చుచుండెనుఎంతపనిచేసితివనినిర్భయముగతలయెత్తిసుగ్రీవుని వైపుచూచుచుండెను. గట్టిదెబ్బలు తగిలి ఇంద్రియములు పనిచేయక పోవుట వలన, ఎంత ప్రయత్నించినను, లేవ లేకుండెను; మోచేతుల మీద లేచుటకు ప్రయత్నించుచుండెను. రక్తసిక్తగాత్రముతో కృష్ణ రక్తసిత వర్ణుడై తోచుచుండెను. ధనుష్కోటిపైహస్తము నుంచినిలబడిన శ్రీరామునితో మాట్లాడుచుండెను. నిస్తరంగ నీరధివలె అస్తమ్మఖుడగు నంశుమాలి వలె తోచుచుండెను అట్టి వాలిని కౌగిలించుకొని తనతొడ

మీద వాని తలనుంచుకొ-నిశార శ్రీరామునితో నిట్లనియె

వి — విషణ్ణ-నిషణ్ణ—, ఆలోక్య-త్రైలోక్య, అవగంతుకామః కామ(వ్య) (సు, గ్రీవ గ్రీవా (యా.) అనుజంటలను ప్రచారముగాను పయోగించి కవి శబ్దచమత్కృతిని సహృదయుల కందింపగలిగెను.

శ్రీరాముడు గుర్తుకొఱకై సుగ్రీవుని మెడలో గజపుష్పిలతను లక్ష్మణునిచే ధరింపజేసెను. ఈఅంశములో రామాయణములోనిట్లున్నది "కొండమీద మొలిచిన పూలతో కూడిన గజపుష్పిలతను సుగ్రీవుని మెడలో నుంచెను. తదుక్తం శ్రీరామాయణే—

"తతో గిరితటే జాతాం ఉత్పాట్య కుసుమాయుతామ్
లక్ష్మణో గజపుష్పీం తాం, తస్య కంఠే వ్యసరయత్."

ప — కారుణ్యం నిరవధి యత్తవ ప్రసిద్ధం
శీతాంశో స్సహజమివార్తి హారిశైత్యమ్
తత్సర్వం మనుకులనాథ రమ్యకీర్తి
మత్పాపాత్కథయ కథం త్వయా నిరస్తమ్. 43

అ — హే మనుకులనాథ! ఓ మనువంశప్రభూ! రమ్యకీర్తే = ఓ రమణీయకీర్తి సంపన్నుడా? ఓ శ్రీరామా! శీతాంశోః = చల్లని కిరణములుగల చంద్రునకు, సహజం = నైసర్గిక మైనదియు ఆర్తిహారి = పరుల సంతాపమును పరిహరించునట్టి శైత్యమివ = చల్ల దనమువలె, తవ = నీకు సహజం = నైసర్గిక మైనదియు, ఆర్తిహారి = పరుల సంతాపమును పరిహరించు నట్టిదియు, నిరవధి = పరిమాణ శూన్యమైనట్టిదియునగు, యత్కారుణ్యం=ఏ దయకలదో, తత్సర్వం= ఆ దయయంతయు మత్పాపాత్ = నేనొనరించిన దుష్కృతము వలన త్వయా = నీచేత, కథం = ఏ ప్రకారముగ, (ఎట్లు) నిరస్తం= విడిచి పెట్టబడినదో, కథయ = చెప్పుము

తా — ఓ మను వంశనాయకా! కీర్తిసొందా! రామచంద్రా!! చంద్రునకు సంతాపమును పోగొట్టు సహజమైన చల్లదనమువలె, సంతాపమును పోగొట్టు సహజమైన ఏ నీదయాదరమున్నదో అది ఇంకిపోయిందా! అదియు నా మహాపాపఫలమే. [సహర్షిణీవృత్తము

ప — ఏవంవిధే ప్రియతమే వ్యసపేతజీవాం
మాం రాక్షసీతి మునిపుంగవ సాధుబుద్ధ్వా,
బాణం విముంచ మయి సంప్రతి తాటకారే
శ్రేయో మహ ద్దయిత సంగమకారిణ స్తే. 44

అ — హే తాటకారే = తాటకయను రాక్షసిని చంపిన ఓ ఘనముఖుడా! రఘుపుంగవ! = ఓ రఘుశ్రేష్ఠుడా! ప్రియతమే = నా ప్రాణేశ్వరుడు. ఏవంవిధేసతి = ఇటు వంటివాడుకాగా, (ప్రాణరహితుడైనను) అనపేతజీవాం = ప్రాణములతో నున్న మాం = నన్ను రాక్షసీతి = రాక్షసినని సాధు = బాగుగా బుద్ధ్వా = తెలిసికొని, మయి = నాయందు సంప్రతి = ఇప్పుడు, బాణం = బాణమును, విముంచ = విడిచి పెట్టుము దయితసంగమ కారిణ స్తే = ప్రియునితో సమాగమమును కలిగించిననీకు, మహత్ శ్రేయః = గొప్పదియగు అభ్యుదయము లేక పుణ్యము భవిష్యతి = కలుగగలదు.

తా ఓ తాటకారీ, నా ప్రియతముడు మరణించినను, నేను మరణింపకయే ఉన్నాను నేను దయా దాక్షిణ్యములు లేని రాక్షసిని. రాక్షసిని గాన నీవు నామీద నీ బాణమును విడిచి పెట్టుము. నా ప్రియునితో నన్ను చేర్చిన నీకు గొప్ప పుణ్యము కలుగగలదు.

వ — సాధారణీ క్షితిభృతాం మృగయేతి పూర్వం
ఉక్తం త్వయైవ జనసంసది సత్యవాదిన్,

శాఖామృగిం తదిహ మారయ మాంశరేణ
కో నామ రామమృగయు ర్దయతే మృగీణామ్.

అ — హేసత్యవాదిన్ = ఓనిత్యసత్యవ్రతుడా? రామా? క్షితిభృతాం = రాజులకు, మృగయా = వేట, సాధారణీ = సకలసమ్మతమయినది పూర్వం=పూర్వము, త్వయైవ=నీచేతనే, జనసంసది=ప్రజాపరిషత్తులో ఉక్తం = పలుకబడినది, తత్ = అందువలన, ఇహ=ఇప్పుడు శాఖామృగిం=శాఖామృగమునగు నన్ను శరేణ=బాణముతో, మారయ= చంపివేయుము. కో నామ మృగయుః = ఏ వేటగాడు మృగీణాం = ఆడజంతువుల మీద దయతే=దయచూపును.

తా — ఓసత్యవాదీ? రాజులందరకు మృగయ, ముఖ్యమనియు దోషావహము కాదనియు, నీవేనిండు సభలో చెప్పియున్నావు. కనుక శాఖామృగినగు నన్ను నీకఱకుటమ్ముతో కడతేర్పుము. లోకములో మృగముల మీద దయచూపు వేటగాడుండడుగదా?

శ — సంత్రస్య పూర్వమముత స్తవ బంధురేషః
భేజే యథాద్రిమకుతోభయమృశ్యమూకమ్,
భర్తా మమాయమపి రామశరై రభేద్యం
ప్రాప్తో మదీయ హృదయచ్ఛలమద్రి దుర్గమ్. 46

అ — రామ? = ఓరామా, ఏషోయం తవ బంధుః= నీ బంధువగు నీ సుగ్రీవుడు-పూర్వం = పూర్వము, అముతః = వీని వలనవాలివలన సంత్రస్య = భయపడి. అకుతోభయం = ఎవరి వలనభయములేనట్టి ఋశ్యమూకం అద్రిం=ఋశ్యమూక పర్వతమును, యథా=ఎవ్విధముగ భేజే = పొందెనో, తథా = అవ్విధముగ, మమభర్తా అయమపి = నా

భర్తయగు వాలికూడా, శరైరభేద్యం = బాణములతో భేదింపశక్యము గాని, అనగా ఎవరి వలన భయములేనట్టి, మదీయం = నాకు సంబంధించిన హృదయచ్ఛేదం = మనస్సను నెపముగల, అద్రిదుర్గం = కొండమీది కోటను ప్రాప్తః = పొందెను. నన్ను చంపినచో నామనో దుర్గములో నున్న వానిని (వాలిని) కూడ చంపిన వాడవుకాగలవు.

శ — నాహం సుకేతుతనయా న చ సప్తసాలీ
వాలీ న చ త్రిభువనప్రథితప్రభావః
తారాస్మి వజ్రహృదయా విశిఖైరభేద్యా
ధన్వీ కథం భవసి రాఘవ మామవిద్ధ్వా 47

అ — అహం=నేను సుకేతుతనయా = సుకేతునియొక్క కుమార్తె నగు తాటకను, న = కాదు సప్తసాలీ =ఏడు మద్దిచెట్ల గుంపును న చ= కాదు. త్రిభువన = ముల్లోకములయందు ప్రథిత = ప్రఖ్యాతమైన, ప్రభావః = సామర్థ్యముగల, వాలీ= వాలిని, న చ= కాదు విశిఖైః = బాణములతో అభేద్యా = భేదింప శక్యముగాని, వజ్రహృదయా = వజ్రమువలె కఠినహృదయముగల తారాస్మి = తారనయి యున్నాను. రాఘవ! = ఓరామా! మామవిద్ధ్వా నన్ను సంహరింపక, కథం = ఎట్లు ధన్వీ భవసి? = ధనుర్ధారివి కాగలవు?

తా. — అమోఘసాయకా! ఓరఘునాయకా! నేను, బాణములకు భేద్యముగాని వజ్రహృదయముగల తారను. నన్ను నీబాణమునకు గురిచేయలేని నీవుకూడ నా కథానుష్కడవేనా? నన్ను నీవుసామా న్యురాలినిగా భావించుచున్నావేమో! నేను సామాన్యురాలనుగాను, నేను సుకేతు తనయయగు తాటకనుకాను. నీబాణమునకు భేద్యమగు మద్దుల గుంపుగా భావించుచున్నావేమో! ఆ మద్దుల గుంపును గాను, ముల్లో కములలో బాహుబలములో ప్రఖ్యాతుడైన వాలిని కాదు.

ప — క్షితిపతితనయానాం హన్త గర్వేశ్వరాణాం
కిము నిరవధిమౌగ్ధ్యం శౌర్యవజ్జన్మసిద్ధమ్,
మమ హృది నిరపాయే వర్తమానే కపీంద్రే
రఘువర యదముష్మై తిష్ఠసే చాపపాణిః 48

అ — గర్వేశ్వరాణాం = అగర్వ శ్రీమంతులగు, క్షితిపతి తన యానాం = రాచబిడ్డలకు, శౌర్యవత్ = ప్రతాపముతో తుల్యముగ, నిర వధి = హద్దులేని, మౌగ్ధ్యమపి = మూఢత్వముకూడ, జన్మసిద్ధంకిము? సహజమా యేమి? హంత = అయ్యో! యతః = ఎందువల్లనైతే, రఘువర! = ఓ రఘునాయకా? నిరపాయే మమ హృది = ఎట్టి అపాయములేని నా హృదయములో, కపీంద్రే = కపీశ్వరుడగు వాలి, వర్తమానే=ఉంటున్నవాడు కాగా, అముష్మై = ఈ కపీశ్వరుని కొఱకు, చాపపాణిః = ధనుర్ధారివై, తిష్ఠసే = ఉంటున్నావేల ?

తా— ధనుర్ధరా, రఘువరా! అగర్వ శ్రీమంతులగు రాజకుమారు లందఱకు శౌర్యమువలె, మౌఢ్యముకూడ సహజమని నాయభిప్రాయం. ఎందువలననగా, వాలి నా హృదయములో ఏ విధమైన అపాయము లేనివాడై యుండగా కోదండమును చేబూని, వానిని కొట్టుటకు ప్రయ త్నించుచున్నావు. నీవు మూఢుడవుగాక ధీమంతుడ వేలయగుదువు.

గ — ఏవం విలపంత్యా హారాయితాశ్రుధారాయా స్తారాయాః పరిదేవన-రవైః, బాష్పాంబుకణాభ్యుక్షణైః అక్షిభైర్నిశ్వాసానిలైశ్చ కృతాశ్వాస ఇవలబ్ధసంజ్ఞోవాలీ నిజనందనం రఘునందనే సమర్ప్యాంగ దం, అంగసంగినీం కాంచనస్రజం, శోకావనతగ్రీవాయ సుగ్రీవాయ దత్త్వా నిజభుజబలప్రశాంతా సురోఽయం ప్రశాంతాసురభూత్. 49

తత్ర హాసకలభువన బహుమత బాహుబలశాలిన్ గోలభగంధర్వ గంధసింధుర పంచతాకరణ పంచానన దశముఖభుజభుజంగభోగనిరోధా హితుండికాయితవాలవలయవాలిన్ కథం విలయంగితోఽసీతి బాష్ప

విలముఖా వలీముఖాః తస్య రామాజ్ఞయా యథాభిప్రేతం ప్రేతకృత్యం సర్వం నిర్వర్తయామాసుః.

(తతో జాంబవత్ప్రముఖా వలీముఖగణాః దాశరథి నిదేశాత్సుగ్రీవం కాంచన కలశోదకైః రభ్యషించన్.)

అ — ఏవం = ఈ ప్రకారముగ, విలపంత్యాః = దుంఖించుచున్నదియును, హారాయితాశ్రుధారాయాః = ముత్యాలహారమువలె ఆచరించుచున్న కన్నీటిధారగలిగిన, తారాయాః = తారయొక్క పరిదేవనరవైః = రోదనధ్వనిచేతను, బాష్పాంబుకణాభ్యుక్షణైః = కన్నీటితుంపరలయొక్క తడుపుటలచేతను, అక్షీణైః = శ్వాసానిలైః ఛ్ఛ = అవిచ్ఛిన్నములగు నిశ్వాసపవనములచేతను కృతాశ్వాస ఇవ = ఓదార్పబడినవానివలె లబ్ధచైతన్యః = పొందబడిన తెలివిగలవాడై, నిజనందనమంగదం = తనకుమారుడగు నంగదుని, రఘునందనే = శ్రీరాముని కొఱకు, సమర్ప్య = ఒప్పగించి, అంగసంగినీం = తన మెడలోనున్న కాంచన కాంచనస్రజం = ఒక బంగారపుగొలుసును, శోకావనతగ్రీవాయ = దుఃఖముతో వంగిన మెడగల సుగ్రీవాయ = సుగ్రీవుని కొఱకు, దత్త్వా = ఇచ్చి, నిజభుజబల = తన బాహువిక్రమముతో, ప్రశాంతాసురః = చంపబడిన రాక్షసులుగల అయం = మహావీరుడగు వాలి ప్రశాంతాసుః అభూత్ = పోయిన ప్రాణములుగలవాడయ్యెను.

తత్ర = వాలి మరణసమయమునందు, హా = అయ్యో! సకల భువన = సమస్తమైన లోకములకు, బహుమత = ఇష్టమైన బాహుబల = భుజబలముతో, శాలిన్ = ఒప్పుచున్నవాడా? గోలభ గంధర్వ = గోలభ గంధర్వుడనే గంధసింధుర = మదపుటేనుగునకు, పంచతాకరణ = చంపుటలో పంచానన = సింహమైనవాడా? దశముఖభుజభుజంగభోగ = రావణాసురుని చేతులనే పాముపడగలను, నిరోధ = అపుటలో అహితుండి

కొయితే = పాములవానిగా = పరిణమించిన, వాలవలయః = తోక చుట్టగలవాడా? వాలిన్ = ఓ వాలీ! విలయంగతోపి = చనిపోయితివా? ఇతి = అని బాష్పావిలముఖాః = కన్నీటితో కలుషితములైన ముఖములుగల వలీముఖాః = వానరులు, రామాజ్ఞయా = శ్రీరాముని యాజ్ఞతో, తస్య = ఆ వాలికి, యదేప్సితం = యథేచ్ఛముగ, సర్వం ప్రేతకృత్యం = దహనాది ప్రేత సంస్కారమునంతయు, నిర్వర్తయామాసుః = కావించిరి.

(తతః = తరువాత, జాంబవత్ప్రముఖాః = జాంబవంతుడుముఖ్యుగా గల, వలీముఖగణాః = వానర సంఘములు, దాశరథి నిదేశాత్ = శ్రీరాముని యాదేశమువలన, సుగ్రీవం = సుగ్రీవుని కాంచన కలశోదకైః = కనక కలశ సలిలములతో, అభ్యషించన్ = అభిషిక్తుని జేసిరి.)

తా — ముత్యాలహారమువలెనున్న అశ్రుధారతో తార, తారస్వరముతో పెక్కుకాలము విలపించెను. ఆమె రోదనధ్వనితోను, కన్నీటి తుంపరలతోను, నిట్టూర్పులతోను. ఓదార్పు జెందిన వానివలె, వాలి మూర్ఛనుండి తెప్పరిల్లెను, నిజనందనుడగు నంగదుని రఘునందనునకు ఒప్పజెప్పెను. తన మెడలోనున్న బంగారపుగొలుసును శోకముతో తలవంచుకొనియున్న సుగ్రీవున కిచ్చెను. తన బాహుబలముతో ప్రముక్కడి రక్కసులనెందఱినో చంపిన బలశాలియగు వాలి ప్రాణములను విడిచెను.

అయ్యో! అన్నిలోకములలో ప్రసిద్ధిగాంచిన బాహుబలము నీకున్నది గదా! గోలభుడను గంధర్వుని మృగేంద్రము గజేంద్రమును చంపిన మాడ్కి చంపితివిగదా! రావణుని భుజములను భోగభోగములను బంధించుటలో పాములవానివలె నీ వాలము నుపయోగించినది గదా! అట్టి ఓ వాలీ! వీర్యసంపన్నుడవైన నీవుకూడ కాలగర్భములో కలిసిపోతివా?

అని వానరులందఱు చిరకాలము విలపించిరి. శ్రీరాముని యానతి ననుసరించి యథార్హముగ దహనాదిప్రేత సంస్కారములనొనరించిరి.

తరువాత, జాంబవదాది వలీముఖగణములు దశరథ నందనుని యాజ్ఞానుసారము, కనకకలశసలిలములతో సుగ్రీవునకు పట్టాభిషేకము నొనరించిరి.

ప — అభిషిక్తే తు సుగ్రీవే రామ శ్యామ పయోముచా,
అభిషేక్తుం స్థితా మేఘాస్తన్మహీం మహిషీమివ 52

ఆర్యార్యాన్వేషణాకార్యా శరదిత్యుక్తసంవిదా,
కపీంద్రేణార్థితో రామః కిష్కింధావర్తనం ప్రతి 53

నయోగ్యా నగరప్రాప్తిరిత్యుక్తవతి రాఘవే
సుగ్రీవప్రార్థనా ప్యాసీద్భరతప్రార్థనాసమా. 54

దత్తార్జునవికాసేన ధార్తరాష్ట్రాన్నిరస్యతా,
తేన జీమూతకాలేన దేవకీనందనాయితమ్. 55

అ — రామశ్యామపయోముచ = శ్రీరాముడనే నల్లని మేఘముచే సుగ్రీవేతు = సుగ్రీవుడు మాత్రమే, అభిషిక్తే = అభిషేకింపబడగా, తన్మహీం = సుగ్రీవునియొక్క నేలను, మహిషీమివ = పట్టపురాణిని వలె, అభిషేక్తుం = అభిషేకించుటకు (తడుపుటకు) మేఘాః = మేఘములు స్థితాః = ప్రారంభించినవి.

ఆర్య = ఓ ప్రభూ! శ్రీరామా! శరది = శరత్కాలమునందు, ఆర్యాయాః = పూజ్యురాలైన సీతాదేవియొక్క, అన్వేషణా = వెదకుట కార్యా = చేయదగినది, ఇతి = ఈప్రకారముగ, ఉక్త సంవిదా = చేయ

దగినది, ఇతి = ప్రకారముగ, ఉక్తసంవిదా = చేయుబడిన, ప్రతిజ్ఞ గల కపీంద్రేణ = సుగ్రీవునిచే, కిష్కింధావర్తనం ప్రతి=కిష్కింధలో ఉండుటను గురించి, అర్థితః = కోరబడినవాడై, నగరప్రాప్తిః = పట్టణప్రవేశమునయోగ్యా=ఉచితమైనదికాదు, ఇతి = అని, రాఘవే = శ్రీరాముడు, ఉక్తవతిసతి = పలికినవాడుకాగా, సుగ్రీవప్రార్థనాపి = సుగ్రీవునియొక్క కోరికకూడా. భరతప్రార్థనాసమా = భరతునియొక్క కోరికతో సమానమైనదిగా, ఆసీత్ = ఆయెను.

దత్తార్జునవికాసేన = కలిగింపబడిన, కుటజపుష్పముల వికాసము గలదియు, ధార్తరాష్ట్రాన్=నల్లి కాళ్లములను హంసలను, నిరస్యతా= వెడలగొట్టుచున్నదియు, అగు తేన జీమూతకాలేన= ఆ వర్షాకాలముచే, దత్తార్జునవికాసేన=ఇవ్వబడిన. అర్జునుడను పార్థునకు మానసోల్లాసము గలవాడును, ధార్తరాష్ట్రాన్ = ధృతరాష్ట్రుని కుమారులగు దుర్యోధనాదులను, నిరస్యతా = నిరాకరించుచున్నవాడును, అగు దేవకీనందనాయితం = శ్రీకృష్ణునిచేతనువలె, ఆచరింపబడెను.

శ్రీరాముడను నీలమేఘము, సుగ్రీవునకు పట్టాభిషేకము నొనరించెను. అప్పుడు సుగ్రీవుని అధికారములోనున్న భూమిని, సుగ్రీవుని పట్టపురాణినివలె, అభిషేకించుటకు మేఘములు మొదలిడినవి.

అర్యా, శరత్కాలము సీతాన్వేషణమునకు, యోగ్యమైనసమయమని సుగ్రీవుడు నిశ్చయించి, కిష్కింధానగరమునకు దయచేయవలసినదిగా శ్రీరాముని కోరెను. పదునాల్గు సంవత్సరములలో నేను పట్టణములో ప్రవేశింపనని శ్రీరాముడు నొక్కి వక్కాణింపగా, సుగ్రీవుని కోరికయు భరతుని కోరికతో సమానమైనది అయ్యెను.

నల్లనిముక్కులు నల్లని కాళ్లు కలిగియున్న ధార్తరాష్ట్రములను

నామాంతరముగల మల్లికాక్షములను హంసలు మానససరోవరము నకు వెడలిపోయినవి. మద్దిపువ్వులు వికసించినవి. అర్జుననకు మానసో ల్లాసమును కలిగించి, కౌరవులను నిరసించిన శ్రీకృష్ణునివలె వర్షా కాలము ప్రారంభమాయెను.

వ — అస్మాకం రూపలక్ష్మీమసకృదపహసత్యాత్మకాంత్యా తదాస్తాం
భర్తారం న స్సురేంద్రం కిమపి నగణయన్వాలినం ద్రాగ్జఘాన
ఇత్థం మత్త్వేవ వైరం ఝపిదితి ఘనఘటా రాఘవస్యాహవోత్థా
మాశామాశాశ్చ రుద్ధ్వా స్తనితమిష మహాసింహనాదాన్వితేనుః

అ — అస్మాకం = మాయొక్క, రూపలక్ష్మీం = ఆకారశోభను ఆత్మకాంత్యా = తన కాంతితో అనగా ఇంద్రనీలసచ్ఛాయమగు తన దేహచ్ఛాయతో, అసకృత్ = పలుమారులు, అపహసతి = ఎక్కిరించు చున్నాడు. తదాస్తాం=అది దూరముగా నుండుగాక, కింతు=మఱియు నః = మాయొక్క, భర్తారం = ప్రభువగు, సురేంద్రం = దేవేంద్రుని కూడ, న గణయన్= లెక్కింపక, వాలినం = దేవేంద్రుని కుమారుడగు వాలిని, ద్రాక్ = తొందరపడి, జఘాన = చంపెను, ఇత్థం = ఈ ప్రకా రముగ, వైరం = విరోధమును, మత్త్వేవ = తలచినదివలె ఝడితి = తొందరగా, ఘనఘటాః = మేఘబృందములు, ఆహవోత్థాం= యుద్ధముకొఱకు బయలుదేరిన, ఆశాం=కోరికను, ఆశాశ్చ = దిక్కులను కూడ, రుద్ధ్వా = అడ్డగించి, స్తనితమిష = గర్జితములను నెపముగల మహాసింహనాదాన్ = గొప్ప సింహనాదములను, వితేనుః = చేసినవి తత్ర = ఆ సమయమునందు.

తా — ఇతడు తన శరీరకాంతితో మా రూపశోభను పహరించి

పోడు. అది అటుండనిమ్ము. మా ప్రభువగు మహేంద్రునికూడ, లెక్క సేయక, వాని కుమారుడగు వాలినిగూడ సంహరించినాడు. ఇట్లు వైరమును తలచినవివలె, వాని యాశను, దిక్కులనుగూడ వడ్డగించి మేఘములు, ఉరుములను నెపముతో సింహనాదముల నొనరించినవి. ఇచ్చట స్రగ్ధరావృత్తము.

వ — ఉపచిత జీవనధారాః
సత్పథభాజో నిరస్తసంతాపాః,
భూపా ఇవ నవమేఘాః.
పౌరస్త్యమహాబలాకులితాః. 57

అ — ఉపచిత = వృద్ధినొందిన, జీవనధారాః = నీటిధారలు కలవియు, సత్పథభాజః = ఆకాశమార్గమును పొందినవియు, నిరస్తసంతాపాః = ఎండవలన బాధకలవియు, అగు, నవమేఘాః = నూతన మేఘములు ఉపచిత = ధర్మాచరణముచే వృద్ధి నొందింపబడిన, జీవనాధారాః = దీర్ఘాయుష్యము కలవారును, సత్పథభాజః = సత్ప్రవర్తనము గలవారును, నిరస్తసంతాపాః = పోగొట్టబడిన ఆశ్రితజనమనస్సంతాపము గలవారును, అగు భూపాఇవ = రాజులవలె, పౌరస్త్య = తూర్పుదిక్కునందు పుట్టిన, మహాబల = గాలిచే, ఆకులితాః = ఎగరకొట్టబడినవి. పౌలస్త్య = పులస్త్య బ్రహ్మయొక్క కుమారుడగు రావణుని యొక్క, మహాబల = ప్రతాపాతిశయముచే ఆకులితాః = కలవరపరచబడిరి. (రాజులు)

తా — నిరంతర దానశీలురును, సన్మార్గములును, ఆశ్రితజనమనస్సంతాపమును పోగొట్టువారును, అగు రాజకుమారులు, రావణుని సైన్యములచే కలవరపరచబడినట్లు, పరివృద్ధసలిలధారాసంపాతములుగల

వియు, గగనమార్గసంచారులును ఇతరుల సంతాపమును పోగొట్టు నవియు నగు మేఘములు తూర్పుగాలిచే విహ్వలీకృతములయ్యెను.

ఆర్యాచ్ఛందస్సు.

గ— తేన కిల రఘుపతి రతిమాత్రపరివృద్ధమన్యుః, శతమన్యు శరాసన శారతారాపథాం ఘనరవముఖరిత హరిన్ముఖాభోగాం కదమ్బ వన పవనాకమ్పనిరాడమ్బర కాదంబకదంబా మపప్రదకదమ్బ కబళి తామ్బరాం శిలీంధ్ర సంబంధ బంధురవసుంధరాం వికచకుటజ నిచయ కవచిత మహారణ్యాం ప్రావృషేణ్యాం ప్రక్రియాం ప్రేక్షమాణో లక్ష్మణ మిదమభాషత. 58

అ — తేనకిల = ఆ వర్షాకాలముచే, రఘుపతిః = శ్రీరాముడు అతిమాత్ర = మిక్కిలి, పరివృద్ధ = వృద్ధినొందిన, మన్యుః = క్రోధము గలవాడై, శతమన్యుశరాసన = ఇంద్రధనుస్సుచే, శారతర = మిక్కిలి చిత్రవర్ణముగల, తారపథాం = ఆకాశముగలదియు, ఘనరవ = ఘోరు ములచే, ముఖరిత = ప్రతిధ్వనించుచున్న హరిన్ముఖాభోగాం = దిఙ్ముఖ విస్తారము గలదియు, కదమ్బవనపవన = కడిమిచెట్ల గాలిచే, నిరాండ బర కాదంబర కదమ్బాం = కదలని రాయంచ పిండులుగలదియు, అమ్బుద కదంబ కబళితాంబరాం = కారుమబ్బులచే నాక్రమింపబడిన ఆకాశముగలదియు, శిలీంధ్ర సంబంధబంధుర వసుంధరాం = నేలతాడి పువ్వులపొత్తుచే సుందరమైన నేలగలదియు, వికచకుటజనిచయ = వికసించిన కొండమల్లెపూలతో, కవచిత మహారణ్యాం = కప్పబడిన అడవిగలదియు, అగు ప్రావృషేణ్యాం = వర్షాకాలమునకు సంబంధించిన ప్రక్రియాం = విధానమును (రీతిని) ప్రేక్షమాణః = చూచుచున్నవాడై లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి, ఇదం = ఈ చెప్పబోవు దానిని అభా షత = పలికెను.

తా — ఆకసమంతయు హరివిల్లుతో మిక్కిలి చిత్రవర్ణము కలిగియుండెను. దిక్చక్రవాళము భయంకరములగునుఱుములతో మాఱుమ్రోగుచుండెను. కడిమిచెట్లగాలులకు కదలికలేక కలహంసలు కూతలుమాని మౌనముద్రను వహించెను. అంబరమంతయు అంబుదములతో నిండియుండెను.

నేల యంతయు నేలతాడి చెట్లతో నీరంధ్రమైయుండెను వికసించిన కొండమల్లెలతోఅడవియంతయునాచ్ఛాదితమైయుండెనుఇట్టివర్షాకాలపు రమణీయరీతిని జూచి మిక్కిలి కుపితుడైన రఘుపతి తన తమ్మునితో నిట్లనియె.

ప — అయం కాలః కాలప్రమథనగళాభై రభినవైః
అహం యూనాం యూనామపహరతి ధైర్యం జలధరైః
స్మరాధారా ధారా పరిచయ జడా వాన్తి సహసా
నభస్వంత స్స్వాన్తః కథమివ వియోగఃపరిణమేత్ 59

అ — అయం కాలః = ఈ వర్షాకాలము, కాలప్రమథనగళాభైః = మృత్యుంజయుని కంఠచ్ఛాయ వంటిచ్ఛాయగల, అభినవైఃజలధరైః = కాఱుమబ్బులతో అహంయూనాం=నవయౌవన మదోద్ధతులైన,యూనాం = యువకుల యొక్క ధైర్యం = ధైర్యమును, అపహరతి = పోగొట్టు చున్నది.

స్మరాధారాః = మన్మథోద్దీపకములును, ధారాపరిచయజడాః = వర్షధారల యొక్క సంపర్కముచే అతి శీతలములగు నభస్వంతః = గాలులు, సహసా = అతివేగముతో వాంతి = వీచుచున్నవి. స్వాన్తః = శుభావసానమైన వియోగః = విరహదుఃఖము, కథమివ = ఎట్లు, పరిణమేత్ = మాఱునో.

తా కాలకంఠుని కంఠచ్ఛాయగల కాలమేఘములతో నిండినయీ

వర్షాకాలము, నవయౌవనోద్ధతులగు యువకుల ధైర్యమున పహరించు చున్నది.

మన్మథోద్దీపకములును, సలిలధారాసంపర్కశీతలములునగు చల్లనిగాలులు వేగముగా వీచుచున్నవి. శుభావసానమగు నీ వియోగ మెట్లు పరిణమింపనున్నదో తెలియకున్నది.

వి — శిఖరిణీ వృత్తము, మనస్సునకు-ఎట్టివికారము లేకపోవుట యే ధైర్యమని చెప్పబడును తదుక్తమ్—

"మనసో నిర్వికారత్వం ధైర్యమిత్యభిధీయతే"

కాలః కాల,యూనాం యూనాం, ధారా ధారాః,స్వాన్తస్వాన్తః = అను ఛేకానుప్రాస నాలుగు పాదములలో ఎంత గొప్పగానో నిర్వహింప బడినది దీనిచే కవిగారి శబ్దచమత్కృతి తేటతెల్లమగుచున్నది.

వ — మహాసమరసూచకః ప్రతిదిశం మనోజన్మనో
మయూరగళకాకలీ కలకలః సముజ్జృంభతే,
పయోదమలినే దినే పరుష విప్రయోగవ్యథాం
నరేషు వనితాసు వా దధతి కే కాః ఇతి, ౬౦

అ — ప్రతిదిశం = అన్నిదిక్కుల యందు,మనోజన్మః = మన్మథమహావీరుని యొక్క మహాసమర సూచకః = ఘోరయుద్ధమును తెలియజేయునట్టి, మయూరగళ = నెమిళ్ల యొక్క కంఠములనే కాహళీ కలకలః = వాద్యవిశేషముల యొక్క ధ్వనిః సముజ్జృంభతే = మిక్కిలి పెరుగుచున్నది.

పయోదమలినే దినే = వర్షాకాలపు పగళ్లయందు పరుషవిప్రయోగవ్యథాం = కఠినమైన విరహవ్యథను నరేషు = పురుషుల యందు కే = ఎవరు, దధతి = కలిగియున్నారు వనితాసు = స్త్రీలయందు కాః = ఎవరు

దధతి = కలిగియున్నారు. ఇతి = అని, హంత = అయ్యో!

తా — అన్ని దిక్కులయందు,మన్మథ మహావీరుని మహాసమర సూచకమగు మయూరగళకాహళ కోలాహలము విజృంభించుచున్నది. ఈ వర్షాకాలపు వగళ్లలో కఠినవిరహవ్యథను పురుషులలో (కే) ఎవరను భవించుచున్నారు స్త్రీలలో (కాః) ఎ వరనుభవించుచున్నారని.

పృధ్వీవృత్తము.

వ — అమ్భోదరోదర వినిర్గత వారిధారా
సంమర్ద మాంసల సమీర సమీర్యమాణైః,
ఆమోదవీచిదయైః కుటజప్రసూనై
రాకాశమేతదవకాశవిహీన మాసీత్ 61

అ — అంభోధర = మేఘములయొక్క ఉదర= మధ్య భాగము నుండి, వినిర్గత = బయలుదేరిన, వారిధారా = జలధారలతో సమ్మర్ద= యుద్ధముచేయుటలో మాంసల = బలిసిన, సమీర = మారుతములచే సమీర్యమాణైః = పంపబడుచున్న, ఆమోదవీచినిచయైః = పరిమళ పరంపరల యొక్క సముదాయములు గలిగినట్టి, కుటజప్రసూనైః = కొండమల్లెపూలతో ఏతదాకాశం = ఈ ఆకాశము, అవకాశవిహీనం = దట్టమైన, ఆసీత్ = ఆయెను.

తా — మేఘములనుండి అవిచ్ఛిన్న వారిధారలు పడుచుండెను వానితో పోరాటమును సలిపి వాయువు వృద్ధిపొందుచుండెను. ఆవాయువుచే ప్రేర్యమాణములై అవిచ్ఛిన్న గంధ పరంపరలు బయలుదేరుచుండెను. వానిని కలిగియున్న కొండ మల్లెలతో ఆకసమంతయునిండి యుండెను.

వి — వసంతతిలకా వృత్తము.

ప — ఘనశ్యామలపత్రస్య వ్యోమ న్యగ్రోధశాఖినః,
ప్రరోహా ఇవ లక్ష్యన్తే వారిధారా ధరాం గతాః. 62

అ — ధరాంగతాః = నేలమీద పడిన, వారిధారాః = నీటిధారలు ఘనశ్యామలపత్రస్య = మేఘములనే నల్లని ఆకులుగల వ్యోమన్యగ్రోధశాఖినః = ఆకాశమనే మఱ్ఱిచెట్టు యొక్క ప్రరోహా ఇవ = ఊడలవలె లక్ష్యంతే = కనుగొనబడుచున్నవి.

తా — ఘనభోమధ్యభాగములో దండాయమానములైయున్న సలిలధారలు, మేఘములనే ఆకులుగల ఆకాశమను మఱ్ఱిచెట్టు యొక్క ఊడల వలె కన్పట్టున్నవి.

ప — అంభఃపూర సుసంపూర్ణా స్తటస్థతరుపుష్పిణీః
నదీః పశ్యేహ సౌమిత్రే ప్రవృద్ధాశ్చ దినే దినే. 63

అ — హేసౌమిత్రే = ఓ లక్ష్మణా? ఇహ = ఇప్పుడు, అంభఃపూర = జలప్రవాహముతో సుసంపూర్ణాః=బాగుగా నిండిన తటస్థతరుపుష్పిణీః= ఒడ్డున నున్న చెట్ల యొక్క పువ్వులు కలిగినవియు, దినే దినే = ప్రతి రోజు ప్రవృద్ధాః = వృద్ధి నొందుచున్న నదీః = నదులను, పశ్య = చూడుము.

తా జల ప్రవాహములతో నిండినవియు, ఒడ్డున నున్న చెట్లతో ప్రకాశించుచున్నవియునై పొంగి పొర్లుచున్న నదులను ఓ లక్ష్మణా? చూడుము,

ప — అమ్భోధిపానే సలిలేన సాకం
అపీత మౌర్వాగ్ని శిఖాకలాపమ్,
తత్తోదరా వారిధరా వమన్తి
విద్యుల్లతోన్మేషమిషేణ నూనమ్.

అ— అమ్భోధిపానే=సముద్రసలిలములను త్రాగు సమయము నందు, సలిలేనసాకం = నీటితోపాటు, ఆపీతం = త్రాగబడిన, ఔర్వ శిఖాకలాపం = బడబాగ్ని జ్వాలా సముదాయమును, తప్తోదరాః= కాలి పోవుచున్న కడుపులుగలవియై, వారిధరాః= మేఘములు, విద్యుల్లతో న్మేషమిషేణ = మెఱుపుతీగెల యొక్క కాంతులను నెపముతో, వమంతి = వెడలగ్రక్కుచున్నవి.

తా — మేఘములు సముద్రమునుండి నీటిని త్రాగు సమయములో, బడబాగ్నినికూడ మ్రింగివేసినవి. భగభగ మండుచున్న ఆ మేఘములు మెఱుపుతీగెలను నెపముతో బడబాగ్నిని గ్రక్కుచున్నవి సుమా.

గ — ఇత్థం ప్రవృత్తేషు ఘనదివసేషు దాశరథినా కథమపి నీతేషు, తదాకార కాంతిం గమితమివ శనైశ్శనైర్మేఘమండలం పాండు రమభూత్. తస్యచాపవ్యాపారవేళాయాం న సన్నిధాతవ్య మిత్యంత రిక్షాదంతర్హితం కిలపాకశాసన శరాసనమ్. 66

అ — ఇత్థం = ఈ ప్రకారముగ ప్రవృత్తేషు = జరుగుచున్న ఘనదివసేషు = వర్షాకాలపురోజులు, దాశరథినా=శ్రీరామునిచే, నీతేషు= గడపబడినవిగాగా, తదాకార కాంతిం=విరహముతో కృశించిపాలిపోయిన శ్రీరాముని శరీరకాంతిని, గమితమివ=పొందింపబడినదివలె, శనైశ్శనైః= మెల్లిది మెల్లదిగా, మేఘమండలం = మేఘమండలము, పాండు రమభూత్ = తెల్లబారెను,

తా — వానకాలపురోజులను శ్రీరాముడతికష్టముమీద గడిపెను. విరహితుడైన శ్రీరాముని యాకారకాంతిని, తానుకూడ పొందగోరినది వలె మేఘమండలము పాండురవర్ణముగలది ఆయెను. విరహార్తులు పాలిపోవుదురని కవి సమయప్రసిద్ధి.

శ్రీరాముడు తన ధనుస్సును, ఉపయోగించుకాలములో, కాని చప్పటనుండుట స ముచితముకాదని, యెంచి ఇంద్రధనుస్సంతర్హిత మాయెను.

వ — రఘుపతి చాపఘోష సమయో భవితేతి కిల
పువరతముద్భటం ఘనఘటా జనితం స్తనితమ్,
శ్వసితమరుద్భిరస్య విజితః కిల శాంతిమగాత్
పరిచిత కేతకీ కుటజ నీపవనః పవనః. 67

అ — రఘుపతి = శ్రీరామునియొక్క, చాపఘోషసమయః = ధనుష్టంకారకాలము, భవితేతికిల=రాగలదన్నట్లుగ, ఘనఘటాజనితం= కాఱుమబ్బులవలన కలిగిన, ఉద్భటం స్తనితం= విజృంభించిన ఉఱుములు, ఉపరతం = వెనుకబట్టినవి, పరిచిత=పరిశీలింపబడిన, కేతకీ= మొగిలిచెట్లయొక్కయు, కుటజ = మల్లెచెట్లయొక్కయు, నీప = కడిమిచెట్లయొక్కయు, వన=వనములుగల, పవనః=వాయువు అస్య= ఈ శ్రీరామునియొక్కయు, శ్వసితమరుద్భిః = నిశ్వాసవాయువులతో విజితః = ఓడింపబడినదియై, శాంతిమగాత్కిల = ఆగిపోయినదియేమో

తా — రఘుపతి ధనుష్టంకారమును జేయుచున్నాడని తలచి మేఘమండలము తన గర్జనములను మానివేసెను. శ్రీరాముని నిట్టూర్పులతో ఓడింపబడినదివలె, మొగలిపువ్వుల నుండి, కొండమల్లెల నుండి కడిమి పువ్వులనుండి వచ్చు గాలి ఉపశమించెను.

వ — కాలోపశాంతి నట్టవాత్కృతలోకహర్షా
వర్షానటీ గగనరంగతలాత్ప్రయాతా,
అమ్భోదవాద్యమచిరేణ శశామ సర్వం
నిర్వాసితాశ్చ శిఖినైవ దతత్పదీపాః. 68

అ — వర్షానటీ=వర్షాకాలమను నర్తకి, తాపోపశాంతి నటనాత్=సంతాపోపశమను నాట్యమువలన, కృతలోకహానా = జనులకు సంతోషమును కలిగించినదియై, గగనరంగతలాత్=ఆకసమను రంగస్థలము నుండి, ప్రయాతా = నిష్క్రమించెను. సర్వం=సమస్తమైన అమ్భోధ వాద్యమపి = వీణా వేణు మృదగాంది మేఘకృతవాద్యముకూడ, అచిరేణ = త్వరలో శశామ = అగిపోయెను, సహసైవ = వెంటనే, తటిత్ప్రదీపాశ్చ = మెఱుపులను దీపములుకూడ, నిర్వాపితాః = ఆర్పి వేయబడినవి.

తా — వర్షానర్తకి తపోపశమను నాట్యమును నెఱపి ప్రేక్షకులకు హర్షప్రకర్షమును గలిగించి గగనమను రంగస్థలమునుండి ప్రక్కకు తప్పుకొనెను. వీణావేణు మృదగాంది సమస్తవాద్యములనే మేఘగర్జితములుపశమించెను. వెంటనే మెఱుపులనే దీపములార్పివేయబడెను.

గ — క్రమేణ వాహినీతం సకలం భావినీం వానర వాహినీ పూర్తిమసహమానమివ, తనిమాన మభజత. 69

(తథా) దుర్దినాపాయే లంకాయామపి, రాజహంసనిశ్శంక సంచారో భవిష్యతీతిమత్వా కిల భూమ్యామపి సమజని రాజహంస నిశ్శంక సంచారః 70

ఏవం ప్రోషితాయామపి ప్రోషితజనశేముషిముషిప్రావృషి 71

అ — క్రమేణ = క్రమముగ సకలం వాహినీజాతం = నదులన్నియు, భావినీ = రానున్న వానరవాహినీ పూర్తిం = వానరసేనల యొక్క పూరణమును, అసహమానమివ = సహింపలేనిదివలె, తనిమానమభజత=కృశించిపోయెను, (తథా = అదే ప్రకారముగ) దుర్దినాపాయే = వర్షాకాలము గడచిపోగా, లంకాయామపి = లంకాపట్టణము

నందుకూడ, రాజ-హంస నిశ్శంకసంచారః=చంద్రసూర్యులయొక్కయు రామలక్ష్మణులను రాజశ్రేష్ఠులయొక్కయు, నిశ్శంకసంచారః=నిర్భయ సంచారమున్ను, భవిష్యతీతి = కలుగగలదని, మత్వా = తలచినట్లె, భూమ్యామపి = నేలమీదకూడ, రాజహంస = రాజహంసం యొక్క, నిశ్శంక సంచారః = నిర్భయ సంచారము, సమజని = జరిగెను, ఏవం=ఈప్రకారముగ, ప్రోషితజన = దేశాంతరగతులైన, విరహిజనుల యొక్క శేముషీముషి= ధైర్యమును పోగొట్టుకొని, ప్రావృషి = వర్షా కాలము, ప్రోషితాయామపి = జరిగిపోయినను.

**తా — వానరహిని త్వరలో తయారుకాగలదనియెంచి వాహి నులన్నియు (నదులన్నియు) ఎండిపోయెను.**

దుర్దినములు జరిగిపోయిన పిదప లంకా పట్టణములో, రాజశ్రేష్ఠ లగు రామలక్ష్మణుల యొక్కయు, సూర్యచంద్రుల యొక్కయు, నిశ్శంకసంచారము కలుగగలదన బుద్ధితో, భూమిమీదకూడ రాజ హంసల నిశ్శంక సంచారము జరిగెను. విరహిజన వ్యథా జనకమగు వానాకాలము గడచిన పిదప.

వి — రాజహంస నిశ్శంక సంచారశబ్ద ప్రయోగము సచమ త్కారముగ జేయబడినది. ఆకసమునుండి మేఘములు వెడలిపోగా, సూర్యచంద్రులయొక్క నిర్భయసంచారము జరిగెనని ఒక యర్థము,

వానకాలము గడచిన పిదప, రాజశ్రేష్ఠులు జైత్రయాత్రకై నిశ్శంక సంచారము జరుపగలరని మఱియొక యర్థము.

రావణునిచేబాధింపబడిన సూర్యచంద్రులు త్వరలో, లంకరాముని హస్తగతమగుటవలన లంకలో నిర్భయసంచారము జరుపగలరని

ఇంకొక యర్థము. వర్షాకాలము సమాప్తమగుటవలన మానససరోవరములోనుండు రాజహంసలు భూలోకములో ప్రవేశించుచున్నవి యని ఒక యర్థము.

రాజహంసలు వర్షాకాలములో మానస సరోవరమునకు వెడలి పోవును. దుమ్ముతోకూడిన వాననీరు హంసలకు రోగమును కలిగించు వర్షాకాలము వెళ్ళిన పిదప శరత్కాలములో హంసలు మానససరోవరమును విడిచి భూలోకమునకు వచ్చునని ప్రసిద్ధి.

వ — కామక్షిప్తపృషత్కభిన్న హృదయచ్ఛిద్రప్రణాళీగళ
మ్మైత్రీసారలఘౌ ప్రతిశ్రవభరం నిర్వోఢుమప్యక్షమే
సుగ్రీవేచిరసంస్థితాం శమయితుం రాగాంధతాంతాదృశీం
కిష్కింధాం ద్రుత మావ కోపకలుషో రామాజ్ఞయాలక్ష్మణః

అ — కామ = మన్మథునిచే, క్షిప్త = విడిచిపెట్టబడిన, పృషత్క = బాణములచే, భిన్న = విదారితమైన, హృదయ = వక్షస్థలమునందలి ఛిద్రప్రణాళీ = నిర్గమమార్గమునుండి, గళత్ = జారిన, మైత్రీసార = స్నేహముగలవాడగుటచే, లఘౌ = నిస్సారమైనవాడును, (నీచుడును) అగు సుగ్రీవుడు, ప్రతిశ్రవభరం = సీతను వెదకుట యను ఒడంబడికను, నిర్వోఢుం = నిర్వహించుటకు, అక్షమే = అసమర్థుడైన సుగ్రీవుని యందు, చిరసంస్థితాం = చాలకాలమునుండి యున్న, తాదృశీం = అనిర్వాచ్యమైన, రాగాంధతాం = స్త్రీ సంభోగాసక్తిని శమయితుం = పోగొట్టుటకు, రామాజ్ఞయా = రాముని యానతిచే, కోప కలుషః = కోపాక్రాంతాస్వాంతుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, కిష్కింధాం = కిష్కింధనుగూర్చి, ద్రుతం = తొందరగా, ఆవ = వచ్చెను.

తా — మన్మథుని బాణములచే, సుగ్రీవుని హృదయము

చిల్లుపడెను. ఆ చిల్లులనుండి స్నేహసారము జారిపోయెను. సీతను నేను వెదకితెత్తును- అను నోదంబడిక కూడ సుగ్రీవుని నుండి దూర మాయెను. సుగ్రీవుని రాగాంధతమపార ద్రోలగోరిన లక్ష్మణుడు కోపించి శ్రీరాముని యానతిని శిరసావహించి, వెంటనే కిష్కింధకు చేరుకొనెను.

వ — (తావకం భ్రాతరం వా త్వం మామకం వానుగచ్ఛసి,
కిం వా వానర మే తూర్ణం దీయతా ముత్తరం వచః.

అ — త్వం= నీవు తావకం భ్రాతరం = మీ అన్నగారగు వాలిని అనుసరించదలచుకున్నావా? మామకం వా = లేకా మా అన్న గారిని అనుసరించదలచుకున్నావా? హే వానర = ఓ సుగ్రీవా! మే = నాకు, తూర్ణం = శీఘ్రముగా, ఉత్తరం వచః= జవాబు దీయతాం = ఇవ్వ బడుగాక.

తా— ఓ వానరుడా! నీవు మీ అన్నను అనుసరింపదలచినావా, లేక మా అన్నను అనుసరింపదలచినావా? అను నా నూటిప్రశ్నకు సమాధానము సత్వరము కోరబడుచున్నది.)

గ — తతస్సౌమిత్రి రతిపరుష్టః ప్రవిష్ట ఇత్యంగదేన విజ్ఞా పితోపి. అనంగ సంగర సంగత పరిశమా దజాత జాగరః సుగ్రీవః తద్దర్శన త్రాస సంచలిత సకలప్లవగబల కిలకిలాయితేన ప్రబుద్ధ స్సచివయోః ప్లక్షప్రభావనామ్నోం ప్రభావేన పరిశ్రుతః పరిపేదే.

అ — తతః = తరువాత, సౌమిత్రిః = లక్ష్మణుడు, అతిపరుషః= మిక్కిలి కోపించినవాడై, ప్రవిష్టః = కిష్కింధాపురములో ప్రవేశించి నాడు, ఇతి = అని, అంగదేన = వాలికుమారుడైన అంగదునిచే విజ్ఞాపితోఽపి = తెలియజేయబడినవాడైనను, అనంగ సంగర పరి శ్రమాత్ = రతికేళిజనితఖేదమువలన, అజాతజాగరః= మెలకువరాని

వాడై, సుగ్రీవః = సుగ్రీవుడు, తద్దర్శన = లక్ష్మణుని చూచుటవల్ల నైన, త్రాస = భయముతో, సంచలిత = సంభ్రాంతులైన, సకల = సమస్తమైన, ప్లవంగమబల = వానరసేనలయొక్క, కిలకిలాయితేన = కిలకిలధ్వనితో, ప్రబుద్ధః = మేల్కాంచినవాడై, ప్లక్షప్రభావనామ్నోః = ప్లక్షుడు, ప్రభావుడు అను పేర్లుగల, సచివయోః = మంత్రులయొక్క, ప్రభావేన = సామర్థ్యముతో, ప్రకృతిం = పూర్వావస్థను, ప్రపేదే = పొందెను. (మేల్కొనెను)

వి — సుగ్రీవుడు ప్లక్ష-ప్రభావులను మంత్రుల హితోక్తులతో, భీతులైన ప్లవంగముల కిలకిల ధ్వనులతోను నిద్రనుండి మేల్కొనెను. ఈ అంశము శ్రీరామాయణములో నిట్లున్నది. "ఓ వానరరాజా! కోపముతో ఎఱ్ఱబారిన కన్నులు గలవాడు, మహావీరుడునగు శ్రీరాముడు కంటితో కోతులనన్నిటిని తగులబెట్టుచున్న వానివలె ద్వారమునందున్నాడు. బంధుపుత్రులతో వానికి నమస్కరించి వాని కోపమును పోగొట్టుము" తథా చ శ్రీరామాయణమ్—

" సోఽయం దోషపరీతాక్షః ద్వారి తిష్ఠతి వీర్యవాన్,
వానరాన్ వానరపతే చక్షుషా ప్రదహన్నివ,
తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం స పుత్రస్సహ బంధుభిః,
గచ్ఛ శీఘ్రం మహాభాగ, రోషోహ్యస్య నివర్త్యతామ్. "

గ— తతస్తస్మిన్ సుగ్రీవే రాఘవరోషస్య కారణం నిరూపయతి సతి, సద్యఏవ ముఖరి తదిఙ్ముఖోఽభూల్లక్ష్మణస్య జ్యాఘోషః 74

అ — తతః = తరువాత, తస్మిన్ సుగ్రీవే = ఆ సుగ్రీవుడు రాఘవరోషస్య = శ్రీరాముని రోషమునకు కారణం = హేతువును, నిరూప

యతిసతి = ఆలోచించుచున్న వాడు కాగా, సద్యసేవ = వెంటనే లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, జ్యాఘోషః = వింటినారి సవ్వడి, ముఖరిత దిఙ్ముఖః = ప్రతిధ్వనించిన దిక్కులుగలది, అభూత్ = ఆయెను,

తా — తరువాత సుగ్రీవుడు రాముని కోపమునకు కారణమేమి యని ఆలోచించునట్టి యవసరంబున దిక్కులు పిక్కటిల్లునట్లు లక్ష్మణుని వింటినారిసవ్వడి సుగ్రీవునకు శ్రవణగోచరమయ్యెను.

ప — తత్రాసనం ద్రుతమపాస్య పతిః కపీనాం
తత్రాస నమ్రవదనో ఘనచాపఘోషాత్
సంతోషమోక్షమివ భూరి భజన్ భుజంగః
సంతాపనాశపిశునాత్తరుణాభ్రఘోషాత్ ॥ 5

అ — తత్ర = ఆ సమయమునందు, సంతోషమోక్షం భజన్ = సంతోషము లేనివాడై, కపీనాం పతిః = కపీశ్వరుడగు సుగ్రీవుడు ద్రుతం = హడావిడిగా, ఆసనం = సింహాసనమును, అపాస్య = విడిచి పెట్టి, ఘనచాపగోషాత్ = మహాకార్ముకముయొక్క ధ్వనివలన, నమ్రాననః = వంచుకొనబడినతలగలవాడై, సంతాపనాశపిశునాత్ = సంతాపము యొక్క నాశనమును సూచించునట్టి తరుణాభ్రగోషాత్ = నూతనమేఘ గర్జితమువలన, భూరి = అధికముగ, సంతోష-మోక్షం = ఆనందవిఘాతమును, భజన్ = పొందుచున్న, భుజంగఇవ = సర్పమువలె తత్రాస = భయపడెను.

తా — అప్పుడక్కపినాయకుడు ధనుష్టంకారమును విని సింహాసనమునుండి చివాలున లేచి, తలవంచుకొని, గడగడవణుకుచుండెను సంతాపమును తొలగొట్టునట్టి కాలమేఘముల గర్జితమును విని పాము కూడ సంతసమును వీడి, భీతిని పొందును గదా!

గ — తత్ర ప్రతిశ్రుత కార్యప్రోత్సాహనాయ కుపితేన భ్రాత్రా ప్రేషిత ఇతిమారుతినా ధార్యమాణ ధైర్యః, సుగ్రీవ స్సౌమిత్రిం సాన్త్వయితుం తారాం ప్రేషితవాన్. 78

అ తత్ర = భయపడినప్పుడు, ప్రతిశ్రుతకార్య ప్రోత్సాహనాయ = అంగీకరింపబడిన సీతాన్వేషణ కార్యమును ప్రోత్సహించుటకు, కుపితేన = కోపగించిన భ్రాత్రా = సోదరునిచే, ప్రేషిత ఇతి = పంపబడినవాడని, మారుతినా = మారుతాత్మజుడగుహనుమంతునిచే, ధార్యమాణధైర్యః = ధరింపజేయబడిన ధైర్యముగల వాడై సుగ్రీవః = సుగ్రీవుడు సౌమిత్రిం = లక్ష్మణుని, సాంత్వయితుం = బ్రతిమాలుటకు తారాం = తారను ప్రేషితవాన్ = పంపెను.

తా — ఒప్పుకొన్న సీతాన్వేషణ కార్యమును నలుపుటకై అన్నగారిచే పంపబడి లక్ష్మణుడు వచ్చినాడని, అంజనేయుడు సుగ్రీవునకు ధైర్యము గలిగించెను. అప్పుడప్పుడమి జేనిని బ్రతిమాలుటకు, అక్కతులజేడు తారను బంపెను.

వి — సుగ్రీవుడు లక్ష్మణునియెదుటకు తాను వెళ్లుటకు భయపడి మారుతి ధైర్యమును గలిగింపగా, లక్ష్మణుని కోపమును తగ్గించుటకు తారను బంపెను. ఆసందర్భములో శ్రీరామాయణములో నిట్లున్నది.

ఓ ప్రియసీ? నిన్ను జూచిన లక్ష్మణుడు ధైర్యమునుపీడికోపింపనేలడు. మహాత్ములు స్త్రీల విషయమునలో నెన్నడు దారుణమును చేయజాలరు.

తథా చ శ్రీరామాయణమ్—

"త్వద్దర్శన విముక్తాత్మా న స్మకోపం కరిష్యతి
న హి స్త్రీషు మహాత్మానః క్వచిత్కుర్వన్తి దారుణమ్" ఇతి

ప — ద్రాగ్వారుణీ భజననిహ్నుత రాజతేజో
నిష్క్రాన్త తారము పశాంత తమోవికారమ్,
పూర్వాశయా విశతి సత్పథఖాజి మిత్రే
సత్యం నిశాంత సమ మస్య నిశాంతమాసీ

అ — ద్రాక్ = తొందరగా, వారుణీభజన = సురా
నిహ్నుత = కప్పబడిన, రాజతేజః = ప్రభువగు సుగ్రీవ
ప్రతాపము గలదియు, ఉపశాంత తమోవికారం = నివృత్త
వికృియ గలదియు, అగు-అస్య = ఈ సుగ్రీవుని యొక్క
ఇంటిని, మిత్రే = స్నేహితుడును సత్పథభాజి = సన్మా
లక్ష్మణుడు విశతిసతి = ప్రవేశించిన వాడుకాగా.

ద్రాక్ = తొందరగా వారుణీభజన = వరుణపాలిత
మటి దిక్కును సేవించుటచే నిహ్నుత = కప్పబడిన రాజతే
ప్రకాశముగలదియు,నిష్క్రాన్త తారం = పోయిన నక్షత్రము
ఉపశాంత తమోవికారం = నశించిన అంధకారము గలదియ
ఖాజి = ఆకాశమార్గ సంచారియగు మిత్రే = సూర్యుడు పూ
తూర్పు దిక్కునభిప్రాయముతో విశతి సతి = ప్రవే
కాగా. నిశా = రాత్రియొక్క అంత = చివరతో సమం = స
ఆసీత్ = ఆయెను

తా. సురాపానముచే సుగ్రీవుని ప్రతాపము ప్రచ్ఛాదిత మా
బయటకు వచ్చెను. సుగ్రీవుని మోహవికారము తగ్గిపోయెన
చేసిన ప్రతిజ్ఞను నెఱవేర్పుమని సన్మార్గగామియు
లక్ష్మణుడు–సుగ్రీవుని యింటికి చేరెను. సుగ్రీవుని గృహప
తెల్లవారుటకూడ జరిగెను. సూర్యుడు పడమటి దిక్కునకు
చంద్రుని తేజస్సు ప్రచ్ఛాదిత మాయెను. నక్షత్రము

కనబడకుండగ బోయెను. కటిక చీకటి మాయమయ్యెను. తూర్పు దిక్కునందు మిత్రపదవాచ్యుడును, అకాశ మార్గ సంచారియునగు ప్రవేశించుచుండెను. కాన సుగ్రీవుని గృహము నిశాంత (నిశాంతము) తుల్యమాయెను.

గ — సా తు రామా రామానుజ మసాద్య చైవ మహోచత.

అ సా తు రామా = తారయను నాసుందరి, రామానుజం = రాముని యొక్క తమ్ముడగు లక్ష్మణుని, అసాద్య = పొంది, ఏవం = చెప్పబోవు విధముగ, అహోచత = పలికెను.

తా — అంతట తారార లక్ష్మణుని చెంతకు చేరివానితో నిట్లనియె

ప - ప్రాచీనం వ్యసనం సురేంద్రతనయా జ్జాతంవనేభ్రామ్యత
సుగ్రీవస్య నిరాకృతం ఖరరిపో ర్బాణేన సాలచ్ఛిదా
అద్యాస్య వ్యసనం తుపంచవిశిఖా దాసీదుపేన్ద్రాత్మజా
త్సౌమిత్రే తదపి ప్రశాన్త మభవ జ్జ్యాఘోషమాత్రేణ తే 79

అ — సురేంద్రతనయాత్ = వాలి వలన జాతం = కలిగిన వనే భ్రామ్యతః = అడవిలో తిరుగుచున్న-సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క ప్రాచీనం వ్యసనం = పురాతనమైన విపత్తు, సాలచ్ఛిదా = ఏడుమద్ది చెట్లను ఒక్కసారిగ ఛేదించిన, ఖరరిపోర్బాణేన = శ్రీరాముని యొక్క బాణముచే నిరాకృతం = పోగొట్టబడినది

అద్యతు = ఇప్పుడయితే, ఉపేంద్రాత్మజాత్ = ఇందుని తమ్ముకొడుకైన, పంచవిశిఖాత్ మన్మథునివలనవ్యసనం = వ్యసనము (స్త్రీ వ్యసనము) అసీత్ = కలిగెను, హే సౌమిత్రే = ఓ లక్ష్మణుడా? తదపి = అస్త్రీవ్య సనమున్ను, తే = నీయొక్క, జ్యాఘోషమాత్రేణ = వింటినారిసవ్వడిచేతనే ప్రశాంతమభవత్ = సమసిపోయెను.

తా — సుగ్రీవునకు రెండు విపత్తులు వాటిల్లినవి అందు మొదటి

విపత్తు ఇంద్రుని కుమారుడగు వాలి వలన కలిగినది. ఆ విపత్తు ఏడు మద్దిచెట్లను ఒక్కసారిగ కూల్చిన రాముని బాణముచే పోగొట్టబడినది

అందు రెండవ విపత్తి ఉపేంద్రుని కుమారుడగు మారునిచే కలిగినది. అది రాముని తమ్ముడవగు నీ యొక్క వింటిసారిచే పోగొట్ట బడినది. శార్దూల విక్రీడిత వృత్తము.

గ — తదనన్తరం తారాసాంత్వవచనప్రశాంతకోపేన సౌమిత్రిణా సాకం తపనతనయః సవినయమాశ్రిత్య ప్రాంజలిర్వ్యజిజ్ఞపత్ 80

దేవ? కపిబలి మఖిలకులాచలనిలయమనిలతన యేనాహూతం పురహూత ఇవ పులోమజాపహారిణమనుహ్లాదం రావణం రణే నిహనిష్య సీతి 81

అ — తదనంతరం = పిమ్మట, తారాసాంత్వవచన ప్రశాంత కోపేన = తారయొక్క సాంత్వన వచనములచే శమించిన కోపముగల సౌమిత్రిణా సాకం = లక్ష్మణునితో కూడ, తపనతనయః = సుగ్రీవుడు సవినయం = వినయ పూర్వకముగ, దాశరథిం = శ్రీరాముని, ఆశ్రిత్య ప్రాంజలిః = అంజలిని ఘటించిన వాడై, వ్యజిజ్ఞపత్ = (ఇట్లు) విన్న వించెను.

దేవ! = ప్రభూ? శ్రీరామా? అఖిలకులాచలనిలయం = సమస్త కులాచలములు నెలవుగా గల కపిబలం = వానర సైన్యము, అనిలతన యేన = వాయు నందనుడగు, ఆంజనేయునిచే, అహూతం = పిలువ బడినదియై, పులోమజాపహారిణం = శచీదేవిని అపహరించిన, అను హ్లాదం = అనుహ్లాదుడను రాక్షసుని పురుహూత ఇవ = ఇంద్రుడు వలె రావణం=రావణునిత్వం నీవురణే= యుద్ధము నందు,నిహనిష్యసి = చంప గలవు; ఇతి = అని

తా — తారావచనశ్రవణా నంతరము, ఆమెసాంత్వవచనములతో లక్ష్మణుని కోపము నన్నగిల్లెను. అప్పుడు సూర్య నందనుడు, దశరథ నందనుని సమీపించి అంజలి ఘటించి వినయావనతుడై, వానితో నిట్లనియె.

ప్రభూ! సమస్తకులాచలముల మీద నివాసము చేయుచున్న కపిబల మంతయు ఆంజనేయునిచే పిలువబడినది.

శచీ దేవిని అపహరించిన అనుహ్లాదుడను

రాక్షసుని మహేంద్రుడు రణరంగములో చంపినట్లు, నీవును సీతాదేవిని అపహరించిన రావణుడను రాక్షసుని రణరంగములో చంప గలవు.

ప — క కుభికులిశ పాణేర్నైఖిలీం తాం విచేతుం
విసతమథ దిశాయాం మారుతిం ప్రేతభర్తుః,
వరుణదిశి సుషేణం యక్షరాజాంచితాయాం
హరితి శతవలించ ప్రాహిణోద్వానరేన్ద్రః 82

అ — తతః = తరువాత, వానరేంద్రః = సుగ్రీవుడు, తాం = రావణునిచే అపహరింపబడిన సీతాం = సీతను విచేతుం = వెదకుటకు

కులిశపాణేః కకుభి = ఇంద్రునియొక్క దిక్కునకు అనగా తూర్పు దిక్కునకు, వినతం = వినతుడను వానర సేనాధిపతిని

అథ = తరువాత, ప్రేతభర్తుః దిశాయాం = యముని యొక్క దిక్కునకు, అనగా దక్షిణ దిక్కునకు మారుతిం = వాయు నందనుడగు హనుమంతునిన్ని,

వరుణదిశి = వరుణుని యొక్క దిక్కునకు అనగా పడమట దిక్కునకు, తనమామయగు-సుషేణం = సుషేణుడను సేనాధిపతిని

యక్షరాజాంచి తాయాం హరిత = కుబేరుని దిక్కునకు అనగా ఉత్తరదిక్కునకు, శతవలించ = శతవలియను వానర నాయకునిన్ని ప్రాహిణోత్ = పంపెను.

తా — అంతటసుగ్రీవుడు సీతాదేవిని వెదకుటకు, తూర్పుదిక్కునకు వినతుడను సేనాపతిని, దక్షిణ దిక్కునకు తనమామయగు సుషేణుని ఉత్తర దిక్కునకు శతవలియనునొక సేనానాయకునిన్ని పంపెను.

మాలినీ వృత్తము.

గ — తదను దివసేషు కేషుచిద్గతేషు, మాసాతి పాతనాసహో ని యతముదగ్ర దండ స్సుగ్రీవ ఇతి సత్వర మితరదిగన్తర ప్రేషితేషుచ ప్లవంగ బలేషు ప్రతినివృత్తేషు, పితృపతి హరితి ప్రేషితా మారుతి జాంబవ దంగదనలనీల ప్రభృతయో౽ప్యలబ్ధ సీతో పలబ్ధయః, తనయ వినాశకుపిత కండుశాప నిశ్శేషిత చరాచరం, అపరిచిత చారప్రాంతరం కాంతారం క్రాంత్వా, కస్మింశ్చిత్కాన్తారే అసురమేకం నిరీక్ష్య రక్షః పతిరితి బుద్ధ్వా యుద్ధసన్నద్ధా బభూవుః

అ — తదను = తరువాత, కేషుచిద్దివసేషుగతేషు = కొన్ని రోజులు గడచినవికాగా, మాసాతిపాతాసహః = నెల రోజులు దాటుటను సుగ్రీవుడు సహింపజాలడనియు, ఉదగ్రదండ స్సుగ్రీవ ఇతి = చండ శాసనుడనియు, సత్వరం = వెంటనే ఇతరదిగంతర = దక్షిణదిక్కును, మినహాయించి మిగతా దిక్కులకు ప్రేషితేషు = పంపబడిన ప్లవంగబలేషు =

వానర సైన్యములు ప్రతిని వృత్తేషు = తిరిగి వచ్చినవారుకాగా, పితృపతిహరితి = దక్షిణదిక్కునకు ప్రేషితాః = పంపబడిన, మారుతి–జాంబవత్ అంగద నల నీల ప్రభృతయః = హనుమంతుడు, జాంబవంతుడు' అంగదుడు నలుడు నీలుడు మున్నుగా గల వారుకూడ అలబ్ధ సీతోపలబ్ధయః = పొందబడని సీతా సాక్షాత్కారము గల వారై తనయ = కుమారుని యొక్క నాశ = మరణముచే కుపిత = కోపించిన కండు = కండుమహర్షి యొక్క శాప = శాపముచే నిశ్శేషిత = పూర్తిగా నశింపజేయబడిన, చరాచరం = చెట్లు పిట్టలు పుట్టలుగల వియునగు, అపరిచిత చార ప్రాంతరం = ప్రాణిసంచార రహితమైన, నికట ప్రదేశము గల, కాంతారం = అడవిని, క్రాంత్వా = దాటి కాస్మింశ్చిత్కాంతారే = మఱియొక అడవిలో ఏకమసురం = ఒకానొక రాక్షసుని, నిరీక్ష్య = చూచి రక్షన పతిరితిబుద్ధ్యా = రాక్షస రాజగు రావణునిగా తలచి, (వానితో) యుద్ధాసన్నద్ధః బభూవుః = పోరాడుటకు ప్రయత్నించిరి.

తా — కొన్ని రోజులు గడచినవి. నెలరోజులలో సీతోదంతమును తెలియ జేయనిచో సుగ్రీవుడు తీక్ష్ణదండమును విధింపగలడనితెలిసియు అన్ని దిక్కులకు వెళ్ళి ప్లవంగ బలములన్నియు తిరిగి కిష్కింధకు చేరుకొన్నవి దక్షిణ దిక్కునకు వెళ్ళిన హనుమ జ్జాంబవదంగదనల నీల ప్రముఖులు కూడ సీతాదేవి జాడను కనుగొనుటలో విఫలమనోరథులైరి. తన తనయుని ఎవరో చంపినారను కోపముతో కండు వనునొక మహాముని అడవిలోని స్థావర జంగమముల నన్నింటిని తనశాపముతో నశింపజేసెను. దానికి చుట్టు ప్రక్కలకూడ ప్రాణిసంచారము లేకుండెను అట్టియశరణ్యమైన యరణ్యమునతిక్రమించి మఱియొక అరణ్యమునకు చేరుకొనితిఅచ్చటవారొకరాక్షసునిజూచిరి అత డేరక్షః పతియగురావణుడని

యెంచి, వానితో యుద్ధమునకు సన్నద్ధులైరి.

వి — పుష్పితాగ్రావృత్తము. కండుమహర్షిశాపమును గూర్చి శ్రీరామాయణములో నిట్లున్నది. "సత్యవాది, తపోధనుడు, క్రోధనుడు నియమవంతుడు, నగుకండు మహర్షి యొండు గలడు పదివత్సరము లవయః పరిమితిగలఅమ్మహర్షికుమారుడొకడు_అడవిలో కనబడదయ్యెను కోపించినయమ్ముని అయ్యరణ్యమును ప్రాణి సంచార శూన్యమగు నట్లు శపించెను. నాటి నుండి నయ్యరణ్యమశరణ్యము. మృగపక్షి వర్జితము సమీపింపరానిదియునాయెను. తథాచ శ్రీరామాయణమ్—

కండుర్నామ మహాభాగ సత్యవాదీ తపోధనః
మహర్షిః పరమామర్షీ నియమై ర్దుష్ప్రధర్షణః

తస్య తస్మిన్వనే పుత్రోబాలకో దశవార్షికః,
ప్రణష్టో జీవితాంతాయ క్రుద్ధస్తత్ర మహామునిః

తేనధర్మాత్మనా శప్తంకృతం తత్ర మహద్వనమ్.
అశరణ్యం దురాధర్షం మృగపక్షి వివర్జితమ్.

గ — తతస్తారేయ వచనాత్తత ఇతోవిచిత్యనికటగిరిసానుశయాః స్సానుశయా స్సవిలాశయా, జలచర పతఙ్గ పతనోత్పతనానుమీయ మాన పల్వలో పశయం, కిమపి కుహరమవగాహ్య, తత్ర కంచన కాంచనమయం మయా మాయా నిర్మితం, విహితతపో భంగాయై, సురాంగనాయై హేమాయై దుహితేన వితీర్ణం మేరు సావర్ణిదుహితా స్వయం ప్రభయా కృతావనం వనోద్దేశమవిశన్. 65

తతః కృతాతిథ్యాయ్యా స్స్వయంప్రభాయాః, ప్రభావేన బిలా దుత్తీర్ణానాం సమయాతిపాతా దాపతిష్యతి సుగ్రీవదండ ఇతి వికృతి ముప్యేత సంగత మనోగదీనాంగవేన పవనతనయవచన ప్రత్యయ ప్రత్యానీత ప్రకృతి నా సహపార్ర్ష్యోపవిశము పేయుషాం ప్లవంగ పుంగవానాం పరిదేవన-కథాప్రసఙ్గ జటాయుషో నిధనం నిశమ్య వింధ్య రంధ్రా ద్వినిహిత సంపాతస్సంపాతిర్నామ గృధ్రరాజస్తానేవమవాదీత్ 86

తా — తతః = తరువాత, తారేయవచనాత్ = తారా నందను డగు నంగదుని యాజ్ఞానుసారము, తతఇతః = అటునిటు, విచిత్య, నికటగిరి సాను-శయాః = దగ్గరలోనున్న కొండనెత్తములమీద వరున్న వారై, సానుశయాః = సంతోషముతో కూడిన వారై, సవిలాశయా = నీటియందు ఆశతో, (పిపాసతో) జలచర= నీటిలో తిరుగునట్టి పతంగ= పక్షులయొక్క, పతనోత్పతన = ఎగురుట, వాలుట మున్నగు గమన విశేషములతో, అను మీయమాన = ఊహింపబడుచున్న, పల్వల = చిన్న సరస్సుయొక్క, ఉపశయం = ఆశ్రయముగల, కిమపి = ఒకా నొక కుహరం = కొండ గుహను, అవగాహ్య = ప్రవేశించి,

తత్ర=ఆగుహలో, కాంచనమయం=బంగారముతో తయారుచేయ బడినదియు, మయ మాయామయం = మయుడనురాక్షసశిల్పియొక్క మాయా ప్రాభవమువలన తయారు చేయబడినదియు, విహిత తపో భంగాయై = చేయబడిన తపోభంగముగల, సురాంగనాయై = అప్స రోంగనయగు, హేమాయై = హేమకొఱకు, దుహిణేన = బ్రహ్మచే, నిర్దిష్టం = ఇవ్వబడినదియు, మేరుసావర్ణేః = మేరుసావర్ణియను వాని, దుహితా = కుమార్తెయగు, స్వయంప్రభయాః = స్వయంప్రభ యను నామెచే, కృతావనం= చేయబడుచున్న రక్షణగల, వనోద్దేశం= వనప్రదేశమును, అవిశన్ = ప్రవేశించిరి.

తతః = తరువాత, కృతాతిథ్యయోః = చేయబడిన అతిథిపూజ గల స్వయంప్రభాయాః = స్వయంప్రభయొక్క, ప్రభావేన = సామర్థ్యముచే, బిలాదుత్తీర్ణానాం = కొండగుహనుండి బయటకు వచ్చిన ఆ వానరులకు, సమయాతిపాతాత్ = గడువుకాలము అతిక్రమించుటవలన సుగ్రీవదండః = సుగ్రీవునివలన శిక్ష (దండనము) కలుగగలదని ఇతి మత్వా = తలచి, విక్రుతిం = ప్రకృతివైకల్యమును, ఉపేత్య = పొంగదిన వారును, పవనతనయ = హనుమంతునియొక్క, వచనప్రత్యయాత్ = మాటయందలి విశ్వాసముచే ప్రత్యానీత = తీసికొనిరాబడిన, ప్రకృతినాంసాకం = నిజస్థితిగలవాడును, సంగీత = కలిగిన, మనోగదేన = మానసికవ్యాధి గల, అంగదేనసాకం = వాలి పుత్రుడగు అంగదునితోకూడ, ప్రాయోపవేశం = అమరణ నిరశన వ్రతదీక్షను, ఉపేయుషాం = పొందినటువంటి, ప్లవంగమపుంగవానాం = వానరశ్రేష్ఠుల యొక్క పరిదేవన కథాప్రసంగే = విలాపగోష్ఠి ప్రస్తావములో, జటాయుషః = జటాయువుయొక్క, నిధనం = మరణమును, నిశమ్య = విని, వింధరంధ్రాత్ = వింధ్యాద్రిగుహనుండి, విహిత స్వపాతః = బయటకు వచ్చిన, సంపాతిర్నామ = సంపాతి యను, గృధ్రరాజః = గద్దలఱేడు త్యా = ఆ వానరులను గూర్చి, ఏవం = ఈ చెప్పబోవు విధముగ అవాదీత్ = పలికెను.

తా॥ అంగదుని యాజ్ఞానుసారము వానరులందరు నిటునటు వెదకిరి. కొంతవరి కొండలమీద పరుండిరి. సంతాపమును జెందిరి మంచినీరు త్రాగవలెనను కోరిక వారికి కలిగినది. హంసలు మున్నగు గల నీటిలో తిరుగు పక్షుల పతనోత్పతనములను వారు చూచిరి. దగ్గఱ లోనే చెలువొకటి యుండి యుండవచ్చునని వారూహించిరి. అచ్చెరువుతో అచ్చెరువుగల గుహను వారు ప్రవేశించిరి. అచ్చట మయుని

మాయాబలముచే నిర్మింపబడిన బంగారుమేడను గాంచిరి. తపోధనుల తపోభంగమును గావించిన హేమయను నప్సరోంగనకు, ఆ మేడను బ్రహ్మకానుకగా నిచ్చెను. హేమ ఆ మేడను మేరుసావర్ణి కూతురగు స్వయంప్రభకు నిచ్చెను. దానిని స్వయంప్రభ కాపాడుచున్నది. వానరులందఱు నచ్చటకు జేరిరి.

వానరులందఱకు స్వయంప్రభ మనోహరము రుచిరమునైన అతిథ్యము నొసంగెను. తరువాత వారిని ఆమె గుహా బహిః ప్రదేశమునకు చేర్చెను. గడువు దాటుటవలన సుగ్రీవదండము ననుభవింపక తప్పదని వారు మనోవ్యథను పొందుచుండిరి. సుగ్రీవుని దండమును భవించుటకంటె ప్రాయోపవేశము సేయుటమేలని అంజనేయుడుగుర్తు చేయగా వాలి పుత్రుడగు నంగదునితోకూడ వానరులందఱు ప్రాయోపవేశము నొనరించుటకు నంసిద్ధులైరి. ప్రాయోపవిష్టులైన వానరులలో మాటలలో జటాయువు చనిపోయెనన్న వార్త విన్న సంపాతియను గద్దలఱేడు మిధ్యగుహనుండి బయుటకువచ్చి, వారితో నిట్లనియె.

వి — వానరులో గుహనొకదానిని ప్రవేశించి, దానిలో మయ మాయానిర్మితంబై కాంచనమయంబైన భవనంబును గాంచిరి. మయుని తపోభంగమును గావించిన నృత్యగీతవిశారదయగు హేమయను నప్సరాంగనకు ఆభవనంబు బ్రహ్మకానుకగా నిచ్చెను. హేమ ఆ భవనంబును తన ప్రియసఖియు, మేరుసావర్ణి కొమరితెయునగు స్వయంప్రభకు నిచ్చెను. దానిని స్వయంప్రభ కాపాడుచుండెను.

ఉక్తంచ శ్రీరామాయణే—

“ దుహితా మేరుసావర్ణే రహంతస్యాస్స్వయంప్రభా

ఇదం రక్షామిభవనం హేమాయా వానరోత్తమ
మమప్రియసఖీహేమనృత్తగీతవిశారద,
తయాదత్తవరా చాస్మిరక్షామిభవనోత్తమమ్.

స్వయంప్రభా ప్రభావముచే వానరులందఱు బిలమునుండి బయట పడిరి. సుగ్రీవునిచే నిర్ణయింపబడిన సమయ మతిక్రమించుటచే, కపివరులందఱు, చండశాసనుడగు సుగ్రీవుని దండము తప్పదని నిశ్చయించికొని, ప్రాయోపవేశము చేయుట ప్రారంభించిరి. ప్రాయోపవేశమనగా దక్షిణాగ్రములగు దర్భలోగల నేలమీద పరుండి చనిపోవుటకు సంకల్పించుకొనుట.

ఆచమనం బొనరించి దక్షిణాగ్రంబులగు దర్భలమీద, మరణింపగోరినవారై వానరులు – సముద్రపుటుత్తరపువైపున కూర్చొనిరి. అని రామాయణములోనున్నది. ఉక్తంచ శ్రీరామాయణే—

ఉపస్పృశ్యోదకం వింధ్యే ప్రాఙ్ముఖాస్సముపాదిశన్,
దక్షిణాగ్రేషు దర్భేషు – ఉదక్తీరంసమాశ్రితాః
ముమూర్షవో హరిశ్రేష్ఠా ఏతత్క్షమమితిః స్మహ, ఇతి
రామస్య వనవాసంచ క్షయం దశరథస్య చ
జనస్థానవధంచైవ వధంచైవ జటాయుషః
విలాపగోష్ఠి ప్రసంగేన

తథాచ శ్రీరామాయణమ్—

" సంపాతిర్నామ నామ్నాతు చిరంజీవీ విహఙ్గమః
భ్రాతాజటాయుష శ్శ్రీమాన్ప్రఖ్యాతబల పౌరుషః

కందరాదభి నిష్క్రమ్య సవింధ్యస్య మహాగిరేః,
ఉపవిష్టాన్ హరీన్దృష్ట్వా హృష్టాత్మాగిర మబ్రవీత్.

వ — కేయూయ మక్షత బలేవ్యభిధాయ పాపం,
పత్నే జటాయుషి మమశ్రవసీద హన్తః
కస్మాత్పురా కిరణదాహిత పక్షయుగ్మం,
తిగ్మాంశు ముష్ణవచసాశ శిరీకురుధ్వే.

అ — అక్షతబలేఽపి = అప్రతిహత పరాక్రముడైన పత్నే = నా తమ్ముడగు జటాయువు నందు పాపం = నిధనమును, అభిధాయ = చెప్పి, మమ — నా యొక్క శ్రవసీ = చెవులను దహంతః = తగలబెట్టు చున్న యూయం = మీరు, కే = ఎవరు? కస్మాత్ = ఎందువల్లనైతే పురా = పూర్వము, అనగా సూర్య మండలము వఱకు ఎగురు నట్టి సమయములో, కిరణ = కిరణములచే, దాహిత = తగల బెట్టబడిన, పక్షయుగ్మం = రెండు రెక్కలుగల తిగ్మాంశుం = తీక్ష్ణమైన కిరణములు గల సూర్యుని ఉష్ణవచసా = అతి తీక్ష్ణమైన వాక్కులతో శిశిరీకురుధ్వే = చల్లబరుచుచున్నారో (మీరెవరు?)

తా — ఓయీ మీరెవరు? అప్రతిహత పరాక్రముడగునాతమ్ముని మరణ వార్తను వినిపించి నా చెవులను తగల బెట్టుచున్న మీరెవరు? మఱియు తనతీక్ష్ణ కిరణములతో నాఱెక్కలను తగలబెట్టిన ఉష్ణకిరణుని కూడ మీరు మీ వెచ్చని మాటలతో చల్లబరుచుచున్నారు మీరెవరు?

గ — తతస్తైః ప్రస్తావిత ప్రవృత్తిస్సంపాతిః ప్రోషితాయుషి జటాయుషి నివాపాంజలిం నిర్వర్త్య పురాకదాచిదామి షాన్వేషణాయ ప్రేషితేన నిజ సుతేన సుపార్శ్వ నామ్నా సమామ్నాతం మహేంద్ర మహీధ్రరంధ్ర నిర్గత దశవదన నీయమాన జానకీ పరిదేవనం జావాన

సూక్ష్మచక్షుః పునరప్యువోచత.

అలంకాతర్కేణ లఙ్కాభిధానాం రాజధానీమధివసతి సీతాదశవదన నీతా,

తత్ర గచ్ఛన్తు భవన్తః ౮౮

అ — తతః = తరువాత, తైః = ఆవానరులచేత ప్రస్తావితపరివృత్తిః = మొదటి నుంచి చివరవఱకు చెప్పబడినవృత్తాంతముగలవాడై సంపాతిః = జటాయువుయొక్కయన్నయగు సంపాతి ప్రోషితాయుషే = చనిపోయిన, జటాయుషే = జటాయువుకొఱకు నివాపాంజలిం నిర్వర్త్య = తర్పణాంజలిదానము చేసి. పురా = పూర్వము అమిషాన్వేషణాయ = ఆహారమగు మాంసమును వెదకుటకై ప్రేషితేన = పంపబడిన సుపార్శ్వ నామ్నా = సుపార్శ్వుడను పేరుగల నిజతనయేన = తనకుమారునిచే, సమామ్నాతం = చెప్పబడిన మహేన్ద్ర, మహీధ్ర = మహేంద్ర పర్వతము యొక్క రంధ్రనిర్గత = గుహనుండి వెలువడిన వాడైన దశవదన = రావణునిచే నీయమాన = తీసికొని పోబడుచున్న, జానకీ = సీత యొక్క, పరిదేవనం = విలాపమును జానానః = తెలిసి కొన్న వాడై. సూక్ష్మచక్షుః = ముందువెనకల నాలోచించు దృష్టిగల సంపాతి, పునరప్యువోచత = తిరిగియిట్లనెను.

అలంకాతర్కేణ = భయపడకుడు దశవదన నీతా సీతా = రావణునిచే తీసికొని పోబడిన సీతాదేవి లంకాభిధానాం = లంకయను పేరుగల, యాతుధాన రాజధానీం = రాక్షస రాజధానిలో అధివసతి = ఉంటున్నది భవన్తః = మీరు తత్ర = ఆలంకాపట్టణమునకు గచ్ఛన్తు = పయనింపుడు.

తా — వానరుల వలన వృత్తాంతము నంతయు సంపాతి తెలిసుకొనెను. మరణించిన జటాయువునకు నివాపాంజలి నిచ్చెను,

పూర్వమొకప్పుడు మాంసాన్వేషణకై సుపార్శ్వుడను తనతనయుని పంపెను మహేంద్ర పర్వతగుహ నుండి వెల్వడిన దశవదనుడు సీత నపహరించి వెళ్లుచున్నట్లు సీత విలపించుచున్నట్లు తన తనయుడు చెప్పిన వృత్తాంతము గుర్తుకురాగా వారికి తెలియజేసెను. మఱియు సూక్ష్మ దృష్టియగు సంపాతి తిరిగి వారితో నిట్లనియె. భయపడకుడు దశవదనునిచే తీసికొని పోబడిన సీత రాక్షసరాజధానియగులంకాపట్టణము లోనున్నది మీరచ్చటకు వెంటనే పయనింపుడు.

ప — కించ —

దివాకరప్లోషభవాం మమార్తిం
నిశాకరో నామమునిర్నిరస్యన్
జగాద వః కార్యమహార్యధైర్యాః
క్షణేన తాంద్రక్ష్యథ రామపత్నీమ్, 90

అ — కించ = మఱియు, దివాకరప్లోషభవాం = సూర్యుని యొక్క దాహముచే కలిగిన మమార్తిం = నా యొక్క బాధను, నిరస్యన్ = పోగొట్టుచున్న నిశాకరో నామమునిః = నిశాకరుడను అతీతానాగత దర్శియగుముని,

హే అహార్య ధైర్యాః = ఓ అపరిహార్య ధైర్య సంపన్నులారా! వః = మీ యొక్క కార్యం = కరణీయమును, జగాద = పలికెను. తత్ = అందు వలన క్షణేన = త్వరలో రామపత్నీం = శ్రీరామునిభార్యయగు సీతను ద్రక్ష్యథ = చూడగలరు.

తా — మఱియు సూర్యుని ఉష్ణోగ్రతకు నా రెక్కలుకాలిపోగా బాధను పోగొట్టదలచిన నిశాకరుడను మునీశ్వరుడిట్లు పలికెను? ఓ యీబాధ పడకుము, రామదూతలు సీతాన్వేషణార్థము నీ దగ్గఱకు

రాగలరు అప్పుడు నీ రెండు ఱెక్కలు యథాతథముగ నుండ కలవు" కనుక రామ దూతతో ధైర్యమును వీడకుడు త్వరలోనే మీరు శ్రీరామ పత్నిని చూడగలరు. మునుల మాటలెన్నడును వ్యర్థము కాజాలవు

వి — దివాకరుని వలన నా ఱెక్కలు కాలి పోవుటనెఱింగి నిశాకరుడను ముని నాయార్తిని పోగొట్టుచు నిట్లనెను రామ దూతలగు వానరులు రాగలరు వారితో రామమహిషి లంకలో నున్నది అనిచెప్పుము. అప్పుడు నీ ఱెక్కలు నీకు యథాస్థితిలోనుండ గలవు. తదనుగుణముగ మీరును వచ్చినారు నా ఱెక్కలును నాకు వచ్చినవి, అని రామాయణములోనున్నది. తథా చ శ్రీరామాయణమ్—

"ఏష్యంతి ప్రేషితాస్తత్ర రామ దూతాః ప్లవంగమాః
అఖ్యేయా రామ మహిషీ త్వయా తేభ్యో విహంగమ!"

సూర్యుని వలన కలిగిన సంతాపము, చంద్రుని వలన తీరుట సముచితమే కదా! త్వరలో మీరు రామపత్నినిచూడ గలరు. ముని వచన మసత్యము కానేరదు.

ఉపజాతి వృత్తము.

వ — ఇతి బ్రువాణం కృత సౌహృదం తం
సంపాతి మాపృచ్ఛ్య పరావరజ్ఞమ్,
ప్రవృద్ధహర్షాః ప్రథిత ప్రతానిః
ప్రతస్థిరే వానరయూథనాథాః 91

అ — ఇతి = ఈప్రకారముగ, బ్రువాణం = చెప్పుచున్నవాడును

కృత సౌహృదం = చేయ బడిన మైత్రిగలవాడును, పరావరజ్ఞం = ముందు వెనుకలు తెలిసిన వాడును అగు తం = ఆసంపాతిని ఆపృచ్ఛ్య = అడిగి (వానివద్ద సెలవుగైకొని) ప్రవృహర్షాః = (సీత జాడ తెలియుటవలన) వృద్ధినొందిన సంతోషముగల వారై ప్రథిత ప్రిఖావాః = ప్రఖ్యాతబల పౌరుషములుగల వానర యూధనాథాః = అంగదాది వానరయూథ పతులు ప్రతస్థిరే = బయలుదేరిరి

తా — ఇట్లుచెప్పిసంపాతి వారితోసఖ్యమునుకూర్చుకొనెను. ముందు వెనుకలు తెలిసిన సంపాతి వద్ద సెలవు గైకొని ప్రఖ్యాత బలపౌరుష సంపన్నులగు నా వానరవీరులు సంతసించుచు, అట నుండి పయన మయిరి.

ప — పర్యాప్త ప్రిముదము పేయుషాం కపీనాం

పంథానం దశముఖ మార్గ మార్గణాయ

పాథేయాకృతవపి రాజ శాసనానాం

పాథోధిర్న యన పథాతిథిర్బభూవ. 32

అ — పర్యాప్త ప్రిముదం = పరిపూర్ణానందముచు కలిగించు పంథానం = మార్గమును ఈ పేయుషాం = పొందిన వారును దశముఖ మార్గ మార్గణాయ = రావణుని యొక్క త్రోవను వెదకుట పాథేయా కృత = సారిబత్తెముగ జేసికొన బడిన, కపిరాజ = సుగ్రీవునియొక్క శాసనానాం = ఆజ్ఞకలవారునగుకపీనాం = వానరులకు పాథోధిః = సముద్రము నయనపథాతిథిః బభూవ = దృగ్గోచరమాయెను.

తా — ఆ వానరులు, హర్షసంపాదకమగు సంపాతి చెప్పిన మార్గ

సమసరించిరి. సుగ్రీవాజ్ఞయను దాంబత్తైమును గైకొని రావణుని మార్గమును వెదకగోరిన యాకపివీరులకు సముద్రము కన్నులపండుగ నొనరించెను.

వ — సుత్రామ పుత్రారి శిలీముఖానాం
స్మృత్వాగణస్తత్ర వలీముఖానాం,
అపామపారస్య నిధేశ్చ పశ్చాత్
అవాఙ్ముఖోవక్తు మవాఙ్ముఖోఽభూత్. 93

అ — వలీముఖానాంగణః=వానరయూథము, సుత్రామపుత్రారి శిలీముఖానాం = వాలికి శత్రువగు రామునియొక్క, అమోఘములగు బాణములను, స్మృత్వా = గుర్తు తెచ్చుకొని, అపారస్య = అంతులేని, అపాంనిధేశ్చ = సముద్రమునున్న, స్మృత్వా = గుర్తు తెచ్చుకొని, పశ్చాత్ = గుర్తు తెచ్చుకొన తరువాత, అవాఙ్ముఖః = అధోదృష్టిగల దియై, వక్తుం = చెప్పుటకు, అవాఙ్ముఖః=మూగవోయినది. అభూత్= అయెను.

తా — వాలినే నేలగూలవేసిన రాముని బాణములను, అపార పారావారమును గుర్తుకు తెచ్చుకొన్న యా వానరవీరులు తలలు వంచు కొని ఏమి చేయుటకు తోచనివారైరి.

వి — ఉపజాతి వృత్తము ; శిలీముఖానాంవలీ ముఖానాం, అపాంమపారస్య, అవాఙ్ముఖః - అవాఙ్ముఖః, అనుద్విరుకములతో కవి ఈ శ్లోకములో శబ్దవైచిత్ర్యమును సాధించి తన ప్రతిభనువెల్లడింనాడు.

గ — తదను వానరసేనామే సామవార్య మాణతర్యా మిత్థ వద మదజ్గదః. 94

అ — తదను= తరువాత, అవార్యమాణ = వారింపబడని, కాకా

ర్యాం = భయముగల, ఏనాం వానరసేనాం = ఈ వానరసైన్యమును గూర్చి, ఇత్థం = ఈ చెప్పబోవు విధముగ, అంగదః = అంగదుడు, అవ దత్ = పలికెను.

తా — అతిభీతిని పొందిన వానరసైన్యమును జూచి యువ రాజగు నంగదుడిట్లనియె.

వ — కిమితిభజథమానం వానరమౌనహీనాః
సగరరచితకుల్యోల్లంఘనే కుంఠితాశాః,
అకలశభవలేహ్యం దుశ్శమం బాడబాద్యైః
అనవధి మయశోబ్ధిం కిం సమర్థాస్తరీతుమ్. ౪౫

అ — మానహీనాః = అభిమానశూన్యులైన ఓ వానరవీరులార! సగరరచితకుల్యోల్లంఘనే = సగరునిచే తయారుచేయబడిన చిన్న కాలువను దాటుటయందు, కుంఠితాశాః = భగ్నోత్సాహులై కిమితి = ఎందు కొఱకు, మేనం = మౌనమ:ను, భజథ = వహించుచున్నారు? అకలశ భవలేహ్యం = కుంభసంభవునిచే, ఆస్వాదనీయము కానిదియు, బాడ బాద్యైః = బడబాగ్ని మున్నగు వానిచే దుశ్శమం = శమింపశక్యము గానిదియు, అనవధింప = హద్దులులేనట్టిదియు, అగు అయశోబ్ధిం = అపకీర్తి సాగరమును, తరీతుం = దాటుటకు, సమర్థాః, కిం = సమ ర్థులు కాగలరా?

తా — అభిమానశూన్యులగు హో వానరవీరులారా! సగరునిచే త్రవ్వబడిన ఈ చిన్నకాలువనే మీరు దాటలేరా? అగస్త్యమహర్షిచే త్రాగ బడనిది బడబాగ్నికి లొంగనిది, హద్దులులేనిదియునగు అపకీర్తి మహా సాగరమునెట్లు మీరు దాటగలరు?

వి — మాలినీ వృత్తము. "మానహానికంటె ప్రాణహాని మేలు

అను నానుడిని మానధనులగు వానరులకు అభిమానధనుడగు నంగదుడు గుర్తుచేయుచు సగరపుత్రులచే త్రవ్వబడిన యీ చిన్నకాలువనే దాటలేని మీరు బడబాగ్నిచే పరిభూతము కానిదియు, అగస్త్యాదను బొట్టివానిచే త్రాగబడనిదియునగునపకీర్తి సముద్రమునెట్లు దాటగలరని సూటిప్రశ్న వేసెను. గౌరవము గలవానికి అపకీర్తి, మరణముకంటె నెక్కువ హానికరమని ప్రబోధించెను. తథాచ గీతాయాం—

"సంభావితస్యచాకీర్తిర్మరణాదతిరిచ్యతే."

గ — తతః పారావారస్య పారిణతాయాం, ఆత్మశక్తేరియత్తాం ప్రత్యేకం కథయత్సు (వానర) యూథపేషు నిర్దిశ్యాంజనేయంప్రభంజనసంజాతం జాంబవానిత్థ మభిహితవాన్.

అ — తతః = తరువాత, వానరయూథపేషు = గజగవయ గవాక్షాది వానరయూథనాయకులు, పారావారస్య=సముద్రముయొక్క, పారీణతాయా పాతగమనమునందు, ఆత్మశక్తేః = నిజసామర్థ్యము యొక్క, ఇయత్తాం=పరిమాణమును ప్రత్యేకం ఒక్కరొక్కరు, కథయత్సు=చెప్పుచున్నవారుకాగా, ప్రభంజన సంజాతంఅంజనేయం= అంజనాప్రభంజనులపుత్రుడగు హనుమంతునిగూర్చి, నిర్దిశ్య=చూపించి జాంబవాన్ = జాంబవంతుడగు, ఇత్థం = ఈ ప్రకారముగ, అభిహితవాన్ = చెప్పినవాడాయెను.

తా — పిమ్మట, గజగవయగవాక్షాదియూథ నాయకులు సముద్రతరణములో నిజసామర్థ్యమును నిరూపించిరి. అంతటపూర్వజ్ఞాన సంపన్నుడగు జాంబవంతుడు, అంజనా ప్రభంజనుల నందనుడగు హనుమంతుని జూపి ఇట్లనియె.

వి — వానరులలో గట్టాడనువాడు, పదియోజనములు దాటగల

నని చెప్పెనని రామాయణములో నున్నది   తథాచ రామాయణము—

“అబభాషి గజస్తత్ర ప్లవేయం దశయోజనమ్.”

వ — హే వీరాయూథనాథాః పరిణతిపరుషః కార్యఅసిద్ధ్విషాదః
కస్మాదస్మాక మేతజ్జలనిధితరణే శక్తి రేతావతీతి.
స్మృత్వారాజ్ఞః ప్రతిజ్ఞామయమనిలసుతో లంఘనాయోన్ముఖశ్చేత్
ఖేదః ప్రాదుర్భవేత్కిం కథయత పయసామాస్పదేగోష్పదేవా 97

అ — హే వీరాః = ఓ వానరవీరులారా! యూథనాథాః=యూథశ్రేష్ఠులారా! అస్మాకం = మనకు, ఏతజ్జలనిధితరణే = ఈ సముద్రమును దాటుటలో, శక్తిః = సామర్థ్యము, ఏతావతీతి = ఇంతమాత్రమే అని పరిణతి పరుషః=ఫలకాలవిరసమైన, విషాదః=చేతోభంగము, తస్మాత్= ఎందువలన, కార్యః = పొందవలసియున్నది? అయం అనిలసుతః = ఈ వాయునందనుడు, రాజ్ఞః = సుగ్రీవునియొక్క, ప్రతిజ్ఞాం=ప్రతిజ్ఞను స్మృత్వా=స్మరించిన వాడైనచో, లంఘనాయ = దాటుటకు, ఉన్ముఖశ్చేత్=ప్రారంభించినవాడయినచో, పయసామాస్పదేవా=సముద్రమునందుకానీ, గోష్పదేవా= ఆవుయొక్క అడుగునందు, గానీ ఖేదః=ఖేదము ప్రాదుర్భవేత్కిం? = కలుగునా యేమి?

తా — ఓ వానరవీరులారా! యూథనాథులారా! సముద్రోల్లంఘనములో నా శక్తి యింత, నా శక్తి యింత అని ఫలముఖగౌరవము చూపనేల? ఈ వాయునందనుడు, సుగ్రీవుని ప్రతిజ్ఞనుస్మరించి, సముద్రోల్లంఘనము చేయనెంచినచో, శతయోజన విస్తీర్ణమైన ఈ సముద్రము, వానికి గోష్పదము మాత్రమే కాగలదు. గోష్పలంఘనమువలె సముద్రలంఘనము వానికి చాల సుకరము.

ప — ఉదపతదుపభోక్తుం మండలం చండభానోః
పరిణత ఫలబుద్ధ్వా బాలభావేఽపిసోఽయమ్
తదను కులిశపాతక్షుణ్ణగండాయతస్మై
వరమదిశదమేయం వాయుతృప్త్యై విధాతా

అ — సోఽయం = ప్రసిద్ధుడైన హనుంతుడు, బాలభావేఽపి = చిన్నతనమునందే, పరిణతఫలబుద్ధ్యా = మగ్గినపండు అనుభ్రాంతితో చండభానోః మండలం = సూర్యమండలమును, ఉపభోక్తుం = తినుటకు ఉదపతత్ = గగనమునకు ఎగిరినవాడాయెను, తదను = ఎగిరినతరువాత, కులిశపాత = ఇంద్రునిచే ప్రయోగింపబడిన వజ్రాయుధముయొక్క దెబ్బతో, క్షుణ్ణగండాయ = నలిగినబుగ్గ కలిగిన, తస్మై = ఆ హనుమంతునికొఱకు, విధాతా = చతుర్ముఖబ్రహ్మ, వాయుతృప్త్యై = వాయుదేవుని తృప్తికొఱకు, అమేయం = అనదృశ్యమైన, వరం = కాంక్షితమును, అదిశత్ = ఇచ్చెను.

తా — హనుమంతుడు చినతనమునందే, ఎఱ్ఱనిపండనుభ్రాంతితో సూర్యమండలమును మ్రింగుటకు మింటికెగిరెను. ఇంద్రుడు వజ్రాయుధముతో వాని బుగ్గమీదకొట్టగా, బుగ్గకొద్దిగా నలిగెను. దీనిని జూచి వాయువు కోపింపగా, వానిని తృప్తిపరచుటకు చతుర్ముఖబ్రహ్మ హనుమంతునకు చాల వరముల నిచ్చెను.

ప — ఇత్థం బాంబ పతా పరావర విదా సంధుక్షితప్రాభవః
కృత్వావృద్ధిముపేయుషా స్వవపుషా త్రైవిక్రమప్రక్రమమ్
ఆరుహ్యాద్రితటం యథోచితమ సౌసమ్మాన్య సైన్యాధిపా
నాసన్నానథ సన్నహా తరితుం వారాంనిధింమారుతిః ౨౨

అ — ఇత్థం = ఇవ్విథముగ పరారపవిదా = పూర్వోత్తరకార్య పర్యాలోచనముగల జాంబవతా = జాంబవంతునిచే సంధుక్షితప్రోత్కర్షః = వృద్ధినొందింప బడిన సామర్థ్యముగల వాడై, అసౌ మారుతిః = ఈ వాయునందనుడు త్రైవిక్రమం = త్రివిక్రమస్వామికి సంబంధించిన, ప్రక్రమం = ప్రతాపమును ఉపేయుషా = పొందిన స్వవపుషా = నిజ శరీరముతో వృద్ధింకృత్వా = వృద్ధిని పొంది అద్రితటం = మహేంద్ర పర్వతము యొక్క చరియను, ఆరుహ్య = ఎక్కి, ఆసన్నాన్ = సమీపములోనున్న సైన్యాధిపాన్ = వానర సేనానాయకులను. యథోచితం = తగినరీతిలో సమ్మాన్య = గౌరవించి, అథ = తరువాత. వారాంనిధిం = సముద్రమును, తరితుం = దాటుటకు సన్నాహా = సన్నద్ధుడాయెను. (ప్రయత్నించెను)

తా — పూర్వజ్ఞాన సంపన్నుడైన జాంబవంతుడు హనుమంతుని ప్రోత్సహించెను వామనుడు త్రివిక్రముడైనట్లుగ, సూక్ష్మరూపములో నున్న హనుమంతుడు ప్రవృద్ధశరీరుడై మహేంద్రాద్రినధిరోహించి సేనానాయకుల నందఱిని గౌరవించి సముద్రమును దాటుటకు ప్రయత్నించెను







